

# జ్వాలాద్వీపం

నర్మదానది తీరాన గల ధవళగిరి రాజ్యాన్ని తారకేశ్వరుడనే రాజు పరిపాలిస్తూండేవాడు. ఆయనకు ఇద్దరు కుమారులు. పెద్ద కుమారుడి పేరు శూరసేనుడు; అతడికి పాతికేళ్ళ వయసు. చిన్నవాడు పద్దెనిమిదేళ్ళవాడు; పేరు చిత్రసేనుడు.

ఈ ఇద్దరు రాజకుమారులూ ఒకనాటి ఉదయం పరివారాన్ని వెంటబెట్టుకుని, వినోదార్థం వేటకై అడవికి వెళ్ళారు. అడవిలో కొంతదూరం పోయిన తరవాత, వాళ్ళకు ఒక లేళ్ళమంద కనిపించింది. రాజకుమారు లిద్దరూ తమతమ గుర్రాలను అదిలించి, ఆ లేళ్ళ గుంపుపై బాణాలు ప్రయోగిస్తూ, క్రమంగా తమ పరివారాన్నుంచి వేరుపడి అడవిలో చాలా దూరం వెళ్ళిపోయారు.

హఠాత్తుగా వారికి ఒక పొద చాటు నుంచి సింహం గర్జించిన ధ్వని వినబడింది. రాజకుమారు లిద్దరూ, ఆ ధ్వని వచ్చిన వైపుకు తలలు తిప్పి, బాణాలు ఎక్కుపెట్టే లోపలే, రెండు సింహాలు గర్జించుతూ వారికేసి దూకినై. సింహాలను చూస్తూనే రాజకుమారులు ఎక్కివున్న గుర్రాలు బెదిరి వెనుదిరిగి వేగంగా పారిపోసాగినై.

రాజకుమారులలో చిన్నవాడైన చిత్రసేనుడు ఎక్కివున్న గుర్రం, యజమాని ఎంత బలంగా కళ్ళెం లాగినా ఆగక, చెట్ల సందు నుంచి బాణంలా దూసుకు



పోతూ, కొంతసేపటికి ఒకానొక కొండ ప్రాంతాన్ని చేరి, నురగలు కక్కుతూ కింద పడిపోయి ప్రాణాలు విడిచింది.

ఆసరికి చిత్రసేనుడు బాగా అలసిపోయి వున్నాడు. అతడు తన అన్నకోసం నలుమూలలా పరికించి చూశాడు. ఎక్కడా అతడి జాడ కనిపించలేదు. తను పరివారాన్ని వదిలి అడవిలో చాలాదూరం వచ్చినట్టు అతడికి తోచింది. ఆ ప్రాంతమంతా ఆకాశాన్నంటుతున్న పెద్దపెద్ద మానులతో, చీకటిమయంగా వున్నది. చెట్ల కొమ్మల్లో కోతులూ, రకరకాల పక్షులూ, ఊడల్లా వేలాడుతున్న పెద్ద సర్పాలూ అతడికి కనిపించినై.

ఈ పరిసరాలను చూసి చిత్రసేనుడు చాలా భయపడ్డాడు. తను పరివారాన్నుంచే కాక, మానవ నివాసాలుండే ప్రాంతాల కూడా దూరమైపోయినట్టు అతడు గ్రహించాడు. తను ధవళగిరి నగరాన్ని చేరాలంటే కాలినడకనే వెళ్ళాలి. ఆ నగరం ఏ దిక్కుగా వున్నదో కూడా ఆ క్షణంలో అతడికి తెలియదు.

చిత్రసేనుడు తన విషాద పరిస్థితికి వగుస్తూ, ఉన్నచోటు నుంచి కదిలి, అడవిలో కొద్ది దూరం నడిచేసరికి, చిన్న చిన్న తుప్పలతో, పొదలతో నిండి వున్న ఒక కొండ అతడికి ఎదురుగా కనిపించింది. ఆ కొండ పాదంలో చిన్న వాగొకటి ప్రవహిస్తున్నది. వాగులోని నీటిని చూడగానే, చిత్రసేనుడికి దాహంతో తన నాలుక పిడచకట్టుకుపోయి వుండటం తెలిసి వచ్చింది. అతడు వాగులో దిగి దాహం తీర్చుకున్నాడు.

దాహం తీర్చుకోగానే చిత్రసేనుడు కొంత సేద దేరాడు. అతడు వాగు ఒడ్డునే కూర్చుని ముందు కర్తవ్యం గురించి ఆలోచించసాగాడు. బహుశా తన అన్న శూరసేనుడు కూడా తనలాగే, సింహాల వాతపడకుండా తప్పించుకుని వుంటాడు. బెదిరి పరిగెత్తిన అతడి గుర్రం కూడా, అతణ్ణి ఈ ప్రాంతాలకే తెచ్చి వుండ

వచ్చున్న అనుమానం చిత్రసేనుడికి కలిగింది.

ఆ వెంటనే అతడు వాగు ఒడ్డున లేచి నిలబడి, ఎలుగెత్తి పెద్దగా, "అన్నా, శూరసేనా!" అని కేక పెట్టాడు.

చిత్రసేనుడి కేక చెట్లలో, కొండగుహల్లో మార్మోగిన మరుక్షణాన, వాగు అవతల వున్న ఒక గుహలో నుంచి, "ఎవరూ? ఈ ప్రాంతాల మానవ కంఠస్వరం పలికిందా! ఎంత అదృష్టవంతుడివిరా నాయనా, ఒకసారి నా దగ్గరకు రా!" అన్న పిలుపు చిత్రసేనుడికి వినిపించింది.



గుహలో నుంచి వచ్చిన ఆ పిలుపు వింటూనే చిత్రసేనుడు ఉలిక్కిపడి, అంతలోనే ధైర్యం తెచ్చుకుని, ఖంగుమనే కంఠ స్వరంతో, "ఎవరు నీవు? రాక్షసుడివా? లేక నరమాంస భక్షకుడివైన కిరాతుడివా? గుహ నుంచి బయటికి రా, నా కత్తికి ఎర చేస్తాను," అన్నాడు.

చిత్రసేనుడు మాటలు ముగించక ముందే, గుహలో నుంచి చిత్రమైన నవ్వూ, ఆ వెంటనే, "ఎంత సాహసివిరా, వత్సా! నీ వంటి ధైర్యశాలి కోసమే నేను ఎదురు చూస్తున్నాను. నేను మనిషి మాంసం తినే కిరాతుణ్ణి కాదు, రాక్షసుణ్ణి కాదు, ఒకానొక సిద్ధుణ్ణి. నేను ఇంత కాలంగా శ్రమల కోర్చి సంపాయించిన ఒక అమూల్య వస్తువును ఇప్పుడు నీ కివ్వబోతున్నాను," అన్న మాటలూ వినిపించినై.

చిత్రసేనుడు చిటికల మీద ఓ నిర్ణయానికి వచ్చాడు. ఆ గుహలో ఉన్నది రాక్షసుడే అయితే, తను అక్కడ్ణుంచి ప్రాణాలతో ఎలానూ తప్పించుకుపోలేడు, కనక, రాక్షసుడితో పోరాడుతూ ప్రాణాలు వదలటమే క్షత్రియ ధర్మం అనుకున్నాడు. ఒకవేళ గుహలో ఉన్నది నిజంగా సిద్ధుడే అయితే, తనకు కలగబోయే కీడు ఏమీ వుండదు.

ఈ నిశ్చయానికి రాగానే చిత్రసేనుడు ఒర నుంచి కత్తి దూసి, మోకాటి లోతున్న



కనిపించాడు. అతడి తలా గడ్డమూ తెల్లగా నెరిసి వున్నవి. అతడు గుహ మధ్య ఒక ఎత్తయిన వేదిక మీద కూర్చుని వున్నాడు. గుహ పై భాగాన వున్న కంతల నుంచి సూర్యకాంతి లోపల పడుతూండడంవల్ల, గుహ లోపలి భాగం వెలుతురుగా వున్నది.

ముసలి సిద్ధుణ్ణి చూస్తూనే చిత్రసేనుడు తను అంతకు ముందు పరుషంగా మాట్లాడినందుకు నొచ్చుకున్నాడు. అతడు కత్తిని ఒరలో పెట్టి, సిద్ధుణ్ణి సమీపించి చేతులెత్తి నమస్కరిస్తూ, "మహాత్మా, నన్ను క్షమించవలసిందిగా వేడుతున్నాను," అన్నాడు ఎంతో వినయంగా.

చిత్రసేనుడి మాటలకు సిద్ధుడు చిరునవ్వు నవ్వి, "నాయనా, నువ్వు సుక్షత్రియుడివిలా కనబడుతున్నావు. అరవై సంవత్సరాల నా తపశ్శక్తినంతా ధారపోసి ఒక అపూర్వ వస్తువును సాధించాను. కాని, దాన్ని అనుభవించే యోగ్యత నాకు లేదు. నేను దాన్ని సాధించే ప్రయత్నంలో ముసలివాణ్ణయిపోయాను. నాకీ రాత్రి అష్టమి చంద్రుడు అస్తమించే సమయాన మరణం సిద్ధించనున్నది. నేను ఇన్ని శ్రమల కోర్చి సాధించిన ఆ అపూర్వ వస్తువును యోగ్యుడైన వాడికెవడికైనా ఇచ్చి పోదామని చాలా రోజులుగా

వాగు నీటిలో దిగి, అవతలి ఒడ్డుకు చేరాడు. అక్కడ కొండలో చాలా గుహలున్నవి. అందువల్ల తనను పిలిచిన వ్యక్తి ఏ గుహలో వున్నదీ చిత్రసేనుడికి తెలియరాలేదు. అతడు ఒక్కొక్క గుహ దగ్గిరకు వెళ్ళి లోపలికి తొంగి చూడసాగాడు. అంతలో అతడికి దాపుల నున్న ఒక గుహ నుంచి, "నాయనా, భయపడకు. ఇటు రా!" అన్న మాటలు వినిపించినై.

చిత్రసేనుడు కత్తిని మరింత గట్టిగా గుప్పెట బిగించి, ఆ పిలుపు వచ్చిన గుహ ముందుకు వెళ్ళి లోపలికి తొంగి చూశాడు. గుహలో అతడికి ఒక సిద్ధుడు

చూస్తున్నాను. నా తుది ఘడియల్లో నీ అదృష్టం నిన్ను నా దగ్గిరకు లాక్కు వచ్చింది. ఇదుగో, ఆ అపూర్వ వస్తువు!'' అంటూ పక్కనే వున్న ఒక వెదురు బుట్టను చిత్రసేనుడికి ఇచ్చాడు.



చిత్రసేనుడు సిద్ధుడి నుంచి బుట్ట అందుకుని ఆత్రంగా దాని మూతను తెరవ బోయేంతలో, సిద్ధుడు తన దండంతో బుట్ట మూతను గట్టిగా అదిమి, ''నాయనా, తొందరపడి బుట్ట మూతను ఇక్కడ తెరవకు. నీవు ఏ ప్రాంతాల అయితే, నివసించటానికి మక్కువ పడతావో, ఆ ప్రాంతాన దాన్ని తెరిచి చూడటం నీకు క్షేమ కారణం అవుతుంది.'' అన్నాడు.

చిత్రసేనుడు సిద్ధుడు చెప్పిన దానికి అంగీకార సూచకంగా తలాడించి, ''మహాత్మా, మీ దయకు కృతజ్ఞుణ్ణి. నా నుంచి మీరు ఎలాంటి సేవా శుశ్రూషలు కోరినా, చేయటానికి సిద్ధంగా వున్నాను,'' అన్నాడు.

ఈ మాటలకు సిద్ధుడు నవ్వి, ''నాయనా, నీ నమ్రతా, భక్తి చూసి నాకు చాలా ఆనందం కలుగుతున్నది. ఇక కొద్ది ఘడియల్లోనే నేను మరణించ బోతున్నాను. అలాంటి నాకు నీవు చేయ గల సేవ ఏమీ లేదు. కాని, నీకు ఒక్క చిన్న పని మాత్రం చెపుతున్నాను. నీవు గుహ నుంచి బయటికి వెళ్ళిన తరవాత, గుహకు తూర్పు వైపున కోణాకృతిలో వున్న రాతిని కిందకు లాగు. అదే నీవు చేయగల ప్రత్యుపకారం,'' అన్నాడు.

చిత్రసేనుడు సిద్ధుడికి నమస్కరించి గుహ నుంచి బయటికి వచ్చి, అతడు చెప్పిన రాతిని రెండు చేతులతోనూ బలంగా పట్టి కిందకు లాగాడు. వెంటనే కొండ దద్దరిల్లేలా పెద్ద చప్పుడయింది. గుహ ముందు భాగాన్ని, పై నుంచి జారి పడిన ఒక బల్లపరుపు రాయి గుర్తు తెలియని విధంగా కప్పేసింది.

చిత్రసేనుడు అక్కడ కొద్దిసేపు నిల బడి తరవాత నెమ్మదిగా వాగు దాటి

అరణ్యంలో ప్రవేశించాడు. తను నగరం చేరాలంటే ఏ దిక్కుగా పోవాలో కూడా అతడికి తెలియదు. ఆ కారణంగా అతడు చెట్లలో సునాయాసంగా నడవటానికి అనువైన మార్గాలగుండా నడవసాగాడు. ఇలా కొంతసేపు నడిచేసరికి అతడికి సూర్యుడు పడమటి దిక్కుకు వాలటం కనిపించింది. క్రమంగా అతణ్ణి ఆకలి దహించ సాగింది.

ఆయాసపడుతూ చిత్రసేనుడు అడవిలో మరి కొంత దూరం నడిచి, అంతగా చెట్లు లేని ఒక ఎత్తయిన ప్రదేశాన్ని చేరాడు. అక్కడ కొంచెం సేపు విశ్రాంతి తీసుకున్న తరవాత, హఠాత్తుగా అతడి దృష్టి భుజాన వేలాడుతున్న బుట్ట మీదికి ప్రసరించింది. అందులో వున్నదని సిద్ధుడు చెప్పిన అపూర్వ వస్తువేమిటో చూడాలన్న కోర్కె అతడికి కలిగింది. ఆ క్షణాన చిత్రసేనుడికి సిద్ధుడు చేసిన హెచ్చరిక గుర్తుకు రాలేదు.

అతడు భుజాన్నుంచి బుట్టను కిందికి దించి, దాని మూతను పైకెత్తి ఆత్రంగా లోపలికి చూశాడు. వెంటనే అతడి కళ్ళలో మెరుపు మెరిసినట్టయింది. చిత్రసేనుడు కళ్ళు మూసి తిరిగి తెరిచేసరికి, ఎదురుగా చెట్లలో ఆకాశాన్నంటుతున్నట్టున్న పెద్ద భవనం ఒకటి కనిపించింది.

ఈ అద్భుత దృశ్యం చూసి చిత్రసేనుడు శిలాప్రతిమలా అయిపోయాడు.



ఆ మరుక్షణం అతడికి సిద్ధుడు చేసిన హెచ్చరిక గుర్తుకొచ్చింది. "అయ్యో, నే నెంత మూర్ఖుణ్ణి! ఈ మహారణ్యం మధ్య ఈ దివ్యభవనం నాకెందుకు పనికి వస్తుంది? ఇదే ధవళగిరి నగరంలో వున్నట్టయితే ఎంతగా రాణించేది! నా బుద్ధిహీనతవల్ల, సిద్ధుడు చేసిన ఇంత మేలూ అరణ్యంపాలు చేశానే!" అంటూ దుఃఖపడసాగాడు.

ఆ స్థితిలో వున్న చిత్రసేనుడికి అరణ్యం మధ్యనుంచి పెడబొబ్బలు వినిపించినై. చూస్తూండగానే చెట్లు పెనుగాలి తగిలినట్టు వూగసాగినై. చిత్రసేనుడు ఆశ్చర్య పడుతూ చుట్టూ చూసేంతలో, అడ్డం వచ్చిన పెద్ద పెద్ద చెట్లను చేతులతో పడదోస్తూ, ఒక రాక్షసుడు అతడికేసి రావటం కనిపించింది. చిత్రసేనుడు లేచి నిలబడి కత్తి దూశాడు.

రాక్షసుడు వికటాట్టహాసం చేస్తూ అతణ్ణి సమీపించి, "ఏమిరా కుర్రా, నీ ధైర్య సాహసం! ఈ ఉగ్రాకృతి చూస్తూనే, నరమానవుడైనవాడు అక్కడికక్కడే ప్రాణాలు వదలటం ఎరుగుదును గాని, నీలా కత్తి దూసి నిలబడ్డవాడు ఈనాటి వరకూ నాకు తారసపడలేదు." అంటూ వెనుదిరిగి వింత భవనం కేసి చూస్తూ, "ఆ బొమ్మరిల్లు నీవు కట్టిందేనా?" అని ప్రశ్నించాడు.

"అవును," అన్నాడు చిత్రసేనుడు తొణక్కుండా.



ఆ ప్రత్యుత్తరం వింటూనే ఉగ్రాక్షుడు, 'అహ్హహ్హ' అంటూ చెట్ల ఆకులు రాలిపడేలా నవ్వి, "ఈ అడివిని, నీ ముత్తాత నాటి నీళ్ళు పోసి పెంచాడనా నువ్వనుకునేది? జాగర్త. ఇది ఉగ్రాక్షుడి అడవి! నా అనుమతి లేకుండా దీని మధ్య ఇల్లు కట్టావు గనక, నిన్నూ ఆ ఇంటినీ కట్టకట్టి ఆ కొండ అవతలికి విసిరేస్తాను," అంటూ వంగి చిత్రసేనుణ్ణి పట్టుకోబోయాడు.

చిత్రసేనుడు రాక్షసుడికి అందకుండా తప్పుకుని, "తొందరపడకు, ఉగ్రాక్షా! నే నిక్కడ ఇల్లు కట్టినందువల్ల నీకొచ్చిన నష్టమేమిటి? కావాలంటే, ఆ ఇల్లు నీకు వదిలి, నా దారిన నేను పోతాను," అన్నాడు.

"అదేం కుదరదు. నా అడివిలో నన్ను ధిక్కరించి ఇల్లు కట్టావు. నీవు ప్రాణాలతో బయటపడాలంటే, నే నడిగేదానికి ఒప్పుకోవాలి," అన్నాడు ఉగ్రాక్షుడు.

"ఏమిటది?" అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.

"నువ్వీ ఇంట్లోనే సుఖంగా బతుకు, నా అభ్యంతరం లేదు. నీకు పుట్టబోయే పిల్లల్లో పెద్దవాణ్ణి పద్దెనిమిదో ఏడు రాగానే, నా పరం చెయ్యి," అన్నాడు ఉగ్రాక్షుడు.

రాక్షసుడి కోర్కె చిత్రసేనుడికి చాలా వింతగా కనిపించింది. తన కింకా పెళ్ళే కాలేదు! అలాంటప్పుడు రాక్షసుడు అడిగినదానికి సరేనంటే పోయేదేమిటి? తను కనీసం ప్రాణాలతోనన్నా, ఇక్కణ్ణించి బయటపడవచ్చు.

చిత్రసేనుడు ఇలా ఆలోచించి, "ఉగ్రాక్షా, నీ వడిగినదానికి ఒప్పుకుంటున్నాను. నా పెద్దకొడుక్కు పద్దెనిమిదో ఏడు రాగానే నువ్వొచ్చి వాణ్ణి నిరభ్యంతరంగా తీసుకుపోవచ్చు," అన్నాడు.

రాక్షసుడు ఈ ప్రత్యుత్తరం విని ఎంతో పొంగిపోతూ, "అయితే, నిన్ను ప్రాణాలతో వదులుతున్నాను. నువు మాత్రం నాకు ఇచ్చిన మాటనిలుపుకో," అంటూ వెళ్ళిపోయాడు.

—(ఇంకావుంది)






# జ్వాలాద్వీపం

## 2

[ధవళగిరి రాజకుమారుడైన చిత్రసేనుడు, వేటకు వెళ్ళి, కొండ గుహలో సిద్ధుణ్ణి చూశాడు. సిద్ధుడు అతడికి ఒక వెదురుబుట్ట ఇచ్చాడు. అతడు ఆ బుట్ట మూత తీయగానే, ఒక భవనం కనిపించింది. ఉగ్రాక్షుడనే రాక్షసుడు అక్కడికి వచ్చాడు. చిత్రసేనుడు, తనకు మొదటగా పుట్టబోయే కొడుకును, ఆ రాక్షసుడిపరం చేయటానికి ఒప్పుకున్నాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు అడవిచెట్ల చాటున కనిపించకుండా పోగానే, చిత్రసేనుడు బతుకు జీవుడా అనుకుంటూ ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు. ఏదో విధంగా తను ప్రాణాపాయం నుంచి బయటపడ్డాడు. ఇక తను ఈ భీకారణ్య ప్రాంతం వదిలి, ఏదో విధంగా ధవళగిరి నగరం చేరాలి.

చిత్రసేనుడు ఇలా ఆలోచిస్తూ లేచి నిలబడి పడమటి దిక్కుకేసి చూశాడు. సూర్యుడు అస్తమించటానికి మరెంతో కాలం లేదు. తన ఎదురుగా, ఆకాశాన్నంటుతున్నట్టున్న పెద్ద భవనం బురుజుల మీద, సూర్యకిరణాలు ఎర్రని కాంతులతో ప్రసరిస్తున్నవి. ఆ వెలుగులో ఎత్తయిన భవనం బురుజులు మిలమిల లాడుతున్నవి.

''ఎంత అందమైన భవనం! ఇందులో అడవిమృగాలూ, గుడ్లగూబలూ, గబ్బి



లాలూ నివసించవలసిందే గదా!" అనుకుంటూ చిత్రసేనుడు తన దృష్టిని మరొక వైపుకు తిప్పి, నిరుత్సాహంగా బయలుదేరాడు.

అతడు ఆ విధంగా నాలుగైదడుగులు వేశాడో లేదో, అంతలో హఠాత్తుగా వెనకనుంచి "మహారాజా!" అన్న పిలుపు వినబడింది. "మహారాజెవరు? ఈ నట్టడవిలో ఈ మానవ కంఠస్వరం ఎక్కడిది?" అనుకుంటూ చిత్రసేనుడు ఆశ్చర్యపడి వెనుదిరిగి చూశాడు. అతడి కంటికి విలువైన దుస్తులు ధరించి వున్న ముగ్గురు వ్యక్తులూ, వారికి కొంచెం వెనకగా కొందరు భటులూ కనిపించారు. ఈ వింత చూసి చిత్రసేనుడు ఏమో అనబోయేంతలో, విలువైన దుస్తులు ధరించి వున్నవారిలో నుంచి ఒకడు వేరుపడి ముందుకు వచ్చి అతడికి నమస్కరిస్తూ, "మహారాజా! మీరు ఎంతకూ రాజభవనానికి రాకపోయేసరికి, మీకోసం అడవి అంతా గాలిస్తూ, చివరికి మిమ్ములను ఇక్కడ కలునుకున్నాం." అన్నాడు.

"నేనా మహారాజును!" అంటూ చిత్రసేనుడు విస్తుపోయాడు.

చిత్రసేను డిలా అనగానే, ముందుకు వచ్చి అతణ్ణి మహారాజా అని సంబోధించిన వ్యక్తి చటుక్కున వెనుదిరిగి, "సేనానీ, మహారాజుగారు చాలా శ్రమపడినట్టున్నారు. బోయీలెక్కడ?" అన్నాడు ఆదుర్దాగా.

"మంత్రిగారు, వాళ్ళను చెట్లచాటున ఆగి తమ ఆజ్ఞకోసం వేచి వుండమన్నారు గదా!" అంటూ సేనాని అక్కడినుంచి కదిలి, కొంతదూరం వెళ్ళి గట్టిగా చప్పట్లు చరిచాడు. ఆ వెంటనే "అయ్యా, వస్తున్నాం!" అన్న జవాబు వినబడింది. మరుక్షణంలో పల్లకి ఎత్తుకుని బలిష్ఠులైన నలుగురు బోయీలు చిత్రసేనుడి దగ్గిరకు వచ్చారు.

సేనానాయకుడిచేత మంత్రి అని పిలవబడిన వ్యక్తి, ఎంతో గౌరవ పురస్స

రంగా చిత్రసేనుడిని సమీపించి వంగి ప్రణామం చేస్తూ, "మహారాజా! పల్లకి తెప్పించాను అధిష్ఠించండి. మీకేమాత్రం ఆయాసం కలగకుండా బోయీలు, ఈ పల్లకిలో తమను భవనంలోని తమ పడక గదికి చేరుస్తారు." అన్నాడు.



మంత్రి అన్న ఈ మాటలు వింటూంటే, చిత్రసేనుడికి నిజంగానే తను అధిక శ్రమ చేసి వున్నందున అడుగు తీసి అడుగు వేయలేననిపించింది. ఆ కారణంగా అతను మారు మాటాడకుండా పల్లకి ఎక్కి కూచున్నాడు. 'ఊఁ' అంటూ మంత్రి బోయీలను హెచ్చరించి, అంతలో తన దగ్గిరకు వచ్చి చెవిలో ఏమో చెప్పిన వ్యక్తితో, "కోశాధికారిగారు క్షమించాలి. మహారాజుగారికి విశ్రాంతి అవసరం గనక, ఈ విషయం వీలువెంట వారితో సంప్రతించవచ్చును. ఇది సమయం కాదు." అన్నాడు.

పల్లకిలో ఎక్కి కూచున్న చిత్రసేనుడు ఈ సంభాషణ వింటూనే, "ఓహో, నాకు రాజభవనమే కాకుండా, మంత్రీ, సేనానాయకుడూ, కోశాధికారీ కూడా వున్నారన్న మాట!" అనుకున్నాడు ఎంతో ఆశ్చర్యపడుతూ.

కొద్దిసేపటి తరవాత బోయీలు చిత్రసేనుణ్ణి భవనం పై అంతస్తులోని ఒక విశాలమైన గది దగ్గిర దించారు. అతడు పల్లకీ దిగి గదిలో ప్రవేశిస్తూనే, అక్కడి ఎత్తయిన హంసతూలికా తల్పం, చక్కని మెత్తలు, కింద పరిచి వున్న విలువైన రత్నకంబళులు చూసి అతడు మరింత ఆశ్చర్యపడ్డాడు. ఇది కలా, లేక వాస్తవమా అన్న అనుమానం కూడా ఓ త్రుటికాలం అతణ్ణి బాధించింది.

ఇదంతా సిద్ధుడి మహిమ అనుకున్నాడు చిత్రసేనుడు. ఇంత చిన్న వెదురుబుట్టలో ఆకాశాన్నంటే మహాభవనాన్ని దాచిపెట్ట గలిగిన ఆ మహా సిద్ధుడికి, ఆ భవనంలో రాజోచితమైన అన్ని సౌకర్యాలూ, మంత్రి సేనానాయకుల్నీ, నౌకర్లనూ ఏర్పాటు

చేయటం పెద్ద సమస్య కాదనుకున్నాడతడు.

తనకు ఇంత మేలు చేసిన సిద్ధుణ్ణి గురించి ఎంతో కృతజ్ఞతా భావంతో చిత్రసేనుడు తలపోస్తూ వుండగా, అతడికి పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం వచ్చింది. మధ్యాహ్నం నుంచి ఆకలితో నకనకలాడుతున్న అతడు తృప్తిగా భోజనం చేశాడు. తరవాత హంసతూలికా తల్పం మీద మేను వాల్చి, భావి కార్యక్రమాన్ని గురించి ఆలోచించసాగాడు.

ఆలాంటి ఆలోచనల్లోనే చిత్రసేనుడికి నిద్రపట్టింది. అతడికి మెలుకువ వచ్చేసరికి గది గవాక్షం నుంచి లేత సూర్యకిరణాలు లోపలికి ప్రసరిస్తున్నవి. తను ఒక రాత్రి ఆ అపూర్వభవనంలో గడిపానని, సూర్యోదయం అయిందనీ అతడు గ్రహించాడు. వెంటనే తల్పం మీది నుంచి లేచి, కాలకృత్యాలు తీర్చుకుని, గది నుంచి బయటికి రాబోయేంతలో మంత్రి వాకిటి దగ్గర తారసపడ్డాడు.

"మహారాజుగారు రాత్రి సుఖనిద్ర పోయారనుకుంటాను. అనుమతి అయితే, రాజ్యానికి సంబంధించిన ముఖ్య విషయాలు నివేదించగలను," అన్నాడు మంత్రి.

రాజ్యం గురించి కాని, దానికి సంబంధించిన వ్యవహారకాండ గురించి కాని చిత్రసేనుడికి ఏమీ తెలియదు. ధవళగిరిని తండ్రి పాలిస్తున్నాడు. ఆయన



తరవాత సింహాసనాన్ని అధిష్ఠించవలసిన వాడు అన్న శూరసేనుడు. ఆ కారణాల వల్ల చిత్రసేనుడు ఏనాడూ పరిపాలనకు సంబంధించిన వ్యవహారాల జోలికి పోవటం గాని, వాటిలో ఆసక్తి కనబరచటం గాని చేయలేదు. కాని మంత్రి వాటి ప్రసక్తి తేగానే, అతడికి చప్పున తన తలిదండ్రుల సంగతి జ్ఞాపకం వచ్చింది. తన అన్న శూరసేనుడు ఏ ప్రమాదానికీ లోనుకాకుండా ధవళగిరి నగరాన్ని చేరి వుంటే, తన క్షేమాన్ని గురించి తలిదండ్రులు చాలా ఆందోళన చెందుతూ వుంటారు. కనుక ముందుగా తన క్షేమ సమాచారాల సంగతి వారికి ఎరుకపరచటం మంచిది.

చిత్రసేనుడు ఇలా అనుకుని మంత్రితో, "మీకు ధవళగిరి నగరం గురించి తెలిసే వుంటుంది. దానికి రాజైన తారకేశ్వరుడికి, నేనిక్కడ క్షేమంగా వున్నట్టు వార్త పంపండి. తతిమ్మా విషయాలు వీలువెంట మాట్లాడదాం," అన్నాడు.

"చిత్తం, మహారాజా! అలాగే కబురు పంపుతాను. కోశాధికారి, మన కోశాగారంలో ప్రస్తుతం వున్న ధనం గురించీ, ఇతర విలువైన వస్తువుల గురించీ లెక్క కట్టి ఒక జాబితా తయారు చేశాడు. ఆ జాబితా తీసుకుని ఆయనను ఇప్పుడు ఇక్కడికి రమ్మని సెలవా?" అని అడిగాడు మంత్రి వినయంగా.





అమూల్యమైన వస్తువులనూ, వెల లేని రత్నాలనూ పరీక్షిస్తూ వుండగా తన తండ్రి తారకేశ్వరుడు సపరివారంగా వచ్చినట్టు నౌకరొకడు వార్త తెచ్చాడు. వెంటనే చిత్రసేనుడు బయలుదేరి భవనం ముందుకు వచ్చాడు.

కుమారుణ్ణి చూస్తూనే రాజు తారకేశ్వరుడు ఎక్కడలేని సంతోషంతో అతణ్ణి కౌగలించుకున్నాడు. "నాయనా, మీ అన్న చెప్పినదాన్నిబట్టి నువ్వు ఏ అడవి మృగానికో ఆహారం అయిపోయావనుకున్నాను. కాని, నిన్ను ఇంత గొప్ప శ్రీమంతుడుగా చూసి నేను చాలా ఆనందపడుతున్నాను. ఇక్కడ నాకు తటస్థపడిన కొందరు ఉద్యోగులు చెప్పినట్టు, నువ్వు నిజంగానే ఈ పరగణాకు రాజువా? ఈ అద్భుత భవనం నీదేనా?" అని అడిగాడు అమితానందంగా నవ్వుతూ.

తండ్రి అడిగినవాటికి చిత్రసేనుడు అవునన్నట్టు తల వూపాడు.

"అయితే ఇంత గొప్ప పదవి, యింత సునాయాసంగా నీకెలా లభించింది? పూర్వం ఈ రాజప్రాసాదంలో వుంటూండే రాజు ఏమయాడు?" అన్నాడు తారకేశ్వరుడు ఆశ్చర్యంగా.

"ఆ సంగతులన్నీ ఏకాంతంగా వున్నప్పుడు చెపుతాను. నా కొలువులో వున్న

"ఆయన ఇక్కడికి రానవసరం లేదు. ఆ జాబితా ఏదో పంపమనండి, చాలు," అన్నాడు చిత్రసేనుడు.

కొన్ని నిమిషాల తరవాత, నౌకరు ఒకడు జాబితా తెచ్చి చిత్రసేనుడికి ఇచ్చాడు. ఖజానాలో నిలవ వున్న ధనం, విలువైన రత్నాలూ, బంగారు నగలూ గురించి వివరాలతో వున్న ఆ జాబితా చూస్తూనే చిత్రసేనుడు చెప్పలేనంతగా అద్భుతపడ్డాడు. ఇంత ధనం తన తండ్రి వద్ద కూడా వుండి వుండదని అతడు భావించాడు.

ఆనాటి సాయంత్రం అతడు కోశాధికారితో కలిసి, ధనాగారంలో వున్న

ఉద్యోగులు వినగూడని రహస్యాలు చాలా వున్నవి,'' అన్నాడు చిత్రసేనుడు రహస్యంగా.

ఆ రాత్రి ధవళగిరి రాజు తారకేశ్వరుడిని గౌరవించేందుకు, చాలా పెద్ద ఎత్తున విందులూ, వినోదాలూ ఏర్పాటయినై. వాటిల్లో రాజోద్యోగులూ, ఆ అడవిలో నివసించే వివిధ ఆటవిక జాతుల నాయకులూ పాల్గొన్నారు. తమ రాజు, ధవళగిరి రాజపుత్రుడని తెలిసినప్పుడు వారిలో ప్రతి ఒక్కరూ ఎంతో ఆనందపడ్డారు.

విందులూ, వినోదాలూ ముగిసిన తరవాత చిత్రసేనుడు తన తండ్రికి ఏకాంతంగా అన్ని విషయాలూ చెప్పాడు. సింహాలను చూసి తన గుర్రం బెదిరి కొండ ప్రాంతాలకు వెళ్ళటం దగ్గర నుంచి, ఉగ్రాక్షుడికి తను చేసిన వాగ్దానం సంగతి కూడా అతడికి తెలియపరిచాడు.

''ఈ రాక్షసుడికి నువ్వు చేసిన వాగ్దానం నిలుపుకోవటం ఎలా? క్షత్రియుడూ, అందులో రాజూ అయినవాడెవడూ తన ప్రథమ సంతానాన్ని ఈ విధంగా రాక్షసుల పాలు చేయటం, ఏమాత్రం ధర్మసమ్మతం కాదు,'' అన్నాడు తారకేశ్వరుడు.

''నా కింకా వివాహమే కాలేదుగదా! వివాహమై, అందులోనూ మొదటిసారిగా మగపిల్లవాణ్ణి కన్నప్పుడూ, వాడు బతికి పెద్దవాడై · పద్దెనిమిదేళ్ళ వాడైనప్పుడూ, ఈ సమస్యలు ఉత్పన్నమవుతవి. అప్పటికి ఏదో ఒక తంత్రం చేసి, ఈ ప్రమాదం నుంచి బయటపడవచ్చు.'' అన్నాడు చిత్రసేనుడు.

తారకేశ్వరుడికి కొడుకు మాటలేమీ అంతగా రుచించలేదు. అట్లని ఉగ్రాక్షుణ్ణి నాశనం చేయటం సాధ్యమయ్యే పని కాదు. ఇవన్నీ ఆలోచించి చివరకు, తారకేశ్వరుడు, ''నీ రాజ్యం, ధవళగిరి రాజ్యపు ఎల్లలను ఆనుకునే వుంది. ఏ పరిస్థితుల్లో అయినా, సహాయం కావలసివస్తే, ఆ విషయం వెంటనే నాకు తెలియచెయ్యి.'' అన్నాడు.

—(ఇంకావుంది)






# 3

[చిత్రసేనుణ్ణి విచిత్రభవనం నుంచి వచ్చిన మంత్రీ, సేనానాయకుడూ భవనంలోకి తీసుకుపోయారు. ఆ భవనంలో రాజోచితమైన అన్ని సౌకర్యాలూ వున్నవి. మర్నాడు చిత్రసేనుడి తండ్రి తారకేశ్వర మహారాజు వచ్చి, కొడుకును చూసి సంతోషించి, అవసరం అనుకుంటే తన నుంచి ఎలాంటి సహాయమైనా పొందవచ్చునని, అతడితో చెప్పి వెళ్ళిపోయాడు. తరవాత—]

మర్నాటి ఉదయం చిత్రసేనుడు, తండ్రిని సాగనంపి, మంత్రులతో కలిసి, తిరిగి తన భవనం చేరేసరికి, అక్కడ గుంపుగా కూడిన చాలామంది పౌరులు కనిపించారు. వాళ్ళు గొంతులెత్తి, "మహారాజా, మమ్మల్ని కాపాడాలి. ఈ అడవిలో వున్న ఉగ్రాక్షుడూ, వాడి సేవకులూ లోగడ మా పశువుల్ని మాత్రమే ఎత్తుకుపోయేవారు. ఈ మధ్య మనుషుల్ని కూడా ఎత్తుకుపోవటం ప్రారంభించారు." అంటూ విద్యసాగారు.

ఉగ్రాక్షుడి పేరు వింటూనే చిత్రసేనుడు నిలువెల్లా కంపించిపోయాడు. కాని, అంతలోనే అతడికి ఎక్కడ లేని పౌరుషం వచ్చింది. ఇప్పుడు తను నిస్సహాయుడు కాదు. రాజ్యం, పరివారం, సైన్యం గల రాజు. తన రాజ్యంలోనే వుంటూ ప్రజలను నానా హింసలపాలు



మనుష్యుల్ని అపహరించటం కళ్ళారా చూసినవారు మాత్రం లేరు. నరమాంస భక్షకులైన రాక్షసులకు తప్ప, ఇతర్లకు మానవమాత్రుల్ని అపహరించవలసిన అవసరం ఎందుకు కలుగుతుంది!'' అన్నారు.

పౌరనాయకు లిచ్చిన ఈ జవాబు చిత్రసేనుడికి కొంత ఆశ్చర్యం కలిగించింది. పశువుల్ని ఎత్తుకుపోయే రాక్షసులు ఉగ్రాక్షుడి సేవకులే అయినా, మనుష్యుల్ని మాయం చేసేవాళ్ళు మాత్రం, వారై వుండరనుకున్నాడు.

''సరే, మీరు నిశ్చింతగా మీ గూడేలకు వెళ్ళండి. ఒకటి రెండు రోజుల్లో ఆ ఉగ్రాక్షుణ్ణీ, అతడి అనుచరుల్నీ అదుపులో పెట్టే పని నేను చూస్తాను,'' అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడిలా అనగానే మంత్రి అతణ్ణి సమీపించి రహస్యంగా, ''మహారాజా, ఉగ్రాక్షుణ్ణి గురించి దూతల ద్వారా విన్నాను. వాడు మహాభయంకరుడు,'' అన్నాడు.

చిత్రసేనుడు అక్కడి నుంచి భవనంలోకి వెళ్ళేందుకు మెట్లెక్కుతూ, ''వాడు భయంకరుడే కావొచ్చు. అలా అని ఆ రాక్షసుడు మన ప్రజల ధన ప్రాణాలకు నష్టం కలిగిస్తూంటే చూస్తూ వూరుకుం

చేసేవాడిని ఎవడినైనాసరే, హతమార్చవలసిన బాధ్యత తన మీద వుంది. అలాంటివాడు ఉగ్రాక్షుడైనా, తను మిన్నకుండేందుకు వీలులేదు.

''మీ పశువుల్నీ, మనుష్యుల్నీ ఎత్తుకుపోతున్నది, ఉగ్రాక్షుడే అని మీకెలా తెలుసు?'' అని అడిగాడు చిత్రసేనుడు.

ఈ ప్రశ్న వింటూనే అక్కడ గుమికూడిన పౌరుల్లో సంచలనం బయలుదేరింది. కొంతసేపటికి నలుగురు పౌరనాయకులు ముందుకు వచ్చి, ''మహారాజా! ఉగ్రాక్షుడు గాని, అతడి సేవకులు గాని పశువుల్ని ఎత్తుకు పోతూవుండగా చూసినవారు చాలామంది వున్నారు. కాని,

టామా? సేనానాయకు డెక్కడ?'' అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే వెనకగా వస్తున్న సేనానాయకుడు, ''మహారాజా!'' అంటూ ముందుకొచ్చాడు.

''మన సైనికు లెక్కడ? వాళ్ళు సుశిక్షితులూ, ధైర్యసాహసాలు కల వాళ్ళేనా?'' అన్నాడు చిత్రసేనుడు.

సేనానాయకుడు కొంచెం ఆశ్చర్యం కనబరుస్తూ, ''వాళ్ళ శిక్షణా, ధైర్య సాహసాల మాటా, మహారాజా? కావా లంటే వాళ్ళు కొండల్ని పిండి కొట్ట గలరు!'' అన్నాడు.



''ఓ, ఆ కొండల్ని పిండికొట్టటం, బలం వున్న ఏ కూలివాడైనా చేయగలడు. నేనడిగేది అది కాదు. అవసరం అయితే, ఉగ్రాక్షుడికి ఎదురునిలిచి పోరాడే గుండె నిబ్బరం మన సైనికులకున్నదా అని నేను తెలుసుకోదలిచాను.'' అన్నాడు చిత్రసేనుడు.

సేనానాయకుడు నిలువెల్లా కంపించి పోయాడు. తరవాత తడబడే గొంతుతో, ''మహారాజా! ఆ రాక్షసుడు....'' అంటూ అతను ఏమో చెప్పబోయేంతలో, అతడి తత్తరపాటు గ్రహించిన చిత్రసేనుడు నవ్వి, ''సేనానీ, నువ్వే ఆ రాక్షసుడి పేరు విని యింతగా వణికిపోతూంటే, ఇక సైనికుల మాట చెప్పనవసరం లేదు. ఇంతకూ వాళ్ళు నివసించే గుడారా లెక్కడ?'' అని అడిగాడు.

సేనానాయకుడు ముందుండి పడమటి వైపునున్న బురుజు మీదికి దారి తీశాడు. చిత్రసేనుడు అక్కడికి చేరగానే, సేనా నాయకుడు బాణం వేటు దూరంలో వున్న చిన్న కొండలూ, పొదల కేసి చేయి చూపుతూ, ''మహారాజా! మన సైనికులు గుడారాలు నిర్మించేందుకు ఆ కొండ ప్రాంతాన్ని చదును చేస్తున్నారు.'' అన్నాడు.

చిత్రసేనుడి దృష్టికి కొన్ని వేలమంది సైనికులు కనిపించారు. వాళ్ళల్లో ప్రతి

ఒక్కడూ పలుగూ, పారా పుచ్చుకుని ఎగుడు దిగుడుగా వున్న కొండప్రాంతాన్ని తవ్వి, పూడ్చి దాన్ని సమతలంగా చేసేందుకు ఎంతో కష్టించి పని చేస్తున్నారు. వాళ్ళను చూస్తూనే చిత్రసేనుడు తను అర్థబలమే గాక, చాలా అంగబలం కూడా వున్న రాజునని తెలుసుకుని గర్వపడ్డాడు. అతడు మనసులో తనకు ఇంత మేలు చేసిన సిద్ధుణ్ణి తలుచుకుని చెప్పలేనంత కృతజ్ఞతా భావంతో తల వంచాడు.

"మహారాజా! ఆ రాక్షసమూక మీద మన సైన్యాన్ని ఉపయోగించే ముందు, మనం ముందు వెనుకలు బాగా ఆలోచించవలసి వుంటుంది," అన్నాడు మంత్రి.

"మన సైన్యాన్ని ఆ రాక్షసగణం మీద యుద్ధానికి పంపాలని నాకు లేదు. నేనే స్వయంగా ఆ ఉగ్రాక్షుడితో మాట్లాడి చూస్తాను," అంటూ చిత్రసేనుడు సేనానాయకుడి కేసి తిరిగి, "అతడుండేచోటు నీకు తెలుసా?" అని ప్రశ్నించాడు.

"మన చారుల ద్వారా వాడుండే కోట ప్రాంతం తెలుసుకున్నాను, మహ రాజా! కాని, తమరు ఒంటరిగా....వాడితో...." అంటూ నీళ్ళు నమిలాడు సేనాని.

"నేను ఒంటరిగా అతడి కోటకు వెళ్ళబోవటం లేదు. అక్కడికి దారి చూపేందుకు నా వెంట కొద్దిమంది సైనికులు వుంటారు. రాదలిస్తే నువ్వూ రావొచ్చును," అన్నాడు చిత్రసేనుడు.





"మహారాజా, ఎంత మాట! మీకోసం నేనే కాక, ప్రతి ఒక్క సైనికుడూ ప్రాణాలైనా ఒడ్డటానికి సిద్ధంగా వున్నాం." అన్నాడు సేనానాయకుడు.

ఆ తరవాత కొంతసేపటికి చిత్రసేనుడు కొద్దిమంది సైనికులనూ, సేనానాయకుణ్ణీ వెంటబెట్టుకుని, ఉగ్రాక్షుడి నివాసస్థానానికి బయలుదేరాడు. ఆ రాకసుడుంటున్న చోటు ఎరిగివున్న చారులు కొందరు ముందు దారి చూపుతూ నడిచారు. సరిగా మిట్టమధ్యాహ్నం వేళకు అందరూ అడవిలో చాలా దూరం నడిచి, ఉగ్రాక్షుడుండే కొండ సమీపించారు.

కొండ దిగువనున్న అడవిలో ఉగ్రాక్షుడి సేవకులైన కొందరు రాకసులు చిత్రసేనుణ్ణీ, అతడి వెంట వున్న పరివారాన్నీ చూసి, పట్టరాని ఆనందంతో పొట్టలు చెక్కలయేలా నవ్వుతూ, "అహఁ, ఈ నరమానవులు ఎంత బుద్ధిమంతులు! మనకూ, మన యజమానికీ ఆహారం అయేందుకు, పని కట్టుకుని ఇంత దూరం నడిచి వచ్చారు!" అన్నాడు.

"మీ నాయకుడికి, నేను వస్తున్నట్టు చెప్పండి. నా పేరు చిత్రసేనుడు!" అని చిత్రసేనుడు ఆ రాక్షసులకు చెప్పాడు.

ఈ మాటలు వింటూనే రాక్షసులు మరింత బిగ్గరగా నవ్వారు. "నరమాంసం అంతా ఒకే రకం రుచి. నీ మాంసం ఎక్కువేమిటి? నీ దుస్తులూ అవీ చూస్తూంటే, చాలా విలువైనవిలా కనబడు





తున్నవి. నువ్వు కొంపదీసి రాజువా, ఏం?'' అని అడిగారు వాళ్ళు.

''అవును. రాజునే. చిత్రసేన మహారాజును. ఇంకా అధిక ప్రసంగం చేస్తే తాట ఒలుస్తాను. ఇక్కడికి నాలుగైదామడల దూరంలో అడవి మధ్య వున్న మహాభవనం సంగతి మీకు తెలుసా?'' అన్నాడు చిత్రసేనుడు కోపంగా.

ఆ భవనం పేరు వింటూనే రాక్షసులు తత్తరబిత్తర పడుతూ, ''ప్రభో, మన్నించండి! మా నాయకుడు మిమ్మల్ని గురించి చెప్పాడు. మాకు ముందు ముందు కాబోయే మహానాయకుణ్ణి మీరే పంపుతారట. రండి, దయచెయ్యండి. మా నాయకుడు కోటలోనే వున్నాడు.'' అంటూ చిత్రసేనుడికీ, అతడి పరివారానికీ అడుగులకు మడుగులొత్తుతూ ఉగ్రాక్షుడి కోటకేసి దారితీశారు.

ఉగ్రాక్షుడు నివసించే కోట చాలా విచిత్రమైనది. అతడు అడవి మధ్య వున్న ఒక చిన్న కొండను తొలిపించి, అందులోనే గదులూ, ద్వారాలూ, బురుజులూ —అన్నీ ఏర్పాటు చేయించుకున్నాడు. కోట చుట్టూ వున్న ఎత్తయిన గోడా, దాని మీద నాలుగు దిక్కులా వున్న పెద్ద బురుజులూ, దాని ముఖద్వారం—అంతా ఒకే రాతిలో మలచబడింది. యుద్ధం చేసి రాక్షసుడి కోటను పట్టదలిచిన మానవ మాత్రుడెవడైనా వుంటే—అది సాధ్యమయే పని కాదు. మరో రాక్షసుడైనా దాన్ని ఆక్రమించుకోవటం దుస్సాధ్యం.

చిత్రసేనుడు ఈ వింత కోటను ఆశ్చర్యంగా చూస్తూ, ముఖద్వారం దాటి లోపల ప్రవేశించగానే, ఉగ్రాక్షుడి వికటాట్టహాసం వినబడింది. అతడు తన గృహం ముందున్న ఒక ఎత్తయిన రాతి ఆసనం మీద కూచుని వున్నాడు.

''ఓ చిత్రసేనా, ఏది నువ్వు వాగ్దానం చేసిన నీ జ్యేష్ఠపుత్రుడు, ఎక్కడ?'' అంటూ ఉగ్రాక్షుడు అందర్నీ కలయ చూశాడు.



"ఉగ్రాక్షా, నీకేమైనా మతి చాంచల్యం కలిగిందా? నిన్న కాక మొన్ననేగదా నేను నీకు వాగ్దానం చేసింది! అప్పుడే పద్దెనిమిదేళ్ళు గడిచినై అని ఎలా అనుకున్నావ్?" అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడి మాటలకు ఉగ్రాక్షుడు మరింత బిగ్గరగా నవ్వాడు.

"రాక్షసుడు మతి మతిలో వున్నప్పుడే, మానవజాతికి మహా భయంకరుడు. అలాంటప్పుడు మతి చెడి పిచ్చె యెత్తటం జరిగితే, మానవజాతే నశించిపోతుంది," అన్నాడు ఉగ్రాక్షుడు.

"మానవజాతి సంగతేమో నాకు తెలియదు గాని, ముఖ్యంగా నా రాజ్యంలోని మానవులు మాత్రం నశించిపోతున్నారు," అన్నాడు చిత్రసేనుడు.

"నీ రాజ్యమా?" అంటూ ఉగ్రాక్షుడు ఆశ్చర్యపడి, అంతలోనే చిరునవ్వు నవ్వుతూ, "అవును, ఈ ఉగ్రాక్షుడి అడవి అంతా నీ రాజ్యమే! నర్మదానది తీరాన వున్న ధవళగిరి రాజ్యం వైపు తప్ప, తతిమ్మా అన్ని దిక్కులా, ఈ ఉగ్రాక్షుడి అడవి ఎటు చూసినా నూరు ఆమడలు!" అన్నాడు.

"ఈ అడవి మధ్య వున్న గ్రామాల్లో, గూడేల్లో వున్న ప్రజలను నీ అనుచరులు అపహరిస్తున్నారు, పశువులను ఎత్తుకుపోతున్నారు. ఇది నువ్వు చేసిన వాగ్దానానికి విరుద్ధం. నన్ను హాయిగా ఈ ప్రాంతాన్ని పాలిస్తూ వుండనిచ్చేందుకు అంగీకరించావు గదా?" అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు వెలవెలపోయాడు. ఏదో మాట్లాడబోయి, అంతలోనే ఆగి, తన ఎదురుగా వున్న పెద్ద బండరాళ్ళకేసి చేయి చూపుతూ, "అందరూ ఆ పీఠాల మీద సుఖంగా కూచోండి," అని, చిత్రసేనుడికేసి చూస్తూ, "చిత్రసేనా! నువ్వు పొరబడ్డావు. నీ ఈ అడవి రాజ్యంలో జరిగే మానవాపహరణలకు బాధ్యులు నా అనుచరులు కాదు," అన్నాడు.

"నువ్వుగాని, నీ అనుచరులు గాని, మనుషుల జోలికి వెళ్ళటం లేదని నువ్వు నన్ను నమ్మించచూస్తున్నావా, ఉగ్రాక్షా?" అన్నాడు చిత్రసేనుడు కోపంగా.

"నా అనుచరులు అసలు మానవుల్ని తాకటం లేదని నేను చెప్పటం లేదు. ఏదో పండగకి పబ్బానికి ఒకణ్ణి అరా ఎత్తుకుపోయి భక్షించి వుండవచ్చు. కాని, గ్రామాల మీద పడి మనుషుల్ని ఎత్తుకుపోతున్నవాళ్ళు మరొకరు. వాళ్ళు రాక్షసులకన్నా క్రూరులు, భయంకరులు!" అంటూ ఉగ్రాక్షుడు ఆగి, సాలోచనగా చిత్రసేనుడి కేసి చూస్తూ, "జ్వాలాద్వీపం పేరు ఎప్పుడైనా విన్నావా, చిత్రసేనా?" అని అడిగాడు.

"అలాంటి పేరు గల ద్వీపం ఒకటి వున్నదనే సంగతే నాకు తెలియదే!" అన్నాడు చిత్రసేనుడు ఆశ్చర్యంగా.

"అయితే, ఈ రాత్రికి నువ్వూ, నీ అనుచరులూ ఇక్కడ వుండేట్టయితే, ఆ ద్వీపాన్నుంచి రాత్రివేళల ఈ అడవి ప్రాంతాలకు వచ్చి పోయే ఆ క్రూరుల్ని నీకు చూపెడతాను. వాళ్ళు బలంలో మా రాక్షసులకు తీసికట్టే. కాని, వాళ్ళు ఎక్కివచ్చే భీకరమైన వింత మృగాలు—వాటికి రెక్కలు వుండి, ఆకాశంలో ఎగురుతవి గనక పక్షులందాం....వాటి ధాటికి తట్టుకునే శక్తి మాలో ఎవరికీ లేదు. అప్పటికీ, ఆ జ్వాలాద్వీపం నుంచి వింతపక్షి మీద సవారై వచ్చిన ఒకణ్ణి ప్రాణాలతో పట్టుకున్నాం. కాని వాడు ఏ కారణం వల్లనో మర్నాటికల్లా చచ్చిపోయాడు. వాడి కంకాళాన్ని చూడదలిస్తే, నా వెంట రా." అన్నాడు ఉగ్రాక్షుడు.

"చచ్చినవాడి కంకాళాన్ని కాదు.... నువ్వు చెప్పే మాటే నిజమయితే, ప్రాణాలతో వున్న ఆ దుర్మార్గుల్ని, వాళ్ళు ఎక్కివచ్చే భయంకరపక్షుల్ని నాకు చూడాలని వుంది." అన్నాడు చిత్రసేనుడు.

ఇందుకు సరేనన్నట్టు ఉగ్రాక్షుడు తల వూపాడు. —(ఇంకావుంది)



# జ్వాలాద్వీపం

## 4

[పౌరులు చిత్రసేనుడితో ఉగ్రాక్షుడు తమ పశువులనూ, మనుమలనూ ఎత్తుకుపోతున్నట్టు చెప్పారు. చిత్రసేనుడు, ఉగ్రాక్షుడి కోటకు వెళ్ళాడు. రాజ్యంలో పశువులనూ, మనుమలనూ ఎత్తుకుపోతున్నది జ్వాలాద్వీపం నుంచి వస్తున్న భయంకర మానవులని ఉగ్రాక్షుడు అన్నాడు. వాళ్ళను చూపుతానని అతడు చిత్రసేనుడికి మాట ఇచ్చాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు చిత్రసేనుణ్ణీ, అతడి వెంట వచ్చిన పరివారాన్నీ, భటులనూ వెంట పెట్టుకుని వారికి తన కోటలోని వెలలేని రత్నరాసులనూ, వెండి బంగారాలనూ చూపించాడు. ప్రపంచం పుట్టినప్పటి నుంచీ, ఆనాటివరకూ రాక్షసులు వాడిన వివిధ రకాల ఆయుధాలూ, విచిత్రమైన శిరస్త్రాణాలూ చూసి, చిత్రసేనుడు చాలా ఆశ్చర్యపడ్డాడు. కాని, అతణ్ణి అన్నిటి కన్న ఆశ్చర్యపరిచింది రాక్షసుడి కోటలో వున్న ధనరాసులు. "ఉగ్రాక్షా! రాక్షసులైన మీకు, ఈ ధన కనకాలతో ఏం పని?" అని అడిగాడు చిత్రసేనుడు.

ఈ ప్రశ్న వింటూనే ఉగ్రాక్షుడు పెద్దగా నవ్వి, "ఏనాటికైనా, మా రాక్షస జాతి నాగరికులై, మీలాగా వర్తక వ్యాపారాలూ, వ్యవసాయప్పనులూ చేయదలిస్తే, వీటిని ఉపయోగించుకుంటారు.

అదొక్కటే కాక, మరో పద్దెనిమిదేళ్ళకు సంభవించనున్న ఒకానొక ముఖ్య సంఘటనను మనసులో వుంచుకుని కూడా, ఈ ధన కనకాలను కోటలో భద్రపరిచాను,'' అన్నాడు.

పద్దెనిమిదేళ్ళ తరవాతి ముఖ్య సంఘటన అంటూ ఉగ్రాక్షుడు మాట్లాడగానే, చిత్రసేనుడికి, అందులో ఏదో మోసం వున్నదన్న అనుమానం కలిగింది. అయినా, తన అనుమానాన్ని రాక్షసుడు పసికట్టేలా ప్రవర్తించటం మంచిది కాదు. తను పద్దెనిమిదేళ్ళ తర్వాతో ఎప్పుడో, నిజంగా తన కొడుకును అతడి పరం చేస్తానని, వాడు నమ్మితే నమ్మనీ అనుకున్నాడతడు.

చిత్రసేనుడు రాక్షసుడి కోటలోని అద్భుతాలన్నీ చూసేలోపల సూర్యాస్తమయమయింది. ఉగ్రాక్షుడు, తన అతిథికీ, అతడి అనుచరులకూ గొప్ప విందు చేశాడు. విందు మధ్యలో ఉగ్రాక్షుడి సేవకుడొకడు, యజమాని దగ్గిరకు వచ్చి, ''ప్రభో! జ్వాలాద్వీపవాసులు ఎక్కి వచ్చే భయంకర పక్షి ఒకటి కుంభికుప్ప ప్రాంతంలో కనిపించింది. అక్కడ కాపలావాళ్ళు మంటలు వేసి, ఆ సంగతి తెలియపరిచారు,'' అన్నాడు.

సేవకుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు అదిరిపడి, ''చిత్రసేనా! మనం త్వరగా బయలుదేరటం మంచిది. నీ రాజ్యంలో ప్రజలను ఎత్తుకుపోయే,



మహా క్రూరుల్ని నీకు చూపెడతాను.'' అన్నాడు.

అందరూ క్షణాలమీద భోజనాలు చేసి ఉగ్రాక్షుడి వెంట బయలుదేరారు. ఉగ్రాక్షుడు, తన వెంట చిత్రసేనుణ్ణీ, కొద్దిమంది ఆయుధధారులైన తన సేవకుల్నీ తీసుకుని తతిమ్మావారిని, తన అనుచరుల వెంట మరో దిక్కుగా పంపాడు.

ఉగ్రాక్షుడూ, చిత్రసేనుడూ కోట వదిలి తూర్పు దిక్కుగా కొంతదూరం అడవిలో నడిచేసరికి, హఠాత్తుగా కోట వైపు నుంచి పెద్ద రెక్కల చప్పుడూ, కీచుమనే వికృత ధ్వనులూ వినిపించాయి. అందరూ చెట్లమధ్య ఆగి కోటకేసి చూశారు. కోటమీద వలయాకారంగా రెక్కలు చాచిన కొన్ని వింత ఆకారాలు ఎగురుతున్నవి. కోట రక్షకులైన రాక్షసులు పొడుగాటి దివిటీలు గాలిలోకి ఎత్తి, కేకలు పెడుతూ అవి కిందికి దిగకుండా భయపెడుతున్నారు.

''ఉగ్రాక్ష! ఈ వికృతాకారాలు భయోత్పాతం కలిగించేలా వున్నవే! అవి నీ కోటమీద దిగి, దాన్ని ఆక్రమించుకోవాలని ప్రయత్నిస్తున్నవా?'' అన్నాడు చిత్రసేనుడు.

''జ్వాలాద్వీప వాసులు, అలాంటి ప్రయత్నం లోగడ ఒకటి రెండుసార్లు చేశారు. కాని, నా సేవకులు పెద్దపెద్ద కాగడాలూ, ఈటెలూ ఉపయోగించి,





ఆ భయంకర పక్షులపై స్వారీ చేస్తున్న ఒకణ్ణి కింద పడగొట్టారు. వాణ్ణి గానుగకు కట్టి నాలుగైదు చుట్లు తిప్పేసరికి, తను ఎక్కడినుంచి వచ్చిందీ చెప్పాడు. కాని, తతిమ్మా వివరాలు తెలుసుకునే లోపలే వాడు చావటం జరిగింది. ఇప్పుడు, వాడి అనుచరులు నామీద పగ తీర్చుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. అంతే. వాళ్ళు సాహసించి కోటలో దిగరని నా నమ్మకం,'' అన్నాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రాక్షుడు మాటలు ముగించీ ముగించకముందే, ఆ చుట్టుపట్ల గల చెట్టు చేమలు గాలికి వూగిపోయినై. ఆ వెంటనే గుండెలవిసేలాంటి భీకర ధ్వనులతో రెండు పక్షులు, అల్లంత ఎడంలో కిందికి దిగినై. వాటి వీపులమీదినుంచి, పులి చర్మాలు ధరించిన నలుగురు మనుషులు దిగారు.

వెంటనే ఉగ్రాక్షుడు, చిత్రసేనుణ్ణీ తన అనుచరులనూ వొత్తుగా వున్న చెట్ల మాటుకు తీసుకుపోయాడు. వింత పక్షుల నుంచి దిగిన మనుషులు నేలబారున పడుకుని చుట్టూ చెట్లలోకి కొద్దిసేపు జాగ్రత్తగా పరీక్షించి చూసి, తరవాత లేచి ఏమో సంప్రతించుకుని, ముందుకు నడిచారు. వారి వెనకగా రెక్కలల్లాడిస్తూ పక్షులు బయలుదేరినై.

నిజానికి రెక్కలున్నా వాటిని పక్షులనేందుకు వీల్లేదు. వాటి ముక్కులు దాదాపు మూడడుగుల పొడవున్నవి. ముక్కులు తెరిచినప్పుడల్లా, వాటి నోళ్ళలో పులికోరల్లాంటి పళ్ళున్నవి. శరీరం మీద ఎక్కడా ఈకలు లేవు. జంతువులకున్నట్టు వాటికి చిన్న తోక ఒకటి వున్నది. అవి పక్షులలాగే రెండు కాళ్ళ మీద కొంచెం ముందుకు వంగి నడుస్తున్నవి. వాటి ఎత్తు ఏడెనిమిది అడుగు లుంటుంది.

''నిజమైన ప్రమాదం ఆ పులిచర్మం గాళ్ళ నుంచి కాదు. ఈ వింత పక్షుల నుంచి. అవి వాళ్ళకు వాహనాలుగానూ,





రక్షకులుగానూ పని చేస్తవి. ఎవరైనా ఆ క్రూరుల్ని ఎదుర్కొంటే, ముందుగా వచ్చి మీద పడేవి ఈ పక్షులు. రకరకాల ఈలలతో వాటిని తమ శత్రువుల మీదికి ఆ పులిరాయుళ్ళు ఉసికొల్పుతారు. నా సేవకుల్లో కొందర్ని ఈ పక్షులు తమ ముక్కుల్తో, కాలిగోళ్లతో చీల్చి ముక్కలు ముక్కలుగా చేసినై," అన్నాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రాక్షుడు ఇలా మాట్లాడుతున్నంతలో, వింతపక్షుల మీద నుంచి దిగినవాళ్ళు మెల్లగా ఈలలు వేస్తూ, చెట్లలోకి నడవ సాగారు. పక్షులు రెండూ ఒకసారి ముక్కులు పైకెత్తి రెక్కలాడించి వాళ్ళ వెనకగా కదిలినై.

"అదుగో, ఆ కొండ పాదంలో వున్న గూడెంకేసే వీళ్ళ ప్రయాణం. మరి కొందరు నీ శూరులు మాయమవబోతు న్నారు," అన్నాడు ఉగ్రాక్షుడు.

"అయితే, మనం చూస్తూ వూరుకోవల సిందేనా?" అన్నాడు చిత్రసేనుడు.

"ఆఁ, అంతకన్న చేసేదేముంది? వాళ్ళ వెంట ఆ భయంకర పక్షులుండగా, మనం చెయ్యగలిగిందేమీ లేదు. ఆ ద్వీప వాసులు ఒంటరిగా దొరికితే, నా బొటన వేలుతో నొక్కి చూర్ణం చూర్ణం చేయ గలను," అన్నాడు ఉగ్రాక్షుడు కోపంగా.



ఇంతలో ఉగ్రాక్షుడూ, చిత్రసేనుడూ నిలబడి వున్న చెట్టు మీది నుంచి చెవులు గింగుర్లెత్తేలా గుడ్లగూబ ఒకటి అరిచింది. ఆ అరుపు వింటూనే, పులిరాయుళ్ళు చప్పున వెనుదిరిగారు. వాళ్ళ చేతుల్లోని బరిసెలు చీకట్లో తళతళ మెరిసినై. భయంకర పక్షులు కూడా పెద్దగా ముక్కులు తెరిచి, వికృతంగా కూతపెట్టినై.

"ఇక్కడెవరో వున్నట్టు వాళ్ళు పసి గట్టారు!" అన్నాడు ఉగ్రాక్షుడు. ఆ వెంటనే తన సేవకుల్ని దగ్గిరకు పిలిచి, రహస్యంగా ఏమో చెప్పాడు. వాళ్ళు రెండు ముఠాలుగా చీలి వెళ్ళిపోయారు. మరుక్షణం భయంకర పక్షులు ముక్కులు



సాచి, ఉగ్రాక్షుడూ, చిత్రసేనుడూ వున్న చోటుకు పరిగెత్తి రాసాగినై. వాటి వెనకగా పులి చర్మం ధరించినవాళ్ళు బరిసెలు ఊపుతూ ముందుకు దూకుతున్నారు.

చిత్రసేనుడు కత్తి దూశాడు. ఉగ్రాక్షుడు దిక్కులు పిక్కటిల్లేలా రంకెవేసి తన చేత గల రాతిగద ఝుళిపిస్తూ, కుప్పించి ముందుకు దూకాడు. అతడు రాతిగదతో తల మీద బలంగా కొట్టేసరికి, ఒక భయంకర పక్షి పక్కకు పడిపోయింది. కాని, రెండోది అతడి కుడి భుజాన్ని కాళ్ళతో గట్టిగా తన్నుతూ, ముక్కుతో బలంగా తల మీద పొడిచింది. అదే క్షణాన ఉగ్రాక్షుడి సేవకులైన రాక్షసులు, గుండె లదిరేలా అరుస్తూ, వెనక నుంచి రెండు ముఠాలుగా వచ్చి, పులి చర్మాలు ధరించిన వాళ్ళ మీద పడ్డారు. ఇదే అదనుగా చిత్రసేనుడు కూడా ముందుకు లంఘించి, తన కత్తితో ఒక శత్రువును అడ్డంగా నరికాడు.

ఆ తరవాత క్రూరాతిక్రూరమైన పోరు ప్రారంభమైంది. ఉగ్రాక్షుడు తనకు తగిలిన గాయాలను సరకు చేయక, భీకరంగా రంకెలు వేస్తూ, తన చేత గల రాతిగదతో భయంకర పక్షులను మోద సాగాడు. అవి అతడి దెబ్బలను తప్పుకుంటూ, పక్కకు ఎగిరి అంతలోనే వచ్చి అతడి మీద కలబడసాగినై. వాటి ముక్కు పోట్లకూ, కాలి గోళ్ళ దెబ్బలకూ, ఒక్క ఉగ్రాక్షుడే కాక, అతడి సేవకులు కూడా గురి అయారు.

చిత్రసేనుడు తన కత్తి దెబ్బకు ఒక శత్రువు కింద పడగానే, తతిమ్మావాళ్ళ మీదికి ఉరికాడు. వాళ్ళు తమ బరిసెలతో అతడి కత్తి నుంచి రక్షణ చేసుకుంటూ, విచిత్రమైన ఈలలు వేస్తూ వెనక్కు తగ్గ సాగారు. వాళ్ళను చుట్టుముట్టాలన్న ప్రయత్నం, పక్షులు అడ్డు రావటంతో, చిత్రసేనుడికీ, ఉగ్రాక్షుడి అనుచరులకూ సాధ్యం కాలేదు. అవి తమ రెక్కలతో, ముక్కులతో, కాళ్ళతో వారిని చితక

బాధుతూ, తమ యజమానులతోపాటు వెనక్కు వెళ్ళసాగినై.

ఇది చూసిన ఉగ్రాక్షుడు భయంకరంగా ఘూర్జిల్లుతూ, రాతి గదను రెండు చేతులతో రివ్వురివ్వుమని తిప్పుతూ, ముందుకురికాడు. అసరికి చావగా మిగిలిన శత్రువులు ముగ్గురూ, పక్షుల రెక్కల మీదికి ఎగబాకారు. వాళ్ళు కీచుమంటూ పెద్దగా ఈల వేయగానే పక్షులు గాలిలోకి లేచినై. ఉగ్రాక్షుడు రాతి గదను గాలిలో గిర్రున తిప్పి, వాటికేసి విసిరాడు. ఆ ఊపుకు అతడు వెల్లకిలా పడిపోయాడు. బాణంలా మీదికి వస్తున్న గదను ఒక భయంకర పక్షి ముక్కుతో గట్టిగా పొడిచింది. ఆ వెంటనే రాతి గద దభీమంటూ కింద పడిపోయింది.

గాయాలవల్ల రక్తం వరదలై పారుతూ కిందపడివున్న ఉగ్రాక్షుణ్ణి, చిత్రసేనుడు సమీపించి, "ఉగ్రాక్షా! ప్రాణాపాయకరమైన దెబ్బలేమీ తగలలేదుగదా?" అని అడిగాడు.

"ప్రాణాపాయమా!" అంటూ ఉగ్రాక్షుడు బాధతో మూలిగి, "ప్రాణాపాయం ఏమీ లేదు. బహుశా, పదిరోజుల పాటు మంచం పట్టవలసివస్తుంది. నా సేవకులెంతమంది చచ్చారు?" అని అడిగాడు.

"ఇద్దరిని భయంకర పక్షులు ముక్కులతో చీల్చివేసినై. నలుగురు గాయాల బాధతో మూలుగుతున్నారు." అంటూ సమీపానికి వస్తున్న రాక్షసులకేసి తిరిగి, "శత్రువుల్లో ఒక్కడే గదా, చచ్చింది?" అని అడిగాడు చిత్రసేనుడు.

"అవును, రాజా!" అన్నారు వాళ్ళు.

"ఛీ, పిరికిపందల్లారా! ఇంతమంది రాక్షసవీరులం వుండగా, ఎక్కడినుంచో వచ్చిన మానవమాత్రులు మనల్ని చావ చితకకొట్టటమా? ఛీ!" అంటూ ఉగ్రాక్షుడు లేవబోయాడు. అంతలో, అతడి సేవకులు దగ్గిరకు వచ్చి, అతణ్ణి నడుమూ, భుజాలూ పట్టుకుని లేవనెత్తి, నిలబెట్టారు. —(ఇంకావుంది)






## 5

[చిత్రసేనుడికీ, అతడి పరివారానికీ ఉగ్రాక్షుడు విందు చేశాడు. ఆసమయంలో, జ్వాలాద్వీపం నుంచి భయంకర పక్షులపై వచ్చినవాళ్ళను గురించిన వర్తమానం అందింది. ఉగ్రాక్షుడూ, చిత్రసేనుడూ అడవిలోకి వెళ్ళారు. అక్కడ జ్వాలాద్వీప వాసులతో జరిగిన పోరాటంలో కొందరు రాక్షసులు చచ్చారు. ఉగ్రాక్షుడు బాగా గాయపడ్డాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు తన సేవకుల భుజాలు ఆసరాగా పట్టుకుని నిలబడి, గాయాల బాధతో గట్టిగా ఓసారి మూలిగి, ''చిత్రసేనా! ఎంతవాడికి ఎంత పతనం తటస్థించింది. అన్ని వైపులా కనుచూపు అనినంత వరకూ వున్న ఈ మహారణ్యానికి నేను ఏకైక ప్రభువును. అంతే కాక, రాక్షస జాతిలో ఎంతో కీర్తి ప్రతిష్ఠలున్న గొప్ప వంశంలో పుట్టినవాణ్ణి. అలాంటి నేను, నా అరణ్యం మధ్యనే పరదేశాల నుంచి వచ్చిన క్షుద్ర మానవులవల్ల చావు దెబ్బలు తినవలసి వచ్చింది!'' అంటూ వాపోయాడు.

చిత్రసేనుడు రాక్షసుణ్ణి ఓదార్చే ధోరణిలో, ''ఉగ్రాక్షా, విచారించి లాభం లేదు. నువ్వూ, నేనూ కూడా ఓటమి పొందింది జ్వాలాద్వీపాన్నుంచి వచ్చిన మానవులవల్ల కాదు, వాళ్ళు ఎక్కివచ్చిన



భయంకర పక్షులు మనను దెబ్బ తీసినై. వాటిని ప్రస్తుతం మన దగ్గిరున్న ఆయుధాలతో ఎదుర్కోవటం వల్ల, ప్రయోజనం లేదు. వాటిని చంపేందుకు మరేదైనా ఇతర మార్గం ఆలోచించాలి," అన్నాడు.

"అవును. ఆ మార్గం ఏదో మనం తెలుసుకునే లోపలే, ఆ క్రూరులు మనల్ని హతం చేస్తారు. నీ అపూర్వ భవనం, నా కోటా, ఈ అడవి రాజ్యం— అంతా వాళ్ళ హస్తగతం అవుతుంది," అన్నాడు ఉగ్రాక్షుడు నిరాశగా.

అంత భయంకర రూపుడూ, బలశాలీ అయిన రాక్షసుడు, పిరికి పాలెక్కువ వున్న మామూలు మనిషిలా జావకారి పోవటం చూసి, చిత్రసేనుడికి ఎంతో జాలి కలిగింది.

"జ్వాలాద్వీపవాసులు మన రాజ్యం ఆక్రమించుకోవటానికి ప్రయత్నిస్తున్నారని నీ అనుమానమా, ఉగ్రాక్షా!" అని అడిగాడు చిత్రసేనుడు.

"కాకపోతే, ఈ దాడులన్నీ ఎందుకోసం?" అన్నాడు ఉగ్రాక్షుడు.

"అదే నాకూ అంతుబట్టటం లేదు. కేవలం మన పల్లెల్లో నుంచి అక్కడొకణ్ణీ ఇక్కడొకణ్ణీ ఎత్తుకుపోయేందుకే వాళ్ళు వస్తున్నారని నేనూ నమ్మను." అన్నాడు చిత్రసేనుడు.

"ఆ క్రూరుల్లో మరొక్కడు ప్రాణాలతో దొరికితే నిజం బయట పెట్టిద్దును. దొరికిన ఒక్కగానొక్క వెధవా, రహస్యం బయట పెట్టకుండానే చచ్చి వూరుకున్నాడు," అంటూ ఉగ్రాక్షుడు పళ్ళుకొరికాడు.

"ఏదో ఒకనాడు ఆ దుర్మార్గుల్లో కొందరు మనకు దొరక్కపోరు. అలా దొరికిననాడు, వాళ్ళను చిత్రహింసకు గురిచేసి అయినా, అసలు రహస్యం బయటపెట్టించి తీరుతాం. అసలు ఈ జ్వాలాద్వీపం ఎక్కడ? ఈ భయంకర పక్షులు వాళ్ల స్వాధీనంలోకి ఎలా వచ్చినై? వాటి మీద సవారీ చేస్తూ, వీళ్ళు మన రాజ్యంలో మనుషుల్ని అపహరించటంలో

వున్న రహస్యం ఏమిటి? ఇవన్నీ ముందు మనం తెలుసుకోవాలి. సరే, నేను వెళతాను. గాయాలు మానేవరకూ విశ్రాంతి తీసుకో. కోట రక్షణలు మరికొంత బలపరచటం మంచిది. నేనూ తగు జాగ్రత్తలో వుంటాను,'' అంటూ చిత్రసేనుడు తన అనుచరులతో బయలుదేరాడు.



''చిత్రసేనా, నేనింత దీనావస్థలో వున్నానని, మరెవరితోనూ అనకు. నీ పౌరుల దృష్టిలో నేను మనిషికంటే కూడా హీనుణ్ణయిపోతాను,'' అంటూ ఉగ్రాక్షుడు వెనక నుంచి పెద్దగా కేక పెట్టాడు.

ఉగ్రాక్షుడి మాటలు చిత్రసేనుడికి నవ్వు తెప్పించినై. అంతలో సేనానాయకుడు, ''మహారాజా!'' అంటూ ముందుకు వచ్చాడు.

''ఏమిటి సేనానీ?'' అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.

''ఆ ద్వీపవాసుల్ని ఎదుర్కోవటానికి మనకు తోడుగా, ఈ ఉగ్రాక్షుడి అనుచరులు కూడా వుండటం బావుంటుంది. ఏనాడు వాళ్ళు పెద్ద బలగంతో మన నగరం మీద దాడి చేస్తారో!'' అన్నాడు సేనాని.

సేనాని మాటలు చిత్రసేనుడికి కోపం తెప్పించినై. అయినా అతడు దాన్ని బయటికి కనబడనీయకుండా, ''మన నగర రక్షణకు, ఈ రాక్షస మూకను తోడు తెచ్చుకుందామనేనా నీ వనేది? అదెన్నటికీ కుదరదు. నా భవనాన్నీ, నగరాన్నీ నా శక్తితో రక్షించుకోలేక, రాక్షసుల్ని కాపుంచుకోవలసిన పరిస్థితి వచ్చిననాడు, నేను రాజ్యత్యాగమే చేస్తాను,'' అన్నాడు చిత్రసేనుడు.

ఈ జవాబుతో సేనాని తుక్కిన పేనులా అయిపోయాడు.

చిత్రసేనుడూ, పరివారమూ అడవిలో మరికొంత దూరం వెళ్ళేసరికి, హఠాత్తుగా వెనక నుంచి కేకలు వినిపించినై. చిత్రసేనుడు ఆశ్చర్యపడుతూ వెనుదిరిగి



చూశాడు. వికృతమైన ఆయుధాలు చేబూనిన ఇద్దరు రాక్షసులు గుండె లవిసేలా పరుగెత్తి వస్తూ, "రాజా, రాజా, ఆగు!" అంటూ కేకలు పెడుతున్నారు.

చిత్రసేనుడు ఆగాడు. సేనాని, "మహా రాజా! ఆ జ్వాలాద్వీపవాసులు మళ్ళీ దాడికి రాలేదుగదా?" అన్నాడు.

చిత్రసేనుడు తూర్పు దిక్కు కేసి చూస్తూ, "సూర్యోదయం కాబోతున్నది. పగటివేళల్లో వాళ్ళు ఇంతవరకూ ఎవరి కంటా పడలేదు," అన్నాడు. ఇంతలో రాక్షస భటులిద్దరూ రొప్పుతూ అతణ్ణి సమీపించి, "రాజా, ఉగ్రాక్షనాయకుడు మిమ్మల్ని వున్నపళంగా తీసుకురమ్మన్నాడు. ఆయన కుంభికుప్ప దగ్గిర వున్నాడు," అన్నారు.

"అంత అవసరం అయిన పనేమిటి?" అన్నాడు చిత్రసేనుడు.

"భయంకర పక్షుల మీద ఎక్కి వచ్చేవాడొకడు దొరికాడు. అందుకని, మా నాయకుడు మిమ్మల్ని పిలుచుకు రమ్మన్నాడు," అన్నారు రాక్షసులు.

"ఆ మాత్రానికి మీరు గుండెలు బద్దలు కొట్టుకుంటూ పరిగెత్తుకు రావాలా? దొరికినవాడు ఎక్కడికి పోతాడు!" అంటూ చిత్రసేనుడు రాక్షసులతో బయలుదేరాడు.

"వాడు చెట్టు దిగి రానంటున్నాడు, రాజా! మీరు వస్తేగాని పని సానుకూలం కాదు," అన్నాడొక రాక్షసుడు.

ఈ రాక్షస భటు లిద్దరూ ఏదో మద్యం తాగిన తిక్కలో వున్నారని చిత్రసేనుడు భావించాడు. శత్రువు ఒకసారి ఒంటరిగా చిక్కిం తరవాత, చెట్టు దిగి రావటం, దిగి రాకపోవటం వాడి చేతుల్లో వున్న పని కాదు.

అరగంట తరవాత చిత్రసేనుడు తన అనుచరులతో కుంభికుప్ప గ్రామాన్ని సమీపించేసరికి, ఊరి బయట ఒక మహా వృక్షం చుట్టూ కొందరు రాక్షసులూ, గ్రామవాసులూ కనిపించారు. వారందరి మధ్యా ఉగ్రాక్షుడు నిలబడి వున్నాడు.

అందరి దృష్టి చెట్టు మీదనే లగ్నమయి వుంది. ఆ చెట్టు చిటారుకొమ్మల్లో పులిచర్మం ధరించి వున్న ఒకడు కత్తి ఝుళిపిస్తూ గావుకేకలు పెడుతున్నాడు.

"నేను రాను, దిగి రాను. కోరి మీ రాక్షసులకి ఫలహారం నే నెందుకవుతాను? ఎవడైనా చెట్టెక్కి వచ్చాడో, వాణ్ణి కత్తితో పొడిచి, నేను పొడుచుకు చస్తాను!" అంటున్నాడు వాడు.

చిత్రసేనుడు, ఉగ్రాక్షుణ్ణి సమీపించి, "ఏమిటీ గత్తరంతా?" అని అడిగాడు.

ఉగ్రాక్షుడు ఆ ప్రశ్న వింటూనే అదిరిపడి, "చిత్రసేనా, వచ్చావా, వచ్చావా! అడుగో ఆ చెట్టు మీద వున్నవాడు, జ్వాలాద్వీపం నుంచి వచ్చిన దుర్మార్గుడు. రాత్రి ఇక్కడ జరిగిన పోరాటంలో వెనకబడిపోయి మనకు దొరికాడు. ప్రాణాలతో వాణ్ణి పట్టుకోవటం సాధ్యం అయేలా లేదు. వీణ్ణించి మనం చాలా రహస్యాలు తెలుసుకోవచ్చు. మేము కాల్చుకు తింటామని వాడు భయపడుతున్నాడు. నువ్వు అభయహస్తం యిచ్చి, వాణ్ణి ఏదో విధంగా చెట్టు నుంచి దింపాలి," అన్నాడు.

చిత్రసేనుడు దృష్టిని చెట్టు చిటారు కొమ్మలకేసి సారించి, "ఓరీ, నీ ప్రాణానికి వచ్చిన భయం ఏమీ లేదు. నువ్వు చెట్టు దిగి రా!" అని కేక పెట్టాడు.





"ఇంతమంది దిగమంటే దిగలేదు, నీ ఎక్కువేమిటి? నువ్వేమైనా మహారాజువా?" అంటూ పులిచర్మం ధరించినవాడు విసురుగా మాట్లాడాడు.

"అవును, నేను మహారాజునే. ఈ అడవీ, ఇందులో వున్న పల్లెలూ పట్టణాలూ నా పరిపాలనలోనే వున్నవి. నీకు ప్రాణభయం వుండదని అభయం ఇస్తున్నాను. నా మాట విని చెట్టు దిగి, రా," అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడు ఇలా అనగానే అక్కడ గుమిగూడిన ప్రజల్లో నుంచి, "మహారాజుకూ, జై!" అన్న కేకలు మిన్ను ముట్టినై.

ఆ జయజయ ధ్వానాలు వింటూనే చెట్టు మీద వున్నవాడు ఆశ్చర్యంగా చిత్రసేనుడి కేసి చూసి, "అయితే, ఈ రాక్షసుల మాటేమిటి? వాళ్ళు నన్ను చెయ్యికి చెయ్యీ, కాలుకు కాలూ విరుచుకు తింటే?" అన్నాడు.

"వాళ్ళ నుంచి నీకెలాంటి ప్రమాదమూ వుండదు. వాళ్ళూ నా ఆజ్ఞకు లోబడి వుండేవాళ్ళే." అంటూ చిత్రసేనుడు, ఉగ్రాక్షుడి కేసి తల తిప్పాడు. ఉగ్రాక్షుడు తన సేవకుల కేసి గుడ్లురిమాడు. ఆ వెంటనే, "చిత్రసేన మహానాయకుడికీ, జై!" అంటూ రాక్షసులంతా తలలు వంచారు. ఉగ్రాక్షుడు కూడా చిత్రసేనుడికి తల వంచి ప్రణామం చేస్తూ మెల్లిగా, "ఈ మహారాక్షసుడికి ఎలాంటి ఖర్మ పట్టింది!" అంటూ కోరలు కరకర మనిపించాడు.

"మహారాజా! మీరు అభయమిచ్చారు గనక చెట్టు దిగుతున్నాను." అంటూ పులిచర్మంవాడు చరచర చెట్టు దిగి వచ్చాడు.

"నీకేం భయం లేదు. ఆ కత్తి నా సేనాని పరం చెయ్యి." అన్నాడు చిత్రసేనుడు. పులిచర్మం ధరించినవాడు మారు మాటాడకుండా తన కత్తిని సేనానాయకుడికి అందించాడు.





"చిత్రసేనా, గానుగలో వేసి ఆడించవలసిన అవసరం కలక్కుండానే, వీణ్ణించి నువ్వు రహస్యాలు బయట పెట్టించగలవనుకుంటాను," అన్నాడు ఉగ్రాక్షుడు.

"ఓఁ, నాకు తెలిసిన రహస్యాలన్నీ మీకు చెప్పేస్తాను. మనం అందరం స్నేహితులం అంటూ మంచి మాటలతో తీసుకువచ్చి, ప్రమాదం వచ్చేట్టు కనబడగానే నన్ను ఈ అడవిలో వదిలి ఆ దుర్మార్గులు పక్షుల మీద సవారై పారిపోయారు. వాళ్లు ఈ సరికి అక్కడెక్కడో తూర్పు సముద్రంలో వున్న జ్వాలాద్వీపాన్ని చేరి వుంటారని నా అనుమానం," అన్నాడు పులిచర్మంవాడు.

"నువ్వు ఆ ద్వీపం వాడివి కావా?" అని అడిగాడు చిత్రసేనుడు ఆశ్చర్యంగా.

"ఆ ద్వీపం వాణ్ణయితే, మీకు ప్రాణాలతో దొరికేవాణ్ణా? నేను ఆ ద్వీపవాసులకు సహాయం చేస్తున్న కపిలపురం రాజు నాగవర్మ సైన్యంలో వాణ్ణి. నా పేరు అమరపాలుడు," అన్నాడు వాడు.

నాగవర్మ పేరు వింటూనే ఉగ్రాక్షుడు అదిరిపడి, "సేనానాయకుడుగా వున్న ఈ నాగవర్మ కపిలపురానికి రాజెప్పుడయ్యాడు? రాజు వీరసింహుడు ఏమయినట్టు?" అని అడిగాడు.

"వీరసింహమహారాజు బహుశా జ్వాలా ద్వీపంలో బందీగా వుండి వుంటాడు. ఆయన రాజ్యాన్ని అపహరించటమే గాక,



ఆయన ఏకైక పుత్రిక కాంతిమతిని కూడా బలవంతాన వివాహమాడాలని ఈ నాగవర్మ ప్రయత్నిస్తున్నాడు. అంతే కాక, దుండగులైన జ్వాలాద్వీపవాసుల సహాయంతో, తను ఈ చుట్టుపక్కల వున్న రాజ్యాలను జయించి చక్రవర్తి కావాలని కూడా అతను ఆశపడుతున్నాడు," అన్నాడు అమరపాలుడు.

చిత్రసేనుడికి తన రాజ్యపు ఎల్లల్లో వున్న రాజులను గురించిన భోగట్టా ఏమీ తెలియదు. అమరపాలుడు చెపుతున్న దాన్నిబట్టి, ఈ సరికే తన సరిహద్దుల్లో వున్న ఒకానొక దుర్మార్గుడితో జ్వాలాద్వీపవాసులు స్నేహం కట్టారు. ఇంతకూ అమరపాలుడు చెప్పేదంతా నిజమా? లేక ఇందులో ఏమైనా మోసం వున్నదా?

చిత్రసేనుడు ఇలా ఆలోచిస్తున్నంతలో, దూరంగా గుర్రాలు పరిగెత్తి వస్తున్న చప్పుడయింది. చూస్తూండగానే అతడి మంత్రి, నలుగురు సైనికులూ అక్కడికి వచ్చి గుర్రాలు దిగారు. మంత్రి సరాసరి చిత్రసేనుడి దగ్గిరకు వస్తూ, "మహారాజా! ధవళగిరి నుంచి మీ తండ్రిగారు వర్తమానం పంపారు. నాగవర్మ అనే ఒక రాజద్రోహి సైన్యంతో ధవళగిరి మీదికి దాడి వెడలాడట. మీ నుంచి వెంటనే కొంత సైనిక సహాయం కావాలన్నారు," అన్నాడు.

చిత్రసేనుడు, తన సేనాని కేసి తిరిగి, "సేనానీ, నువ్వు మన సైనికుల్లో సగం మందిని వెంటబెట్టుకుని ధవళగిరికి బయలుదేరి వెళ్ళు. ఇక్కడ రక్షణ భారం నేను చూసుకుంటాను," అన్నాడు.

"చిత్తం, మహారాజా!" అంటూ సేనాని అక్కడ నుంచి కదిలాడు.

"ఈ నాగవర్మ సైన్యాల వెంట భయంకర పక్షులెక్కిన జ్వాలాద్వీపవాసులెవరైనా వున్నారేమో!" అన్నాడు ఉగ్రాక్షుడు అమరపాలుడితో. అమరపాలుడు ఏదో జవాబు చెప్పబోయినవాడల్లా ఆగి, అందరి కేసీ ఓమారు అనుమానంగా చూసి, ఆకాశం కేసి తల ఎత్తాడు. —(ఇంకా వుంది)






## 6

[చిత్రసేనుడు తన అనుచరులతో కోటకు వెళుతూండగా, ఉగ్రాక్షుడు పంపగా వచ్చిన రాక్షసులు, అతణ్ణి తిరిగి తమ నాయకుడి వద్దకు పిలుచుకుపోయారు. అక్కడ చిత్రసేనుడికి అమరపాలు డనేవాడు కనిపించాడు. వాడు జ్వాలాద్వీపవాసులను గురించిన కొన్ని రహస్యాలు చెప్పి, హఠాత్తుగా మూగిలా ఆకాశంకేసి తల ఎత్తాడు. తరవాత—]

అమరపాలుడి ఈ విచిత్ర ప్రవర్తన చిత్రసేనుడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. ఉగ్రాక్షుడు కోపంతో నిలువెల్లా కంపించిపోతూ, చేత గల రాతిగదను పైకెత్తి ఝుళిపిస్తూ, "ఏమిరా, నీకేమైనా హఠాత్తుగా బుర్రతిరుగుడు వ్యాధి పుట్టుకొచ్చిందా? ఈ గదతో ఒక్కటి మోది, ఇప్పుడే దాన్ని సరిచెయ్యమంటావా?" అంటూ గర్జించాడు.

అమరపాలుడు భయపడలేదు. అతడు చిరునవ్వుతో ఉగ్రాక్షుడి కేసి చూస్తూ, "నా చావు తరవాత, నీ చావుకు ఎంతో కాలం పట్టదు. కపిలపురాన్ని ఆక్రమించుకున్న నాగవర్మ సంగతి నీకు తెలుసుగదా? అతడికి సహాయం చేస్తున్న జ్వాలాద్వీపవాసులూ, భయంకరపక్షులూ, నీ దేహం మీద వదిలిపోయిన గుర్తుల విషయం మరిచిపోకు," అన్నాడు.



తప్పక సహాయం చేస్తాడని నా నమ్మకం. ఒకవేళ అలా కానప్పుడు, నీ ఇష్టం వచ్చినట్టుగా అతణ్ణి హింసించవచ్చు.'' అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడు ఇలా అనగానే అమరపాలుడు నిలువెల్లా వణికిపోతూ, ''మహారాజా, ఇది అన్యాయం. మీరు నాకు ప్రాణదానం చేస్తామని వాగ్దానం చేశారు. ఆ మాట నమ్మి నేను చెట్టు దిగి వచ్చాను. లేకపోతే ఈ రాక్షసుల చేతుల్లో పడకుండా, అక్కడే ఆత్మహత్య చేసుకుని వుండేవాణ్ణి!'' అన్నాడు.

''నీకు ప్రాణాపాయం కలగదని, నేను వాగ్దానం చేసిన మాట నిజమే. కాని, నువ్వు అది అవకాశంగా తీసుకుని, నా ప్రశ్నలకు ప్రత్యుత్తరం ఇవ్వకుండా, ఆకాశంకేసి గుడ్లు మిటకరించే వెర్రిమొర్రి వేషాలు వేస్తున్నావు. ఇలాంటి పరిస్థితుల్లో, నా వాగ్దానం నిలుపుకోవలసిన అవసరం లేదు.'' అన్నాడు చిత్రసేనుడు కఠినంగా.

''క్షమించండి, మహారాజా! నేను ఈ క్షణం నుంచి మీ సేవకుణ్ణి. రాజద్రోహి అయిన నాగవర్మ మీద నా కెలాంటి గౌరవం లేదు. క్రూరమృగాల్లాంటి జ్వాలాద్వీపవాసులంటే నాకు మొదటి నుంచీ ద్వేషమే. కాని, నాగవర్మకు వెరిచి, నేను

అమరపాలుడు తన గాయాలకు కట్టి వున్న కట్ల విషయమై హేళన చేస్తున్నాడని ఉగ్రాక్షుడు గ్రహించి, భయంకరంగా హుంకరిస్తూ, రాతిగదతో అతడి తల పగలగొట్టేందుకు ముందుకు అడుగు వేశాడు. కాని, అంతలో చిత్రసేనుడు రాక్షసుడికీ, అమరపాలుడికీ మధ్యగా వెళ్ళి నిలబడి, ''ఆగు, ఉగ్రాక్షా!'' అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

''వీడు....వీడు, ఈ మానవాధముడు నన్ను ఇంత హేళనగా మాట్లాడతాడా!'' అంటూ ఉగ్రాక్షుడు కోరలు చాచాడు.

''మానవులంటే అంత చులకనగా ఎప్పుడూ మాట్లాడకు. అతడు మనకు







వాళ్ళల్లో చేరాను,'' అన్నాడు అమరపాలుడు దీనంగా.

''అలా అయితే, దాచకుండా నీకు తెలిసినదంతా చెప్పు. ధవళగిరి మీద దాడికి వెళ్ళిన నాగవర్మ సైన్యాలవెంట భయంకర పక్షులెక్కిన జ్వాలాద్వీపవాసులెవరైనా వున్నారా?'' అని అడిగాడు చిత్రసేనుడు.

''ఉండినా వుండొచ్చు. కపిలపురానికి అనుకుని వున్న అడవిలో దాదాపు నూరు భయంకరపక్షులు రౌతులతోపాటు స్థావరాలు ఏర్పరుచుకున్నవి. జ్వాలాద్వీపవాసులకు బానిసలుగా నాగవర్మ తన ప్రజల్లో కొందరిని ఇచ్చాడు. దానిగ్గాను వాళ్ళు అతడికి, ఈ సహాయం చేస్తున్నారు.'' అన్నాడు అమరపాలుడు.

''ఈ భయంకర పక్షుల్ని చంపేందుకు సులువైన మార్గం ఏమైనా వుందా?'' అని అడిగాడు, ఉగ్రాక్షుడు తన గాయాలకు కట్టివున్న కట్లను సర్దుకుంటూ.

''లేకేం, వున్నది. వాటి ముక్కులకూ, గోళ్ళకూ చిక్కకుండా తప్పుకోగలిగితే, వాటి మెడను ఒక చిన్న కత్తివేటుతో తునాతునియలుగా నరికి వెయ్యవచ్చును. మెడ విషయంలో వాటికీ ఇతర పక్షులకూ తేడా ఏమీ లేదు,'' అన్నాడు అమరపాలుడు.

''హ్హహ్హ!'' అంటూ ఉగ్రాక్షుడు పెద్దగా నవ్వి, ''ఈసారి ఆ దుర్మార్గులు తటస్థపడితే, నా ప్రతాపం చూపుతాను!'' అంటూ జబ్బలు చరచసాగాడు. అంతలో కొందరు రాక్షసులూ, ప్రజలూ గగ్గోలు పెడుతూ, ''మహానాయకా! మహారాజా!'' అంటూ అక్కడికి పరిగెత్తి రాసాగారు.

ప్రాణభీతితో హాహాకారాలు చేస్తూ, తమను సమీపిస్తున్న ప్రజలనూ, రాక్షసులనూ చూస్తూనే, చిత్రసేనుడు మరేదో పెద్ద ప్రమాదం ముంచుకువచ్చిందని ఊహించాడు.

''మహారాజా! జడలమర్రి దగ్గిర పశువుల్ని మేపుతుంటున్న మా మీద,



భయంకర పక్షులూ, పులిరాయుళ్ళూ వచ్చిపడ్డారు. వాళ్ళు పశువుల్ని, మనుషుల్ని ఎత్తుకుపోతున్నారు. మేము కొద్దిమందిమి మాత్రం పారిపోయి వచ్చాం.'' అంటూ గగ్గోలుగా అరిచారు ప్రజలు.

ఉగ్రాక్షుడి దగ్గిరకు పరిగెత్తిపోయిన రాక్షసులు కూడా, తమ నాయకుడితో ఇలాగే మొరపెట్టుకున్నారు. కాని, వాళ్ళు పశువుల్ని మేపేందుకు వెళ్ళిన రాక్షసులు కాదు. దొంగతనంగా వాటిని ఎత్తుకుపోయేందుకు వెళ్ళినవాళ్ళు. పులిరాయుళ్ళు అదే సమయానికి అక్కడికి రావటంతో, వాళ్ళ చేతుల్లో ఏళ్ళు చావు దెబ్బలు తిన్నారు.

''చిత్రసేనా! మనం పశువుల కాపర్లకు రక్షణగా వెళదామంటావా?'' అని అడిగాడు ఉగ్రాక్షుడు నిరుత్సాహంగా.

''వెళ్ళక చేసేదేమిటి? ప్రజలను ఆ దుర్మార్గులు హింసిస్తూ వుంటే, చూస్తూ వూరుకుంటామా?'' అన్నాడు చిత్రసేనుడు.

ఆ వెంటనే చిత్రసేనుడు జడలమర్రి ప్రాంతానికి బయలుదేరాడు. ఉగ్రాక్షుడు ముఖంలో లేని గాంభీర్యాన్ని కనబరుస్తూ, ''ఊఁ పదండి! ఆ క్రూరుల్ని చిత్రవధ చేస్తాను,'' అంటూ అతడి వెనకగా నడిచాడు.

అందరూ కొంతదూరం చెట్లలో నడిచిన తరవాత, అమరపాలుడు ముందుకు వచ్చి, చిత్రసేనుడితో, ''మహారాజా, నాదొక మనవి! ఈసరికే పులిరాయుళ్ళు తమ పని ముగించుకుని వెళ్ళిపోయి వుంటారు. అలా కాక, వాళ్ళింకా అక్కడ వున్నప్పటికీ, మనం వాళ్ళను ఏమీ చేయలేం. ఆ భయంకరపక్షులు వెంట వుండగా, వాళ్ళను ఎదుర్కొనటం ఆత్మహత్యతో సమం అవుతుంది.'' అన్నాడు.

ఉగ్రాక్షుడు ఇందుకు అవునన్నట్టు తల వూపుతూ, ''చిత్రసేనా, ఈ అమరపాలుడు చెప్పేదాంట్లో నిజం వున్నది. మనం తొందరపడకూడదు. రాత్రి జరిగిన అనుభవం గుర్తుంది కదా!'' అన్నాడు.

వాళ్లిద్దరూ అలా చెప్పిన తరవాత చిత్రసేనుడికి కూడా, తను చేయబోతున్నది కేవలం దుస్సాహసమన్న అనుమానం కలిగింది. అనవసరంగా తన అనుచరులూ, కొందరు రాక్షసులూ ప్రాణాలు వదలటం తప్ప, జ్వాలాద్వీపవాసులతో పోరుపెట్టుకుని తను చేయగలిగిందేమీ లేదని అతడు గ్రహించాడు. అయితే, తను రాజయివుండీ, తన పౌరులకు రక్షణ కలిగించలేని నిస్సహాయ స్థితిలో ఇంకెంత కాలం రాజ్యపరిపాలన చెయ్యగలడు? తన తండ్రిగారి రాజ్యం మీద దాడి వెడలిన నాగవర్మ, అక్కడ విజయం సాధించగానే, తన నగరం మీద వచ్చి పడకుండా వూరుకుంటాడా?



ఇలాంటి సంశయాలతో, భయాలతో చిత్రసేనుడు సతమతమవుతూండగా, అమరపాలుడు, "మహారాజా! నేను మీకు నమ్మిన సేవకుణ్ణి. దూకమంటే అగ్నిలో అయినా దూకుతాను. కనుక, నా మాట నమ్మండి. మనం ముందుగా కపిలపురం అడవిలో స్థావరాలు ఏర్పరుచుకున్న భయంకర పక్షుల్ని కపటోపాయం ప్రయోగించి సర్వనాశనం చేయాలి. అప్పుడు, ఈ పులిరాయుళ్ళను హతమార్చటం ఏమంత కష్టం కాదు," అన్నాడు.

"అక్కడ దాదాపు నూరు భయంకర పక్షులున్నవంటున్నావ్! వాటిని మనం ఎలా చంపగలం?" అన్నాడు చిత్రసేనుడు.

"ఆ పక్షుల్ని చంపేందుకు ఒక సులువైన ఉపాయం వుంది మహారాజా!" అన్నాడు అమరపాలుడు.

"ఏమిటది?" అన్నాడు చిత్రసేనుడు.

ఈ సంభాషణ శ్రద్ధగా ఆలకిస్తున్న ఉగ్రాక్షుడికి కూడా, ఆ ఉపాయం ఏమిటో వినాలన్న కుతూహలం కలిగి, "ఏమిటా ఉపాయం అమరపాలా?" అన్నాడు ఎంతో ఆత్రుతగా.

అమరపాలుడు కోపంగా ఉగ్రాక్షుడికేసి చూసి, చిత్రసేనుడితో, "మహారాజా!



కపిలపురం దగ్గిర వున్న అడవిలో, భయంకరపక్షులు కొన్ని వున్నవని చెప్పానుగదా. అవి పెద్ద పెద్ద కొట్టాలలో, కాళ్ళకు బలమైన గొలుసులతో బంధించబడి, కట్టుకొయ్యలకు కట్టివేయబడి వుంటవి. వాటిని సవారీకి ఉపయోగించే రౌతులు ఆదగ్గిరలో వున్న గుడిసెలలో వుంటారు. ఆ పక్షులను కొట్టాలలో వుండగానే మనం చంపివేయాలి,'' అన్నాడు.

''బాగానే వుంది. కాని, చంపటం ఎలా అన్నదే సమస్య!'' అన్నాడు చిత్రసేనుడు నిరుత్సాహంగా.

''మహారాజా! ఇందుకు ఒక ఉపాయం నేను ఆలోచించి వుంచాను. వాటిని....'' అంటూ అమరపాలుడు చిత్రసేనుడితో మెల్లిగా ఏమో చెప్పబోయేంతలో, ఎదురుగా వున్న చెట్ల చాటు నుంచి పెద్ద కోలాహలం వినబడింది. చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ—వాళ్ళ అనుచరులూ అటుకేసి పరిగెత్తారు. వాళ్ళు చెట్ల గుంపును చేరి, ముందుకు చూసేసరికి, ఒకానొక బీభత్స దృశ్యం వాళ్ళ కంటబడింది.

కొన్ని భయంకర పక్షులు, గొర్రెలనూ, ఆవులనూ గోళ్ళతో పట్టుకుని, కోడిపిల్లలను తన్నుకుపోయే గద్దలలాగా ఆకాశంలోకి లేస్తున్నవి. పులిచర్మాలు ధరించిన వాళ్ళు వాటి రెక్కల మీద వుండి పెద్దగా కేకలు పెడుతూ, పారిపోతున్న పశుల కాపరుల మీదికి శూలాలను విసిరివేస్తున్నారు. ఒక్కొక్క పులిచర్మంగాడి దగ్గిరా ఒక మోపెడు శూలాలు వున్నవి. పశుల కాపర్లలో తెగించినవాళ్ళు కొందరు నిలబడి, వడిసెలలతో వాళ్ళ మీదికి రాళ్ళు విసురుతున్నారు. పశువులు అన్ని వైపులకూ చెల్లాచెదరుగా పారిపోతున్నవి.

ఈ భయంకర దృశ్యం చూసి చిత్రసేనుడు నిలువెల్లా కంపించిపోయాడు. ఉగ్రాక్షుడు క్రోధంతో ఒక్కసారి ఒళ్ళు విదిలించుకుని, రాతి గదను బలంగా భూమికి కొటించి, గర్జించబోయేంతలో, చిత్రసేనుడు అతణ్ణి వారిస్తూ, ''అంతా

అయిపోయిన తరవాత, ఇప్పుడు మళ్ళీ ఆ క్రూరులు మన మీద వచ్చిపడేలా నువ్వు అరిచి లాభం లేదు. మనం ఇప్పుడు చేయగలిగిందల్లా, గాయపడిన పశులకాపర్లకు కట్లుకట్టి ఇళ్ళకు చేర్చటమే,'' అన్నాడు.

చిత్రసేనుడు ఇలా అనగానే, అతడి అనుచరులూ, కొందరు రాక్షసులూ ముందుకు వెళ్ళబోయారు. కాని, చిత్రసేనుడు వాళ్ళను ఆపి, ''ముందు ఆ దుర్మార్గుల్ని ఇక్కణ్ణించి వెళ్ళిపోనీయండి,'' అన్నాడు.

చూస్తూండగానే జ్వాలాద్వీప వాసులు తమ వాహనాల మీద ఆకాశంలోకి ఎగిరి పోయారు. వాళ్ళు దూరంగా కనబడకుండా పోయినంతవరకూ ఆగి, తరవాత రాక్షసులూ, చిత్రసేనుడి అనుచరులూ గాయపడ్డవాళ్ళకు కట్లు కట్టసాగారు. ఉగ్రాక్షుడు నీరసంగా ఒక చెట్టు బోదెకు చేరగిలపడి, ''చిత్రసేనా! నాకు ఏనాడూ లేనిది ఎందుకనో కాస్త భీతి కలుగుతున్నది. మన రాజ్యానికి ఈ మహమ్మారిగాళ్ళ పీడ విరగడ అయే మార్గమేదో ఆలోచించాలి,'' అన్నాడు.

చిత్రసేనుడు, అమరపాలుడి కేసి తిరిగి, ''అమరపాలా! జ్వాలాద్వీప వాసుల్ని, వాళ్ల భయంకరపక్షుల్ని నాశనం చేసేందుకు ఏదో ఉపాయం వున్నదన్నావు. ఏమిటది?'' అని అడిగాడు.

''ఆ భయంకర పక్షుల్ని, అవి కట్టివేయబడి వుండే కొట్టాల్లోనే నాశనం చేయాలి. అందుకు ఒకటే మార్గం, అవి వుండే కొట్టాలకు నిప్పు పెట్టటమే,'' అన్నాడు అమరపాలుడు.

''అది సాధ్యం అయే పనేనా?'' అని అడిగాడు చిత్రసేనుడు.

''ఎందుకు సాధ్యం కాదు మహారాజా! నా వెంట నలుగురైదుగురు సైనికుల్ని పంపండి. నేను కపిలపురం అడవుల్లోకి వెళ్ళి, కావలిగాళ్ళను హతమార్చి, ఆ పక్షుల్ని నిలువునా దహించేస్తాను,'' అన్నాడు అమరపాలుడు. —(ఇంకావుంది)






## 7

[ఉగ్రాక్షుడికి దొరికిపోయిన అమరపాలుడు, చిత్రసేనుడితో జ్వాలాద్వీప వాసులను గురించిన కొన్ని రహస్యాలు చెప్పాడు. రాజద్రోహి నాగవర్మను గురించి కూడా కొన్ని రహస్యాలు చిత్రసేనుడికి తెలిసినై. ఆ ద్రోహికి సహాయం చేస్తున్న పులిరాయుళ్ళనూ, వాళ్ళ భయంకర పక్షుల్నీ కొట్టాలకు నిప్పుపెట్టి సర్వనాశనం చేస్తానని అమరపాలుడు అన్నాడు. తరవాత—]

అమరపాలుడి మాటలు వింటూనే చిత్రసేనుడు ఉగ్రాక్షుడి కేసి చూశాడు. ఉగ్రాక్షుడికి అమరపాలుడి మాటల్లో పూర్తి విశ్వాసం కలిగింది. అతడు ఉత్సాహంగా లేచి నిలబడి, ''నా సేవకులైన రాక్షసుల్లో ఇద్దరు ముగ్గుర్ని తోడుగా పంపుతాను. ఈ పని సానుకూలం అయితే, అమరపాలుణ్ణి గొప్పగా బహూకరించగలను,'' అన్నాడు.

చిత్రసేనుడు ఓ క్షణకాలం ఆలోచించి, ''పనిలో పనిగా, ఆ కపిలపురాన్ని కూడా ఆక్రమించుకోవటం బావుంటుంది గదా? రాజును చెరపట్టిన సేనాని నాగవర్మ, నా తండ్రిగారి రాజ్యమైన ధవళగిరి మీదికి దాడి వెళ్ళాడు. ఇప్పుడు కపిలపురానికి రక్షణగా పెద్ద సైన్యం వుండి వుండదు. మనం హఠాత్తుగా దాడిచేస్తే కపిలపురం కోటను ఆక్రమించుకోవచ్చు.'' అన్నాడు.



రాజ్యాన్ని తన రాజ్యంలో కలుపుకోవటం గాని, అతని కుమార్తెను తండ్రి అనుమతి లేకుండా వివాహం ఆడటం గాని న్యాయం అనిపించుకోదు. పైగా ఆ కాంతిమతి ఈసరికే మరొక వరుణ్ణి ఎన్నుకుని వుండవచ్చు. రాక్షసుడైన ఉగ్రాక్షుడికి మానవులు పాటించే మంచి మర్యాదల గురించి ఏమీ తెలియదు.

"ఉగ్రాక్షా! ఇప్పటి మన ప్రయత్నం నాగవర్మను ఓడించటం. ఆ విధంగా త్వరలో మనకు పక్కలో బల్లెమైన ఒక దుష్టుడి పీడ విరగడ అవుతుంది. కపిలపుర రాజ్యానికి వీరసింహుణ్ణే తిరిగి రాజుగా పట్టాభిషేకం చేస్తాం. కాని, ఇవన్నీ సాధించాలంటే ముందుగా మనం ఆ భయంకర పక్షుల్నీ, వాటి రౌతుల్నీ తుదముట్టించాలి. వాళ్ళు ఆ రాజ్యం పొలిమేరలలో వుండగా మనం ఎంత పెద్ద సైన్యంతో వెళ్ళినా కపిలపురాన్ని ఆక్రమించుకోలేం సరిగదా, మనమే వాళ్ళ చేతుల్లో తప్పక సర్వనాశనం అవుతాం," అన్నాడు చిత్రసేనుడు.

"ఆ బాధ్యత నా మీద పెట్టండి. మీరు సైన్యాలతో అడవిలో దాగివుండి, భయంకర పక్షులు కొట్టాల్లో మాడి చావగానే, కపిలపురం మీద దాడి చెయ్యవచ్చు." అన్నాడు అమరపాలుడు.

చిత్రసేనుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు ఎగిరి గంతేసి, "మహా పసందైన ఆలోచన, చిత్రసేనా! మనం కపిలపురాన్ని ఆక్రమించుకోవటమే గాదు, వీరసింహ మహారాజు కుమార్తె కాంతిమతిని కూడా, నాగవర్మ పాలుకాకుండా కాపాడదాం. నువ్వు యువకుడివి, బ్రహ్మచారివి. ఒక్క వేటుతో నీ రాజ్యం రెండింతలు కావటమే గాక, గొప్ప సౌందర్యవతి అయిన రాజకుమార్తె కూడా నీకు భార్య అవుతుంది." అన్నాడు.

ఉగ్రాక్షుడి మాటలు చిత్రసేనుడికి ఏవగింపు కలిగించినై. కపిలపురం రాజైన వీరసింహుడు బతికి వుండగానే, అతడి

ఇందుకు చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ అంగీకరించారు. వెంటనే అమరపాలుడికి తోడుగా ఇద్దరు రాక్షసులూ, నలుగురు చిత్రసేనుడి సైనికులూ బయలుదేరారు. అమరపాలుడు వాళ్ళను వెంటబెట్టుకుని చూస్తూండగానే అడవిచెట్లలో మాయ మయాడు. చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ తమ సైన్యాలనూ, అనుచరులనూ సమాయత్తం చేసేందుకు భటుల ద్వారా ఆజ్ఞలు పంపారు.



ఈలోపల అమరపాలుడు సైనికుల్ని వెంటపెట్టుకుని, అడవిదారుల వెంట ప్రయాణిస్తూ మిట్టమధ్యాహ్నం వేళకు, కపిలపురం సమీపాన గల అడవిని చేరాడు. ఆ అడవిలోనే దాదాపు నూరు భయంకర పక్షులు పెద్ద పెద్ద కొట్టాలలో కట్టివేయబడి వున్నవి. వాటిని కాపలా కాసేవాళ్ళు ఆ సమీపంలోనే చిన్న చిన్న గృహాల్లో వుంటున్నారు.

అమరపాలుడు తన అనుచరులందర్నీ ఒకచోట చేర్చి, వారికి కాపలావాళ్ళుండే గృహాలు చూపుతూ, "నేను ఈ ప్రాంతమంతా బాగా ఎరిగినవాణ్ణి. ఆ కాపలా వాళ్ళల్లో కూడా ప్రతి ఒక్కడూ నాకు తెలును. నేను ముందుగా వాళ్ళ దగ్గిరకు వెళ్ళి అందర్నీ ఒకచోట చేర్చుతాను. ఆ సమయంలో మీరు హఠాత్తుగా వాళ్ళ మీద పడి నిర్దాక్షిణ్యంగా చంపేయండి. ఆ తరువాత భయంకర పక్షులున్న కొట్టాలకు నిప్పు పెడదాం," అన్నాడు.

ఇందుకు అందరూ సరేనన్నారు. తరవాత అమరపాలుడు కాపలావాళ్ళ గృహాలకేసి పరిగెత్తుతూ కేకలు పెట్టాడు. ఆ కేకలు వింటూనే కాపలావాళ్ళు ఇళ్ళల్లో నుంచి బయటికి వచ్చి, అమరపాలుణ్ణి చుట్టుముట్టారు. వాళ్లు అందరూ కలిసి దాదాపు ఇరవైమందికన్న ఎక్కువ వుండరు.

"అమరపాలా! బతికి బయటపడ్డావా? నువ్వు ఆ రాక్షసుల చేతిలో చిక్కి చచ్చిపోయావని మేమంతా అనుకున్నాం." అన్నారు వాళ్ళు.



పోకుండా చూసేందుకే వుంచబడ్డారు. నాగవర్మరాజు సర్వసైన్యాల్ని వెంటబెట్టుకుని ముందు ధవళగిరినీ, ఆ తరవాత అడవిలో వున్న చిత్రసేనుడి కోటనూ ఆక్రమించుకుని—అంతా ఓ చుట్టుచుట్టి ఇక్కడికి వస్తారు. ఆ తరవాత మనలో ప్రతి ఒక్కడూ ఒక సామంతరాజువు తాడనుకో,'' అన్నారు వాళ్ళు.

ఆ మాటలు వింటూనే అమరపాలుడు పరమానందం చెందినవాడిలా పెద్దగా నవ్వి, గంతులు వేస్తూ చేతులు పైకెత్తి సంజ్ఞలు చేశాడు. మరుక్షణంలో చెట్ల చాటు నుంచి భయంకరంగా రంకెలు వేస్తూ రాక్షసులూ, సైనికులూ పరుగెత్తుకుని వచ్చి కాపలావాళ్ళ మీద పడ్డారు. అదే అదనులో అమరపాలుడు కూడా కత్తి దూసి, కాపలావాళ్ళయిన జ్వాలా ద్వీపవాసుల్ని నరకసాగాడు. నిరాయుధులుగా వున్న ఆ క్రూరులు నిమిషాల మీద యమపురికి ప్రయాణం కట్టారు.

ఆ వెంటనే అమరపాలుడూ, రాక్షసులూ ఇళ్ళలోకి జొరపడి నూనెలో ముంచిన కాగడాలను వెలిగించి, భయంకర పక్షులు కట్టివేయబడి వున్న తాటాకు కొట్టాలకు అన్ని వైపుల నుంచీ నిప్పు పెట్టారు. గాలి తాకిడికి క్షణాల మీద కొట్టాలన్నీ ముట్టుకుని భగభగమంటూ

''చావవలసినవాణ్ణే, కాని భూమి మీద ఇంకా నూకలుండి ప్రాణాలతో పారిపోయి ఇక్కడికి రాగలిగాను. ఎన్ని జిత్తులు ప్రయోగించి వాళ్ళ వలలో పడకుండా బయటపడ్డానో, ఆ పరమాత్ముడికే ఎరుక. పక్షుల్లో ఏ ఒకటీ చావకుండా, అన్ని కొట్టాలకు చేరినయ్యా?'' అన్నాడు అమరపాలుడు.

''అన్ని సురక్షితంగానే వున్నవి. నాగవర్మ మహారాజు ధవళగిరి మీదికి దండు వెడలాడు. ఇప్పుడు కపిలపురానికి రక్షకులం మనమే. కోటలో కొద్దిమంది భటులు మాత్రమే వున్నారు. వారైనా కోట రక్షణ కన్న రాజకుమార్తె కాంతిమతి పారి



మండసాగినై. బలమైన ఇనపగొలుసులతో కట్టివేయబడిన భయంకర పక్షులు అగ్ని జ్వాలల నుంచి బయటపడేందుకు భీకరంగా అరుస్తూ, ముక్కులతో కాళ్ళ గొలుసులను ఛేదించేందుకు ప్రయత్నించినై. కాని, ఈ లోపలే కొట్టాల కప్పులు కాలి దభీమంటూ లోపలికి కూలటంతో, ఆ మంటల్లో కొన్ని కాలిపోయినై. గొలుసులను ఛేదించుకోగలిగిన కొన్ని భయంకర పక్షులు మండుతూన్న దేహాలతో పైకెగిరి అంతలోనే భూమి మీద పడిపోయి, గిలగిల కొట్టుకుంటూ ప్రాణాలు వదిలినై.

అమరపాలుడూ, అతని అనుచరులూ సంతోషం పట్టలేక కుప్పిగంతులు వేస్తూ పాటలు పాడసాగారు. ఉన్నట్టుండి దాపుల వున్న ఒకానొక కొండప్రాంతాన్నుంచి భేరీ మోతలు వినబడినై. ఆ ధ్వని వింటూనే అమరపాలుడు ఆ దిక్కుకేసి చూస్తూ, "చిత్రసేన మహారాజూ, ఉగ్రాక్షుడూ సైన్యాలతో వస్తున్నారు. ఇక్కడ మనం రేపిన మంటలు వాళ్లకు కనబడి వుంటవి. ఇక మనం కపిలపురాన్ని ఆక్రమించుకోవటమే తరువాయి. మీలో ఒకరిద్దరు సైన్యాలకు ఎదురువెళ్ళి, ఇక్కడ పని సానుకూలం అయినట్టు చెప్పండి," అన్నాడు అనుచరులతో.

అమరపాలుడు ఇలా చెప్పగానే రాక్షసులిద్దరు రాతి గదలను గిర్రుగిర్రున తిప్పుతూ, పొదల మీది నుంచి వేగంగా దూకుతూ భేరీ ధ్వనులు వచ్చిన వైపుకు పరిగెత్తారు.

కొద్దిసేపటి తరవాత చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ సైన్యంతో అక్కడికి వచ్చారు. వాళ్ళకు అమరపాలుడు చేసిన బీభత్సం కంటబడింది. ఇంకా అక్కడా ఇక్కడా మంటలు లేస్తూ, ఆకాశం కేసి పొగలు జిమ్ముతున్న భయంకర పక్షుల కొట్టాలను చూసి ఉగ్రాక్షుడు పట్టలేని ఆనందంతో అమరపాలుణ్ణి సమీపించి, అతణ్ణి చేతులు పట్టుకుని లేవనెత్తి గాలిలో గిర్రున తిప్పుతూ, "ఆహా, వీరుడివంటే నువ్వేయ



అమరపాలా! నా అడవికి శత్రుభయం లేకుండా చేశావ్. ఏం కావాలో కోరుకో!'' అన్నాడు.

''నీ తిప్పడికి గుండెలవిసి చావక ముందే, నన్ను వదిలిపెట్టు, అంతే చాలు!'' అన్నాడు అమరపాలుడు ఆయాసపడుతూ.

ఉగ్రాక్షుడు అతణ్ణి తిరిగి భూమి మీద నిలబెట్టి భుజం తడుతూ, ''ఒక్క భయంకరపక్షి కూడా పారిపోకుండా, అన్నిటినీ నిప్పుల్లో మాడ్చావుగదా?'' అని అడిగాడు.

''అవును. ఒక్కగానొక్కటి కూడా పారిపోలేదు. ఇక మిగిలిందల్లా వాటి రౌతుల్లో కొందరు. ఇక్కడ దాదాపు ఇరవైమంది చచ్చారు. తతిమ్మావాళ్ళు కపిలపురం కోటలో వుంటారని నా అనుమానం,'' అన్నాడు అమరపాలుడు.

''ఓః, ఇక వాళ్ళెక్కడికి పోతారు? మనం సైన్యాలతో కోటను చుట్టుముట్టి భస్మీపటలం చేసేస్తాం,'' అంటూ ఉగ్రాక్షుడు జబ్బలు చరిచాడు.

''అలా చేస్తే, రాజకుమార్తె శాంతిమతి కూడా ప్రమాదం కలుగుతుంది. ఆ కోటను పట్టుకునే పని నాకు వదులు, ఉగ్రాక్షా!'' అన్నాడు చిత్రసేనుడు.

''అవునవును, ఆ అమ్మాయి మాటే మరిచాను. కోటకు ఎలాంటి హానీ జరక్కూడదు, విన్నారా?'' అంటూ ఉగ్రాక్షుడు తన సేవకులకేసి గుడ్లురిమాడు.

''విన్నాం, విన్నాం మహానాయకా!'' అంటూ వాళ్ళు కేకలు పెట్టారు.

ఆ తరవాత అమరపాలుడి నాయకత్వం కింద, పదిమంది అశ్వసైనికులు వేగు చూసేందుకు కపిలపురం వైపుకు పంపబడ్డారు. మిగిలిన సైనికులు వంట తయారు చేసే పనిలో నిమగ్నమయారు.

సూర్యుడు పడమటి దిక్కుకు వాలుతున్నాడు. సైనికులు భోజనాలు ముగించి చెట్ల నీడల్లో విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆ సమయంలో వేగు పంపబడిన అశ్వికుల్లో ఒకడు అక్కడికి వచ్చి, ''మహా

రాజా! ప్రమాదం. యాభై అరవైమంది పులిరాయుళ్ళు రాజకుమార్తెను మేనాలో ఎక్కించుకుని, కోట వదిలి అడవిలో ఎక్కడికో పోతున్నారు,'' అని చెప్పాడు.

ఈ వార్త వింటూనే చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ కూడా తుళ్ళిపడ్డారు. ఇక్కడ భయంకర పక్షులు మరణించిన సంగతి, కపిలపురం కోటలో వున్న పులిరాయుళ్లకు తెలిసి వుంటుంది. ఇక్కడ లేచిన మంటలూ, పొగా ఆ విషయాన్ని బయట పెట్టి వుంటవి. అందువల్ల ఇక కోట తమ రక్షణకు ఉపయోగించదని తెలుసుకుని, వాళ్ళు రాజకుమార్తెను ఎక్కడో కొండల్లో దాచేందుకు తీసుకుపోతూ వుండి వుంటారు.

చిత్రసేనుడు ఇలా వూహించి, తన సైనికుల్లో రాటుతేలిన యోధులు యాభై మందినీ, ఉగ్రాక్షుణ్ణీ అతడి అనుచరుల్లో కొద్దిమందినీ వెంటపెట్టుకుని, రాజకుమార్తె కోసం అడ్డదారివెంట బయలుదేరాడు. తతిమ్మా సైన్యం అమరపాలుడి నాయకత్వాన కపిలపురం కోట వశపరచుకునేందుకు వెంటనే బయలుదేరవలసిందిగా ఆజ్ఞాపించాడు.

వేగు వెళ్ళిన ఆశ్వికుడు దారి చూపగా కొద్దిసేపటికల్లా చిత్రసేనుడు తన అనుచరులతో పులిరాయుళ్ళు వున్న ప్రాంతానికి వచ్చాడు. వేగువాడు చెప్పినట్టుగానే ఒక మేనాను నలుగురు బోయీలు మోస్తున్నారు. దానికి ముందూ వెనకా కత్తులూ, కటార్లూ ధరించిన పులిరాయుళ్ళు నడుస్తున్నారు.

చిత్రసేనుడు తమను సమీపిస్తూండటం చూస్తూనే, పులిరాయుళ్ళ నాయకుడు కత్తి పైకెత్తి భీకరంగా గర్జిస్తూ, ''మేనా దించండి,'' అని బోయీలను ఆజ్ఞాపించి, తన అనుచరులతో, ''మన గొంతులో ఊపిరి వుండగా, కాంతిమతి శత్రువుల చేజిక్కరాదు. మనలో ఆఖరివాడు చచ్చే ముందు, ఆమెను చంపి చావాలి, ఇది మహారాజు నాగవర్మగారు ఇచ్చిన ఆజ్ఞ!'' అన్నాడు.

—(ఇంకావుంది)








## 8

[అమరపాలుడి నాయకత్వాన వెళ్ళిన సైనికులు భయంకర పక్షుల్ని నిలువునా దహించారు. తరవాత రాకుమార్తె కాంతిమతిని, పులిరాయుళ్ళు మేనా ఎక్కించి ఎక్కడికో తీసుకు పోతున్నట్టు వార్త వచ్చింది. చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ సైనికులతో వెళ్ళి, మేనాను అడ్డగించారు. పులిరాయుళ్ళ నాయకుడు, రాజకుమార్తెను చంపమని ఆజ్ఞయిచ్చాడు. తరవాత—]

పులిరాయుళ్ళ నాయకుడు, తన అనుచరులకు చేసిన హెచ్చరిక వింటూనే, ఒకవైపు నుంచి చిత్రసేనుడూ, రెండవ వైపు నుంచి ఉగ్రాక్షుడూ అతడి సేవకులూ వాళ్ళ మీద పడ్డారు. చూస్తూండగానే పులిరాయుళ్ళు రాక్షసుల రాతి గదలకూ, చిత్రసేనుడి అనుచరుల కత్తిదెబ్బలకూ నేల కొరగసాగారు. ఇక విజయావకాశం ఏమాత్రం లేదని గ్రహించిన పులిరాయుళ్ల నాయకుడు, ఎక్కడ లేని తెగింపుతో ఒక చేత్తో కత్తినీ, రెండవ చేత్తో ఈటెనూ పట్టుకుని భయంకరంగా పోరాడుతూ, "మన అంతం సమీపించింది. ముందు కాంతిమతిని చంపండి!" అంటూ కేకలు పెట్టాడు.

ఆ కేకలు వింటూనే చిత్రసేనుడు నివ్వెరపోయాడు. రాజకుమార్తె ఈ దుర్మార్గుల చేతిలో తప్పక మరణించ



గలదని అతడు భావించాడు. తనకూ, రాజకుమార్తె వున్న మేనాకూ మధ్య దాదాపు పదిమంది శత్రువులు అన్నిటికీ తెగించి అతి భీకరంగా పోరాడుతున్నారు. వీళ్ళను చంపి గాని తను మేనాను సమీపించలేడు.

చిత్రసేనుడు మహోద్రేకంతో కత్తిని ఎదురుగా వున్న శత్రువుల మీదికి విసురుతూ, తనను పక్కల నుంచి ఎదుర్కొంటున్న శత్రువుల మాటే మరిచి, సూటిగా మేనాకేసి వెళ్ళసాగాడు. అంతలో మేనా తలుపులు ఫెళ్ళుమంటూ తెరుచుకున్నవి. కాంతిమతి మెరుపులా మేనా నుంచి కిందికి దూకి, దాపుల చచ్చి పడివున్న శత్రుసైనికుడి కత్తి ఒకటి తీసుకుని, మేనా పక్కకు వస్తున్న పులిరాయుళ్ళను ఎదుర్కొన్నది. ఇది చూసిన ఉగ్రాక్షుడు అడవి దద్దరిల్లేలా రంకె వేసి, ''ఇదుగో, వస్తున్నాను, కాంతిమతీ! క్షత్రియకన్య వనిపించుకున్నావు!'' అంటూ గదతో తనకు అడ్డువచ్చిన పులిరాయుళ్ళను బంతులను కొట్టినట్టు గాలిలోకి ఎగరకొడుతూ మేనాను సమీపించాడు. ఈ లోపల చిత్రసేనుడు కూడా మేనాను సమీపించాడు. వాళ్ళకు రక్తం ఓడుతున్న కత్తి పట్టుకు నిలబడివున్న కాంతిమతి కంట బడింది.

''ఈయన చిత్రసేనమహారాజు. నేను ఉగ్రాక్షుణ్ణి! ఈ అడవి అంతా నాదే!'' అన్నాడు ఉగ్రాక్షుడు, కాంతిమతితో.

కాంతిమతి ఉగ్రాక్షుడి కేసి కోపంగా చూసి, చిత్రసేనుడి వైపుకు తలయినా తిప్పకుండా గిర్రున వెనుదిరిగి, మేనాలో ఎక్కి కూర్చున్నది.

రాజకుమారి కాంతిమతి ప్రవర్తన చిత్రసేనుడికి ఆగ్రహం కలిగించింది. తను ప్రాణాలకు తెగించి పులిరాయుళ్ళతో పోరాడి, ఆమెను కాపాడాడు. అయినా, రాజకుమారి తనకు కృతజ్ఞత చెప్పక పోగా, ఈసడించినట్టు తన కేసి చూడటం అతడికి పెద్ద అవమానంగా తోచింది.



"ఉగ్రాక్షా, ఇక్కడ మన పని ముగిసింది. ఇక మనం సైన్యాలతో ధవళగిరి కేసి బయలుదేరటం మంచిది," అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు అదిరిపడ్డాడు. తాము ముందు అనుకున్న పథకం ప్రకారం, అంతా కలిసి కపిలపురం కోటను ముట్టడించవలసి వున్నది. ఆ పని మీద అంతకు ముందే కొద్ది సైన్యంతో అమరపాలుడు వెళ్ళాడు. కపిలపురం కోటను వశపరుచుకుని, ఆ తరవాత రాజద్రోహి నాగవర్మను హతమార్చాలని లోగడ నిర్ణయం జరిగింది. కాని, ఇప్పుడు చిత్రసేనుడి ధోరణి చూస్తూంటే మరోలా వున్నది.

"చిత్రసేనా, మనం ముందుగా కపిలపురం కోటను వశపరుచుకోదలిచాం గదా? అదృష్టవశాత్తూ, మార్గమధ్యంలో రాకుమారిని కాపాడాం," అన్నాడు ఉగ్రాక్షుడు తడబడుతూ.

"మనం రాకుమారిని కాపాడామా? ఊహుం, ఆవిడే మనను రక్షించినట్టుగా ప్రవర్తిస్తున్నది. జ్వాలాద్వీపవాసులతో చేతులు కలిపిన నాగవర్మ, వీరసింహ మహరాజును బందీని చేసి జ్వాలాద్వీపం పంపినట్టు అమరపాలుడు లోగడే చెప్పాడు. అటువంటి పరిస్థితుల్లో, మనం యుద్ధం చేసి కపిలపురాన్ని వశపరుచుకుని ఎవరికి రాజరికం కట్టబెట్టగలం?" అన్నాడు చిత్రసేనుడు కోపంగా.

చిత్రసేనుడు మాటలు ముగించే లోపలే, కాంతిమతి మేనాలో నుంచి బయటికి వచ్చింది. ఆమె చిత్రసేనుడి కేసి అనుమానంగా చూస్తూ, "నా తండ్రి గారిని ద్రోహి నాగవర్మ జ్వాలాద్వీపం పంపినట్టు మీతో చెప్పిన ఆ అమరపాలుడు ఎవరు?" అని ప్రశ్నించింది.

"అతడు కపిలపురంవాడే. నాగవర్మ సైన్యంలో చేరి, మాకు బందీగా చిక్కి, తరవాత కొన్ని రహస్యాలు చెప్పి, మాకు సహాయపడ్డాడు," అన్నాడు చిత్రసేనుడు.



''ఇంతకుముందు మీ ప్రవర్తన మరో విధంగా వున్నది. నన్ను మీ సామంతరాజు కన్న కూడా హీనంగా చూశారు. బహుశా నన్ను గురించి మీకేమీ తెలియదేమో. ఇప్పుడు మీరున్న ఈ అడవిప్రాంతం అంతా నాది. ఇక్కడికి దాపులనే వున్న అపూర్వ భవనం, దానికి అనుకునివున్న నగరం—నా రాజధాని.'' అన్నాడు చిత్రసేనుడు గాంభీర్యం వుట్టిపడే గొంతుతో.

రాజకుమారి కాంతిమతి పెదాల మీద చిరునవ్వు కదలాడింది. ''ఈ అడవి అంతా తనదని, ఇంతకుముందు ఉగ్రాక్షుడు నాతో అన్నారు.'' అన్నదామె.

చిత్రసేనుడు, ఉగ్రాక్షుడి కేసి నిప్పులు చెరిగే కళ్ళతో చూశాడు. ఉగ్రాక్షుడు ఒక్క నిమిషం గజిబిజి పడిపోయాడు. అతడి నోటివెంట మాట పెగలలేదు. ''ఈ అడవి నాదయినా, నేను చిత్రసేన మహారాజుగారి మనిషిని. అందువల్ల అడవి కూడా ఆయనదే.'' అన్నాడతడు బిక్క మొహం వేసి.

''ఇప్పుడు నాకు సంశయ నివారణ అయింది. కపిలపురం రాజైన వీరసింహుడి ఏకైక పుత్రిక అయిన నేను—కాంతిమతిని, చిత్రనగర మహారాజయిన చిత్రసేనులవారి సహాయం కోరుతున్నాను. రాజద్రోహి అయిన నాగవర్మవల్ల కారా

''ఆ అమరపాలుడు చెప్పింది అబద్ధం, బహుశా, అతడికి నిజం తెలిసివుండదు. నా తండ్రిగారు కోటలోనే ఏదో భూగృహంలో బంధించబడి వున్నారు.'' అన్నది కాంతిమతి.

''అలాగా!'' అన్నాడు చిత్రసేనుడు.

''మనం ఆయన్ని రక్షిద్దాం, చిత్రసేనా!'' అన్నాడు ఉగ్రాక్షుడు ఆత్రంగా.

''పిలవని పేరంటం మన కెందుకు? మన నుంచి అలాటి సహాయం కావాలని ఎవరు కోరారు?'' అంటూ చిత్రసేనుడు ఉగ్రాక్షుడి మీద కస్సుమన్నాడు.

''సహాయం చేయవలసిందని నేను కోరుతున్నాను.'' అన్నది కాంతిమతి.







గారంలో బంధించబడిన నా తండ్రిని రక్షించి, ఆ ద్రోహిని తగు విధంగా శిక్షించ వలసిందని నా ప్రార్థన.'' అన్నది కాంతిమతి ఎంతో గౌరవం పుట్టిపడే కంఠస్వరంతో.

కాంతిమతి అలా అనేసరికి చిత్రసేనుడి హృదయం ఆనందంతో ఉప్పొంగిపోయింది. అతడు ఉగ్రాక్షుడి కేసి తిరిగి, ''ఉగ్రాక్ష! నీ పొగరుబోతు మాటలు ఎన్ని అపోహలకు కారణం అవుతున్నవో, ఇప్పటికైనా గ్రహించావా? ఇకనైనా 'ఈ అడవి నాది.' అనే బొల్లిమాటలు కట్టిపెట్టు. అంతేకాక, ఇంతకుముందు నువ్వన్నట్టు, నీవు మహారాజుగారి మనిషివి కాదు, రాక్షసుడివి—నా సేవకుడివి!'' అన్నాడు కఠినంగా.

''ఓఁ, సేవకుణ్ణే, సేవకుణ్ణే, ముమ్మాటికీ!'' అంటూ ఉగ్రాక్షుడు కాంతిమతి కేసి తిరిగి ప్రణామం చేశాడు.

కాంతిమతి చిరునవ్వు నవ్వింది. చిత్రసేనుడు ఇనుమడించిన ఉత్సాహంతో తన అనుచరులకేసి తిరిగి, ''మేనా వెంట వున్న పులిరాయుళ్ళలో ఎవరూ ప్రాణాలతో పారిపోలేదనుకుంటాను. సరే, ఇక మనం సరాసరి కపిలపురానికి బయలుదేరి వెళ్ళాలి. మీలో నలుగురు మేనా ఎత్తుకోండి,'' అని చెప్పి కాంతిమతితో, ''రాకుమారీ, మీరు మేనా ఎక్కండి.'' అన్నాడు.

కాంతిమతి తల అడ్డంగా తిప్పుతూ, ''మహారాజా! ఇప్పుడు నేను బందీని కాను. కనుక, మీతోపాటు స్వేచ్ఛగా గుర్రం మీద ఎక్కి రానివ్వండి.'' అన్నది.

''అవును, మహారాజా! అదే బావుంటుంది. రాజకుమారి ఇందాక పులిరాయుళ్ళను కత్తితో ఎదుర్కొన్న తీరు చూశారు గదా!'' అన్నాడు ఉగ్రాక్షుడు.

''ఆమె ఇక కత్తిపట్టి యుద్ధం చెయ్యవలసిన అవసరం లేదు. గుర్రం ఎక్కి మన వెంట రావొచ్చు. కపిలపురం కోటను వశపరుచుకోవటం, వీరసింహ, మహా



రాజును బంధవిముక్తుణ్ణి చేయటం—అదంతా మన పని. ఆ ప్రయత్నంలో శత్రువులతో చేయవలసిన పోరు మన సైనికులూ, మనం చేస్తాం," అన్నాడు చిత్రసేనుడు.

ఆ వెంటనే చిత్రసేనుడి సైనికులూ, ఉగ్రాక్షుడి అనుచరులైన రాక్షసులూ జట్లు జట్లుగా చేరి, అశ్వారూఢులైన చిత్రసేన, కాంతిమతుల వెనకగా, కపిలపురం కేసి బయలుదేరారు. ఒక గంట తరవాత వాళ్ళు కొండదాపుల వున్న కపిలపురం కోటను సమీపించారు. దూరాన వుండగానే వాళ్ళకు కోట బురుజుల మీద వున్న శత్రుసైనికులూ, కోట మీద ఆకాశంలో పహరా తిరుగుతున్న రెండు భయంకర పక్షులూ కనిపించినై.

ఆ భయంకర పక్షుల్ని చూస్తూనే చిత్రసేనుడితోపాటు, ఉగ్రాక్షుడు కూడా నివ్వెరపోయాడు. ఉగ్రాక్షుడు ఆత్రంగా చిత్రసేనుడి దగ్గిరకు పరిగెత్తుకువచ్చి, "మహారాజా! ఇక్కడ కూడా మన పాలిటికి ఈ భయంకర పక్షులు దాపరించినై. సైన్యంతో మీరు పంపిన అమరపాలుడి అయిపూ అజా లేదు. అందర్నీ శత్రువులు స్వాహా చేయలేదు గదా?" అన్నాడు.

చిత్రసేనుడికి కూడా ఇలాంటి అనుమానమే కలిగింది. అతడు కోట ద్వారాల కేసి చూశాడు. అవి బంధించబడి వున్నవి. వాటిముందు ఎక్కడా మరణించిన సైనికులు పడివున్న సూచనలు లేవు. బహుశా, అమరపాలుడు కోటను వశపరుచుకోవటం తన తలకు మించిన పని అని గుర్తించి, ఈ ప్రాంతాల ఎక్కడో కాపలా వేసి వుంటాడు.

చిత్రసేనుడు ఇలా ఆలోచిస్తున్నంతలో, అల్లంత దూరంలో చెట్ల మధ్య కోలాహలం బయలుదేరింది. చూస్తూండగానే అమరపాలుడు గుర్రాన్ని దూకిస్తూ, చిత్రసేనుడి దగ్గిరకు వచ్చి, "చూశారా మహారాజా! నాగవర్మ ముఖ్య సైన్యంతో

కోట వదిలి ధవళగిరి మీదికి దాడి వెళ్తూ, కోటకు తగిన రక్షణ ఏర్పాటు చేశాడు. ఇందాకటి నుంచి చూస్తున్నాను. ఆ భయంకర పక్షులు రెండే రెండు కోట మీద గస్తీ తిరుగుతున్నవి. అంతకు మించి కోటలో మరి పక్షులు వున్నట్టు లేదు. బురుజుల మీద కాపలా వున్న వాళ్ళు కూడా ఎక్కువమంది కాదు. అయినా, నా వెంట వున్న కొద్దిపాటి సైన్యంతో కోట మీదికి వెళ్ళటం ప్రమాదమని మీ రాకకోసం ఎదురుచూస్తూ, ఇక్కడే కాపు వేశాను." అన్నాడు.

"మంచిపని చేశావు. దుస్సాహసం చేసి వున్నట్టయితే స్వల్ప సంఖ్యలో వున్న మీరందరూ సర్వనాశనం అయిపోయే వాళ్ళు. వేచివుండటమే మంచిదయింది," అంటూ చిత్రసేనుడు ఉగ్రాక్షుడి కేసి తిరిగి, "ఉగ్రాక్షా, మనం కోట ద్వారాలను బద్దలుకొట్టి లోపల జొరబడటమొక్కటే మార్గం. అందుకు తగినవాళ్ళు నీ అనుచరులు!" అన్నాడు.

ఉగ్రాక్షుడు ఓసారి చిత్రసేనుడి కేసి, కోట మీద ఎగురుతున్న భయంకర పక్షుల కేసి చూసి, తల గోక్కుంటూ, "నా అనుచరుల్లో కొందరిని కోట తలుపులు బద్దలు కొట్టేందుకూ, మరి కొందర్ని కోట గోడల్ని పునాదులతో సహా తవ్వి పారేసేందుకూ నియోగించగలను. కాని....ఆ భయంకర పక్షులు...." అంటూ గుడ్లు తేలవేశాడు.

"ఉగ్రాక్షా, నువ్వు భయపడకు! అవి మన మీద పడకుండా హడలకొట్టే పని నాది," అన్నాడు అమరపాలుడు.

"అది ఎలా సాధ్యం?" అని అడిగాడు చిత్రసేనుడు ఆశ్చర్యంగా.

"అవ్వాళ ఉదయం వాటి కొట్టాలకు నిప్పు పెట్టినప్పుడు, అవి నిప్పంటే ఎంత కారుకుపోతవో తెలుసుకున్నాను. కనుక, మన సైనికుల్లో ప్రతి పదిమందిలోనూ ఒకడికి, మండుతున్న కాగడాలు ఇస్తే, వాటి రౌతులు చచ్చి గిపెట్టినా అవి మన మీదికి దుమికేందుకు సాహసించవు," అన్నాడు అమరపాలుడు. —(ఇంకావుంది)








## 9

[రాజకుమార్తె కాంతిమతి చిత్రసేనుడితో తన తండ్రి కపిలపురం కోటలో బంధించబడి వున్నాడని చెప్పింది. చిత్రసేనుడు సైన్యాలతో అక్కడికి వెళ్ళేసరికి, బురుజుల మీద సైనికులూ, కోట మీద రెండు భయంకర పక్షులూ కనిపించినై. ఆ భయంకర పక్షులను బెదరగొట్టేందుకు మండుతూన్న కాగడాలు చూపితే చాలు అన్నాడు, అమరపాలుడు. తరవాత—]

అమరపాలుడి మాటల్లో చిత్రసేనుడికి పూర్తి విశ్వాసం కలిగింది. ఆనాటి ఉదయం అతడు స్వయంగా భయంకర పక్షుల కొట్టాలకు నిప్పుపెట్టి, వాటిని సర్వనాశనం చేసి వున్నాడు. కాని, ఉగ్రాక్షుడికి మాత్రం ఆ పక్షులంటే వున్న బెదురు పోలేదు.

''మండుతూన్న కాగడాలు చూపితే, ఆ భయంకర పక్షులు మన మీద దాడి చేయకుండా పారిపోతయ్యా? ఇది నిజమా?'' అన్నాడతడు ఎగిరి గంతేస్తూ.

''ఏయ్, కాగడాలూ!'' అంటూ అమరపాలుడు కేకపెట్టాడు. ఆ వెంటనే నూనె ఓడుతున్న పెద్ద పెద్ద దివిటీలు చేతబట్టుకుని కొందరు సైనికులు ముందుకొచ్చారు.

అమరపాలుడు వాళ్ళను చిత్రసేనుడికి చూపుతూ, ''మహారాజా! మీరు ఆజ్ఞ



ఉగ్రాక్షుడు తన సేవకులను ఆజ్ఞాపించి, చిత్రసేనుడితో, "మహారాజా! మనం ఒక్క ముఖద్వారాన్నుంచే కాక, అన్ని వైపుల నుంచీ కోటలో జొరబడటం మంచిది. కోటలోనూ, బురుజులమీదా వున్న కొద్దిమంది శత్రువులూ అందువల్ల ఒక్కసారైనా మనను ఎదిరించలేరు. ఇక.... ఆ భయంకర పక్షులు మన మీద పడకుండా చూసే బాధ్యత అమరపాలుడిది!" అన్నాడు.

"నువ్వేమీ భయపడకు, ఉగ్రాక్షా! నీ రక్షణభారం నాది," అన్నాడు అమరపాలుడు తన అనుచరులకేసి కన్నుగీటుతూ.

"మానవాధముడివైన నువ్వా, ఈ మహారాక్షసుణ్ణి రక్షించేది?" అంటూ ఉగ్రాక్షుడు పళ్ళు కొరికి, రాతి గదను పైకెత్తబోయాడు.

"ఆగు, ఉగ్రాక్షా!" అన్నది రాజకుమారి కాంతిమతి ఆజ్ఞాపిస్తున్నదానిలా. "మీరూ మీరూ ఇక్కడ దెబ్బలాడి బలాబలాలు తేల్చుకునే లోపల, కోటలో బంధింపబడివున్న నా తండ్రిగారికి శత్రువుల నుంచి అపాయం కలగవొచ్చు. మహారాజా! నాకు సహాయం చేస్తానని మీరు మాట యిచ్చివున్నారు," అన్నది కాంతిమతి చిత్రసేనుడితో.

యిచ్చారంటే, వాటిని వెలిగించి సైనికులు కోటగోడలకేసి నడుస్తారు. వాళ్ళతో కలిసి తతిమ్మా సైన్యం కోటను ముట్టడించవచ్చు." అన్నాడు.

"హేయ్!" అంటూ ఉగ్రాక్షుడు తన రాక్షస బంట్లకేసి చప్పట్లు చరిచాడు.

"హూఁ, మహానాయకా, వచ్చాం, వచ్చాం!" అంటూ రాక్షసులు అన్ని వైపులనించీ ఉగ్రాక్షుణ్ణి చుట్టుముట్టారు.

"మీలో కొందరు మంచి జవ వున్న మానుల్ని పడగొట్టి, వాటితో కోట ద్వారాన్ని ఢీకొట్టి బద్దలు చేయండి. మిగతావాళ్ళు గునపాలు తీసుకుని కోటగోడల్ని పునాదులతో ఎత్తి, అవతల వేయండి," అంటూ







"అవును," అంటూ చిత్రసేనుడు తల వూపి, ఉగ్రాక్షుడితో, "నువ్వు రాక్షస శ్రేష్ఠుడివే, అందులో సందేహం లేదు. నీ ప్రతాపం అమరపాలుడి మీద కాదు చూపించవలసింది. ఆ కోటలో వున్న శత్రువుల మీదా, దాని మీద గస్తీ తిరుగుతున్న భయంకర పక్షుల మీదా," అన్నాడు.

చిత్రసేనుడు ఇలా అనగానే ఉగ్రాక్షుడు ముఖంలో ఎక్కడలేని తెగువా, పౌరుషం కనబరుస్తూ, "ఒరే బంట్లూ, ఊం!" అన్నాడు అడవి మార్మోగేలా. ఆ వెంటనే రాక్షసులు మానుల్లాంటి చెట్ల మీద పడి, వాటిని కూకటివేళ్ళతో పెళ్ళగించి, కొమ్మలూ రెమ్మలూ చేతులతో దూసేసి, పెద్ద పెద్ద బోదెలను భుజాల మీద పెట్టుకొని, రంకెలు వేస్తూ కోట గోడలకేసి పరిగెత్తసాగారు. అదే సమయంలో వారికి వెనకగా, చిత్రసేనుడి సైనికులూ, భగభగ మండుతున్న కాగడాలతో కొందరు భటులూ పరిగెత్తారు.

కనుమూసి తెరిచేంతలో కోట ప్రాంతమంతా రణగొణ ధ్వనులతో దిమ్మెత్తిపోయింది. చిత్రసేనుడూ, అతడికి వెనకగా కాంతిమతీ సైనికులను ఉత్సాహపరుస్తూ తమ తమ అశ్వాలను దూకించారు. ఉగ్రాక్షుడు రాతి గదను గాలిలో వూపుతూ భీకరంగా బొబ్బరిస్తున్నాడు.

కోట గోడలు నూరు గజాలః దూరంలో వున్నవనగా, కోట బురుజుల మీది నుంచి ఒక్కుమ్మడిగా బాణాలు వచ్చి సైనికుల మీదా, రాక్షసుల మీదా పడినై. అదే సమయంలో చిత్రసేనుడి సైనికులలో బాణాలు వదల గలిగినవారు, మోకాళ్ళ మీద వంగి గురి చూసి, బురుజుల మీద వున్న శత్రువుల మీదికి బాణాలు వదిలారు. ఈగందరగోళంలో కొందరు రాక్షసులు కోట ద్వారాలను సమీపించి, తమ భుజాల మీద వున్న చెట్టుబోదెలతో తలుపులను ఢీకొట్టసాగారు. మరికొందరు పెద్ద పెద్ద గునపాలతో కోటగోడలను పొడిచి బండరాళ్లను బదాబదలు చేయసాగారు.



ఉన్నట్టుండి ఆకాశం ఫెళ్ళుమని ఉరిమినట్టయింది. అందరూ నివ్వెరపోయి తేరుకునేలోపల సుడిగాలిలా భయంకర పక్షులు రెండూ మహావేగంతో సైనికుల కేసి రాసాగినై. అమరపాలుడు తన చేతిలో మండుతూన్న కాగడాను పైకెత్తి పక్షుల కేసి ఝుళిపిస్తూ, "భయపడకండి! కాగడాలను వాటి మీదికి గురిచేయండి!" అంటూ హెచ్చరించాడు. మరుక్షణమే కాగడాలు మంటలు కక్కుతూ భయంకర పక్షులకేసి లేచినై.

భయంకర పక్షులు చెవులు చిల్లులు పడేలా వికృతంగా అరిచి, సైనికుల మీదికి దూకబోయేదల్లా తిరిగి ఆకాశంలోకి లేచినై. వాటి మీద వున్న పులిరాయుళ్ళు తమవద్ద వున్న శూలాలతో వాటి మెడల మీద పొడిచి, అవి సైనికుల మీద పడేలా చేసేందుకు ప్రయత్నించారు. కాని, కింద కాగడా మంటలను చూసిన పక్షులు తమ రౌతుల స్వాధీనం తప్పినై. అందులో ఒకటి రౌతు పొడిచిన శూలం పోటుకు రెచ్చిపోయి ఆకాశంలో తలకిందుగా పల్టీ కొట్టింది. పట్టుతప్పిన రౌతు కీచుమంటూ అరిచి, చేతిలో వున్న శూలాన్ని మరింత గట్టిగా గుప్పెట్లో బిగించి పల్టీలు కొడుతూ, అంత ఎత్తు నుంచి సైన్యం మధ్య పడి పోయాడు. సైన్యంలో విజయధ్వానాలు మిన్నుముట్టినై. చూస్తూండగానే భయంకర పక్షులు రెండూ ఆకాశంలో మాయమయినై.

భయంకర పక్షుల సహాయాన్ని నమ్ముకుని, అంతవరకూ గుండె దిటవుతో కోట బురుజుల మీద నిలబడిన నాగవర్మ సైనికులు, ఒక రౌతు చావటం, పక్షులు పలాయనం కావటం చూస్తూనే, భయకంపితులై కోట బురుజుల మీద నుంచి దూకి రాజప్రాసాదం కేసి పరిగెత్తసాగారు. పైనుంచి బాణవర్షం ఆగటంతో చిత్రసేనుడి సైనికులంతా కోట గోడల్ని చేరి కోణాల మీద తలుపులను బద్దలుకొట్టారు. ఈ లోపల గునపాలతో గోడలు బద్దలు




కొడుతున్న రాక్షసులు గోడలో ఒకచోట పెద్ద కన్నం చేసి లోపలికి జొరబడ్డారు.

ఆ తరవాత పెద్ద పోరాటం లేకుండానే, రాజప్రాసాదం చిత్రసేనుడి హస్తగతం అయింది. మొండిగా ఎదిరించ పూనుకున్న కొద్దిమంది నాగవర్మ సైనికులను రాక్షసులు రాతి గదలతో దూది కింద ఏకేశారు.

కోటా, అందులోని పెద్ద రాజప్రాసాదం చిత్రసేనుడి వశమైనా, రాజు వీరసింహుడు ఎక్కడ బంధించబడి వున్నదీ తెలియ లేదు. అతణ్ణి ఒకవేళ శత్రువులు రహస్యంగా కోట బయటికి తీసుకుపొయ్యారా అన్న అనుమానం కూడా అతడికి కలిగింది. రాజకుమారి కాంతిమతి మాత్రం తన తండ్రి రాజప్రాసాదంలోని ఏ చీకటి కొట్టులోనో బంధించబడి వుంటాడనీ, సైనికులు జట్లు జట్లుగా వెళ్ళి అన్ని గదులూ, భూగృహాలూ వెదకటం మంచిదనీ చెప్పింది.

ఆ ప్రకారం సైనికులూ, రాక్షసులూ కలిసి రాజప్రాసాదమంతా గాలించసాగారు. చీకటీ, నిశ్శబ్దం గూడు కట్టుకున్నట్టున్న భూగృహాల్లోని ఒకానొక గదినుంచి హఠాత్తుగా మూలుగు వినిపించింది. సైనికులు తమ చేతగల దివిటీల వెలుగులో అక్కడికి వెళ్ళి చూశారు. గది అంతా చీకటి మయంగా వుంది. లోపల ప్రవేశించేందుకు వీలు లేకుండా, బయట ఇనప చువ్వల ద్వారం తాళం వేసి వున్నది. చువ్వలలోకుండా దివిటీలను లోపలికి పోనిచ్చి చూసినప్పుడు ఆ గుడ్డి వెలుగులో ఎక్కడో దూరంగా గోడనానుకుని ఒక మానవాకారం వున్నట్టు సూచనప్రాయంగా కనిపించింది.

''ఈయనే మహారాజు వీరసింహులు!'' అంటూ ఒక సైనికుడు కేక వేశాడు. ఆ వెంటనే ప్రాసాదం అన్ని మూలల నుంచి సైనికులూ, రాక్షసులూ గుంపులు గుంపులుగా అక్కడికి వచ్చారు. కాని గది లోపలికి ప్రవేశించేందుకు మాత్రం ఎవరి







వల్లా కాలేదు. ముందు గదికి వున్న ఇనప చువ్వల తలుపుల తాళాన్ని బద్దలు కొట్టాలి.

సైనికుల కోలాహలం వింటూనే చిత్రసేనుడూ, కాంతిమతీ అక్కడికి వచ్చారు. వాళ్ళకూ దివిటీల వెలుగులో గదిలో ఎవరో వ్యక్తి వున్నట్టు కనబడింది. చిన్నగా మూలుగు కూడా వినబడింది.

''మీరంతా ఇక్కడ ఏం చేస్తున్నారు? ముందు తాళం బద్దలుకొట్టండి,'' అని ఆజ్ఞాపించాడు చిత్రసేనుడు.

సైనికులు గునపాలు తీసుకుని తాళం బద్దలుకొట్టేందుకు ప్రయత్నించారు. కాని పెద్ద కొబ్బరికాయ ప్రమాణంలో తుప్పు పట్టివున్న ఆ తాళం వాళ్ళ దెబ్బలకు ఖంగు ఖంగుమని ప్రతిధ్వనించింది తప్ప, బెసకలేదు. ''తాళం తుప్పుపట్టి వున్నది. మహారాజా, చెవి వుంటే బావుణ్ణు!'' అన్నాడొక సైనికుడు ఆయాసపడుతూ.

''ఆ తాళంచెవికోసం నువ్వు ద్రోహి నాగవర్మను ఆశ్రయిస్తావా?'' అంటూ చిత్రసేనుడు ఆ సైనికుడి చేతి నుంచి గునపం తీసుకోబోయేంతలో, భూమి దద్దరిల్లే లాగా పెడబొబ్బలు పెడుతూ ఉగ్రాక్షుడు అక్కడికి వచ్చాడు. అతణ్ణి చూస్తూనే కాంతిమతి, ''ఉగ్రాక్షా! నా తండ్రిగారిని శత్రువులు ఈ చీకటి కొట్లో బంధించి వెళ్లారు. నువ్వు తక్షణం తాళం పగలకొట్టి సహాయపడాలి,'' అన్నది.

''ఓఁ అదెంత పని,'' అంటూ ఉగ్రాక్షుడు తాళాన్ని గుప్పెటతో బిగించి పట్టి గట్టిగా గుంజాడు. అది వూడి రాలేదు. ఈసారి రెండు చేతులతోనూ పట్టి బలంగా లాగాడు. తలుపు చువ్వలు కిరకిరమన్నవి గాని, తాళం అలాగే వుండిపోయింది.

''ఈ నాగవర్మా వాడి భటులూ వింత మనుషుల్లా వున్నారు. తలుపులకంటే తాళం గట్టిది వేసినట్టున్నది!'' అంటూ ఉగ్రాక్షుడు రెండు చేతులతోనూ ఇనప చువ్వల్ని పట్టుకుని బలంగా గుంజేసరికి; అవి మైనపువత్తుల్లా పక్కలకు వంగి

పోయినై. అక్కడ ఏర్పడ్డ ఖాళీలోంచి దివిటీలు పట్టుకున్న సైనికులు దూరి గది లోపలికి వెళ్ళారు. చూస్తూండగానే దివిటీల వెలుగులో గది గోడలో బిగించి వున్న ఇనప కమ్మీలకు గొలుసులతో కాళ్ళూ చేతులూ బంధించి వున్న వీరసింహుడు కనిపించాడు. అతడి నోటికి అడ్డంగా ఒక వస్త్రం చుట్టబడి వున్నది. అతడు బాధతో మూలుగుతున్నాడు.

తన తండ్రిని ఆ కష్టస్థితిలో చూస్తూనే కాంతిమతి నిలువెల్లా కంపించిపోయి, ''నాన్నా!'' అంటూ కేకపెట్టి అతడి దగ్గిరకు పరిగెత్తింది. చిత్రసేనుడు కూడా ఆమె వెంట గదిలో ప్రవేశించి, వీరసింహుడి నోటికి కట్టివున్న వస్త్రాన్ని విప్పేశాడు. ఈలోపల ఉగ్రాక్షుడు అతడి చేతులకూ, కాళ్ళకూ బిగించి వున్న గొలుసులను తెంచేశాడు.

''తల్లీ, నిన్ను తిరిగి ఈ జన్మలో చూస్తాననుకోలేదు.'' అంటూ వీరసింహుడు నీరసంగా గోడకు చేరగిలబడ్డాడు. ఇంతలో ఒక సైనికుడు మహారాజు కూర్చునేందుకు ఒక ఆసనం తెచ్చాడు. మరొక సైనికుడు దాహం తీర్చుకునేందుకు నీటిపాత్ర అందించాడు.

వీరసింహుడు దాహం తీర్చుకుని సేదదేరి, ఆసనం మీద కూర్చుంటూ కాంతిమతితో, ''అమ్మా, ఆ ద్రోహి నాగవర్మ చచ్చాడా, లేక బందీగా చిక్కాడా?'' అని అడిగాడు.

కాంతిమతి జవాబు చెప్పబోయి తటపటాయించి చిత్రసేనుడికేసి చూసింది. చిత్రసేనుడు ముందుకు వచ్చి, ''మహారాజా! నా పేరు .చిత్రసేనుడు. నన్ను గురించి, నా రాజ్యం గురించి వినే వుంటారు. ఈ రాక్షసుడి పేరు ఉగ్రాక్షుడు. నా సేవకుడు. నాగవర్మ నా తండ్రిగారిదైన ధవళగిరి రాజ్యం మీదికి దాడి వెళ్ళాడు. అతణ్ణి సాధ్యమైతే దారిలోనే అడ్డగించి హతమార్చేందుకు సైన్యంతో నా సేనానాయకుణ్ణి పంపాను.'' అని చెప్పాడు. —(ఇంకా వుంది)





# జ్వాలాద్వీపం

## 10

[చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ తమ అనుచరులతో కపిలపురం కోటను వశపరుచుకుని, చీకటి కొట్లో బంధించబడి వున్న కపిలపురం రాజు వీరసింహుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశారు. ద్రోహి నాగవర్మ ఎక్కడ? అని వీరసింహుడు తన కుమార్తె కాంతిమతిని ప్రశ్నించాడు. అతణ్ణి పట్టుకునేందుకు తన సేనానాయకుణ్ణి పంపినట్టు చిత్రసేనుడు ఆయనతో చెప్పాడు. తరవాత—]

చిత్రసేనుడి మాటలు వింటూనే వీరసింహుడు చాలా ఆశ్చర్యపడ్డాడు. అతడు ఉగ్రాక్షుడికేసి ఓమారు చూసి, చిత్రసేనుడికేసి తల తిప్పుతూ, ''ఈ ఉగ్రాక్షుడికి నీకూ వున్న సంబంధం యజమాని సేవకుల మధ్య వుండే సంబంధం లాటిదని నేను వినలేదు. నాకు వచ్చిన వర్తమానం మరొకటి. అందువల్లనే, నాగవర్మ ద్రోహం చేయనున్నాడని ముందుగా తెలిసికూడా, పొరుగురాజువైన నీ సహాయం కోరలేకపోయాను,'' అన్నాడు.

''అవును మహారాజా! ఉగ్రాక్షుడు మాట్లాడే ధోరణి కొన్ని అపోహలకు కారణం అయింది. మీ కుమార్తె కూడా అలాంటి అపోహకే గురి అయింది,'' అన్నాడు చిత్రసేనుడు.

అతడి మాటలకు కాంతిమతి చిరునవ్వు నవ్వింది. ఉగ్రాక్షుడిలో ఏమాత్రం



చలనంలేదు. అతడు స్థాణువులా వీర సింహుడికేసి చూస్తూ అలాగే వుండి పోయాడు. వీరసింహుడు ఓ క్షణకాలం ఏదో ఆలోచిస్తున్నవాడిలా వూరుకుని, తరవాత ఉగ్రాక్షుడితో, "చిత్రసేనుడు చెప్పినదాంట్లో అబద్ధం ఏమీ లేదుకదా, ఉగ్రాక్షా?" అన్నాడు.

"చిత్రసేన మహారాజు చెప్పినదంతా నిజం. ఆయన వివాహం ఆడి, ఎప్పుడు మహారాణిని తెచ్చుతుంటాడా అని నేను ఎదురుచూస్తున్నాను," అన్నాడు ఉగ్రాక్షుడు.

వీరసింహుడు సిగ్గుతో తలవంచుకున్న తన కుమార్తెతో ఏమో అనబోయేంతలో ఇద్దరు సైనికులు రొప్పుతూ అక్కడికి పరిగెత్తుకు వచ్చి, "మహారాజా! నాగవర్మ పెద్ద సైన్యంతో మన కోటను సమీపిస్తున్నాడు," అని చెప్పారు.

నాగవర్మ పేరు వింటూనే వీరసింహుడు ఉలిక్కిపడ్డాడు. చిత్రసేనుడికి కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. అతడికి ఆ క్షణంలో అనేక అనుమానాలు కలిగినై. నాగవర్మ ధవళగిరిని జయించి తిరిగి యిక్కడికి వస్తున్నాడా? అలా కాక అక్కడ జరిగిన యుద్ధంలో ఓడిపోయి యిక్కడికి పారిపోయి రావటం జరిగితే తను సైన్యాలతో పంపిన తన సేనానాయకుడు ఎక్కడ వున్నట్టు? ఏది ఏమైనా తను వెంటనే కోటరక్షణకు పూనుకోవటం అవసరం!

"ఉగ్రాక్షా! నువ్వు నీ సేవకులతో కోట ద్వారాలను కాపాడు. బురుజులమీద రక్షణకు కొంతమంది విలుకాళ్ళను వుంచటం మంచిది. అమరపాలుడెక్కడ?" అన్నాడు చిత్రసేనుడు.

"ఆయన స్వయంగా శత్రుసైన్యాల బలం ఏపాటో చూసేందుకు అడవిలోకి వెళ్ళాడు," అని సైనికులు జవాబు చెప్పారు.

"ఉగ్రాక్షా, యిక నువ్వు నీ సేవకులతో కోట ద్వారాలను...." అని చిత్రసేనుడు



చెప్పబోయేంతలో, ఉగ్రాక్షుడు బిగ్గరగా నవ్వి, ''మహారాజా! ఇంక కోటకు ద్వారాలూ, బురుజులూ ఎక్కడ వున్నవి? ఇప్పుడు కోటగోడల్లో ఎక్కడ చూసినా ద్వారాలే. నా సేవకులు గునపాలతో గోడ అంతా కన్నాలు వేశారు. కొన్నిచోట్ల గోడను పునాదులతో కూడా ఎత్తివేశారు. ఇక బురుజులంటారా? అవన్నీ రాళ్ళూ రప్పలుగా కింద భూమిపైద చెల్లాచెదురై వున్నవి. మనం కోటను వశపరుచుకునేందుకు చేసిన బీభత్సం మీరు గమనించినట్టు లేదు,'' అన్నాడు.

''అలాగా,'' అంటూ చిత్రసేనుడు ఆశ్చర్యపోయాడు. ''మనం చిక్కులో పడ్డాం. శత్రువులు మనను అన్ని వైపుల నుంచీ ఎదుర్కోవచ్చు. నాగవర్మ యింత త్వరలో ధవళగిరి వద్ద విజయం సంపాయించి యిక్కడికి తిరిగి వస్తాడని నేను వూహించలేదు,'' అన్నాడు.

అంతలో అమరపాలుడు అక్కడికి పరిగెత్తుకుని వస్తూ, ''ఆ ద్రోహి విజయుడై యిక్కడికి రావటంలేదు మహారాజా, పారిపోయి వస్తున్నాడు. అతడి వెంట వున్న సైన్యం కూడా ఏమంత పెద్దది కాదు. ఆ సైన్యాన్ని వెన్నాడివస్తూ, దూరంగా కొండల్లో మరొక సైన్యం కనిపించింది. ఆ సైన్యం బహుశా మీ తండ్రిగారిది గానీ, లేక మీరు సహాయం పంపిన మనసేన గానీ అయివుంటుంది,'' అన్నాడు.

అమరపాలుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు భవనం ప్రతిధ్వనించేలా నవ్వాడు. చిత్రసేనుడికి ఎక్కడ లేని ఆనందం కలిగింది. అతడు అమరపాలుడితో, ''అమరపాలా, నువ్వు సైనికులందర్నీ ఒక చోట చేర్చి, నాకోసం వేచి వుండు. ఆ ద్రోహిని కోటముందు మైదానంలోనే సర్వనాశనం చేద్దాం,'' అన్నాడు.

''నాకొక మంచి యోచన కలిగింది, మహారాజా! మీరు అనుమతించితే చెపుతాను,'' అన్నాడు ఉగ్రాక్షుడు.



''త్వరగా చెప్పు. ఏమిటది?'' అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.

''నాగవర్మను తన అనుచరులతో కోటలోకి అడుగు పెట్టనివ్వటం మంచిది. ఆ తరవాత అతణ్ణి చుట్టుముట్టి, ఒక్కగా నొక్క శత్రువైనా పారిపోకుండా మట్టు పెట్టవచ్చు.'' అన్నాడు ఉగ్రాక్షుడు ఎంతో ఉత్సాహంగా.

''ఇది మంచి ఉపాయమే మహారాజా! వెనక నుంచి తనను సైన్యాలు తరుము తున్నవని ఆ ద్రోహికి తెలియంది కాదు. ఈ కోట తనకు రక్షణ యివ్వగలదని అతడు యిక్కడికి పారిపోయి వస్తున్నాడు. ఇది మన అధీనంలో వుందని అతడు గ్రహించినప్పుడు, మనకు దొరక్కుండా మరెటువైపుకైనా పారిపోవచ్చు.'' అన్నాడు అమరపాలుడు.

''అదీ నిజమే!'' అంటూ చిత్రసేనుడు ఓ క్షణకాలం ఆలోచిస్తూ వూరుకుని, తరవాత ఉగ్రాక్షుడికేసి తిరిగి, ''ఒకసారి ఆ శత్రుసైనికుల్ని కోట ఆవరణలోకి ప్రవేశించనిస్తే, వాళ్ళలో కొందరైనా రాజ ప్రాసాదంలోకి జొరబడే ప్రమాదం కలగ వచ్చుగదా?'' అని అడిగాడు.

''అలాంటి చిక్కు రాకుండా చూసే బాధ్యత నాది, మహారాజా! నా రాక్షస బంట్ల బలం మీకు సొంతం తెలీదు. ఆ నాగవర్మను ఎలాగైనా చేజిక్కించుకుని బలి పెడితే తప్ప లేకపోతే, ఈ ప్రాంతా లకు శాంతి వుండదు. వాడు మనకు దొరక్కుండా పారిపోయాడో, వాడు ఎప్పటికి మనకు పక్కలో బల్లెమే!'' అన్నాడు ఉగ్రాక్షుడు.

''బాగా చెప్పావు ఉగ్రాక్షా!'' అంటూ వీరసింహుడు అతణ్ణి మెచ్చుకుని, చుట్టూ వున్న సైనికులతో, ''మీలో ఎవరైనా సరే, ఆ ద్రోహి నాగవర్మను ప్రాణాలతో పట్టి నాకు ఒప్పచెపితే అర్ధరాజ్యం యిస్తాను. తల తెచ్చినవాడికి తక్షణమే వెయ్యి బంగారు కాసులు యిస్తాను.'' అన్నాడు ఉద్రేకంగా.



"అర్ధరాజ్యమా?" అంటూ రాజకుమారి శాంతిమతి ఆశ్చర్యపోయి, తన తండ్రికేసి చూసింది.

"అవును, అర్ధరాజ్యమే! ఆ ద్రోహి నన్ను అసమర్థుణ్ణి చేసి యింతకాలంగా రాజ్యాన్ని అల్లకల్లోలపరచటమే గాక, నన్ను ఈ చీకటికొట్లో బంధించి నానా హింసలపాలూ చేశాడు." అన్నాడు వీరసింహుడు.

"అయితే, కోటలో పురుగు వున్నట్టు కూడా ఆ నాగవర్మకు తెలియకూడదు. సైనికులందర్నీ వారివారి స్థానాల్లో దాచి వుంచి, వాడు సైన్యంతో కోటలో ప్రవేశించ గానే ఒక్కుమ్మడిగా మీద పడి అందర్నీ యమపురికి ప్రయాణం కట్టించాలి." అన్నాడు చిత్రసేనుడు.

"అవును మహారాజా! ఆ పని నాకూ, అమరపాలుడికీ వదలండి. మీరూ, వీరసింహ మహారాజుగారూ, రాజకుమారీ భవనం మీద ఎక్కడైనా వుండి, మా ప్రతాపం తిలకించండి." అంటూ ఉగ్రాక్షుడు, తన సేవకులకేసి తిరిగి, "ఒరే, బంట్లూ, ఎక్కడ?" అని హుంకరించాడు.

అమరపాలుడీ, ఉగ్రాక్షుడీ నాయకత్వంలో సైనికులూ, రాక్షసులూ కోట లోపలి భవనాల వెనకా, చెట్లచాటునా దాగివుండే ప్రయత్నాలు చేస్తూండగా, కోట సమీపంలోని అడవిని చేరిన నాగవర్మ, గుర్రం మీద లేచి నిలబడి కోట బురుజుల కేసి చూస్తూ, "కరవీరా! మనం ఊహించిందే నిజమయింది. శత్రువులు కోట మీద పడి నానా బీభత్సం చేసి ఎటో వెళ్ళిపోయారు." అంటున్నాడు.

ఈ కరవీరుడనేవాడు జ్వాలాద్వీపం నుంచివచ్చిన పులిరాయుళ్ళ నాయకుడు. నాగవర్మ వెంట కొందరు అనుచరులతో ధవళగిరి మీదికి దాడి వెళ్ళి, అక్కడ చిత్రసేనుడి తండ్రి అయిన తారకేశ్వర మహారాజువల్ల చావుదెబ్బలు తిని, కపిలపురం కోటకు పారిపోయివస్తున్నాడు.



''అవును, మహారాజా! మీరు చెప్పింది నిజం. శత్రువులు కోటలో వున్న మన భటులను ఓడించి, దాన్ని ఆక్రమించు కున్నట్టు తెలుస్తూనే వున్నది. కాని, ఇప్పుడు ఎక్కడా ఒక్క శత్రుసైనికుడైనా వున్నట్టు లేదు. కోటలో వున్నదంతా దోచుకుని వాళ్ళు తిరిగి చిత్రసేనుడి రాజధానికి వెళ్ళివుంటారు. నాకు కలిగే ఆశ్చర్యం అల్లా, నా అనుచరులూ, ఆ రెండు భయంకర పక్షులూ ఏమయాయని!'' అన్నాడు కరవీరుడు.

''నేను పడే ఆశ్చర్యం అదికాదు; కోటలోని చీకటి గదిలో బంధించబడిన ముసలి రాజు వీరసింహుడు ప్రాణాలతో శత్రువులకు చిక్కాడేమో అని. అలా జరిగితే మనకు ముందుముందు ప్రమాదం కూడా. ఏది ఏమైనా మనం కోటలో ప్రవేశించి తారకేశ్వరుడి సైన్యాలు వచ్చేలోపల రక్షణలను బలపరుచుకోవటం క్షేమం. కోట గోడల్ని రక్షణగా పెట్టుకుని మనం శత్రువులను ఎంతకాలం అయినా ఎదిరించి నిలబడవచ్చు.'' అన్నాడు నాగవర్మ.

ఆ తరవాత నాగవర్మా, కరవీరుడూ తమ తమ అనుచరులకు హెచ్చరికలు చేశారు. ''మనను వెనకనుంచి శత్రువులు తరుముకు వస్తున్నారు. అసంఖ్యాకులైన వాళ్ళ చేతుల్లో పడి చావకుండా తప్పించుకోవాలంటే, మనకు కపిలపురం కోట ఒక్కటే రక్షణ యివ్వగలదు. ఊc, కదలండి!'' అంటూ నాగవర్మ కేకలు పెట్టాడు.

నాగవర్మా, కరవీరుడూ గుర్రాలమీద ముందు బయలుదేరారు. వారికి వెనకగా కాల్బటులూ, వాళ్ళ వెనక మరికొందరు గుర్రపు రౌతులూ కదిలారు. ఓ పావుగంట గడిచేసరికి అందరూ కోటగోడల ముందున్న మైదానం చేరారు. నాగవర్మా, కరవీరుడూ సైన్యాలను ఆగమని హెచ్చరించి, కూలిపోయిన కోట ముఖద్వారాల దగ్గిరకు వెళ్ళి లోపలికి తొంగిచూశారు. లోపల

అంతా నిశ్శబ్దం. చీమ చిటుక్కుమన్నా వినబడేంత నిశ్శబ్దం.

"ఇందులో ఏమయినా మోసం లేదు గదా?" అన్నాడు నాగవర్మ కాస్త అనుమానంగా.

"మోసం ఏముంటుంది? కోటలో వున్న నగానట్రా దోచుకుని శత్రువులు వాళ్ళదారిన వాళ్ళు వెళ్ళారు. వాళ్ళకు కావలసిన ముసలిరాజు వీరసింహుడు కూడా వాళ్ళకు దొరికి వుంటాడు," అన్నాడు కరవీరుడు.

"మన సైనికుల్లో కొందరైనా యుద్ధంలో చచ్చివుంటారు గదా? కాని ఒక్కడి శవం కూడా కనిపించటం లేదు. శవాలు కూడా ఎలా మాయమయినై? ఉగ్రాక్షుడు తన రాక్షస బంట్లను తేలేదుగదా?" అన్నాడు నాగవర్మ.

నాగవర్మ ఇలా అనేసరికి పులిరాయుళ్ళ నాయకుడు కరవీరుడికి గుండె బలం జారింది. వాడికి ఉగ్రాక్షుడి రాక్షసులంటే ఎక్కడ లేని భయం.

"మహారాజా, ఎందుకైనా మంచిది, ఒక పని చేద్దాం," అన్నాడు వాడు, గుర్రాన్ని ముందుకు నడిపి, రహస్యం చెప్పేవాడిలా నాగవర్మకేసి మెడవంచి.

"ఏమిటది?" అని అడిగాడు నాగవర్మ.

"కోట ఇంత నిర్జనంగా, నిశ్శబ్దంగా వుండటం నాకు ఆశ్చర్యమే కాక అనుమానం కూడా కలిగిస్తున్నది. ఆ రాక్షసులూ, వాళ్ళ నాయకుడూ మనకోసం ఏదైనా మాటు వేశారేమోనని నా భయం. అట్లని మనకు రక్షణ యిచ్చే ఈ కోటను ఆక్రమించుకోకుండా వదిలిపోవటం ప్రమాదకరం. మనను వెన్నంటి వచ్చే తారకేశ్వరుడి సైన్యాలు మనను ఈ అడవిలో మృగాలను వేటాడినట్టు వేటాడగలవు. కనుక, మనం కోటలో ముందు ప్రవేశించకుండా, మన సైనికులను ముందు ప్రవేశపెట్టి, ఏమి జరుగుతుందో చూసి, ప్రమాదం లేకపోతే, వెనగ్గా మనం కోటలో జొరబడవచ్చు," అన్నాడు కరవీరుడు. —(ఇంకావుంది)



# జ్వాలాద్వీపం

## 11

[ద్రోహి నాగవర్మ సైన్యంతో కోటను సమీపిస్తున్నాడని తెలియగానే చిత్రసేనుడు తన సైనికులను కోటలో దాగి వుండవలసిందిగా ఆజ్ఞాపించాడు. నాగవర్మకు, అతడి వెంట వున్న కరవీరు డనే జ్వాలాద్వీపపు పులిరాయుళ్ళ నాయకుడు, తమ భటులను ముందుగా కోటలో ప్రవేశపెట్టి, ఏమి జరుగుతుందో చూడటం మంచిదని సలహా యిచ్చాడు. తరవాత—]

కరవీరుడిచ్చిన సలహా, నాగవర్మకు చాలా బావుందనిపించింది. అందుకు కారణం, అతడికూడా కోటలో ముందుగా ప్రవేశించటానికి భయంగా వుండటమే. నాగవర్మ కూలిపోయిన కోట ద్వారంకేసి ఓమారు పరీక్షగా చూసి, తరవాత కరవీరుడికేసి తలతిప్పి, ''భలే ఆలోచన. అలాగే చేద్దాం!'' అంటూ తన గుర్రాన్ని గిరుక్కున వెనక్కు మళ్ళించి, సైనికులతో, ''హేయ్, మీరంతా నిర్భయంగా కోటలో ప్రవేశించవచ్చు. యుద్ధం లేకుండానే మనం కోట ఆక్రమించుకోగలగటం, గొప్ప శుభ సూచన. న్యాయం, ధర్మం మన పక్షాన వున్నది గనకే, దేవుడు మనకిలాంటి అవకాశం కల్పించాడు.'' అని గొంతెత్తి అరిచాడు.

ఆ వెంటనే సైనికులు గుంపులు గుంపులుగా పడిపోయిన కోట ద్వారాల







గుండా లోపల ప్రవేశించసాగారు. నాగవర్మా, కరవీరుడూ గుర్రాలమీద వుండి కత్తి ఝళిపిస్తూ, "ఊఁ, త్వరగా పదండి. కోట గోడలో పడిన కన్నాలనూ, బురుజుల్నీ బాగుచేసి మనం యుద్ధ సన్నద్ధులం కావాలి. త్వరలోనే తారకేశ్వరుడి సైన్యం మనను ముట్టడించవచ్చు," అని హెచ్చరికలు చేశారు.

సైన్యమంతా కోటలో ప్రవేశించింది. నాగవర్మా, కరవీరుడూ ఓ క్షణకాలం లోపలినుంచి ఏదైనా రణగొణధ్వని వినబడుతుందేమో అని చూసి, అలాంటిదేమీ లేకపోవటంతో, ధైర్యం తెచ్చుకున్నారు.

"మనం అనవసరంగా భయపడ్డాం. కోటలో శత్రువు లెవరూ లేరు. ఇక మనం కోట రక్షణాలు బలపరుచుకునే ప్రయత్నాలు చేద్దాం," అన్నాడు నాగవర్మ.

కరవీరుడు అవునన్నట్టు తల వూపాడు. ఆ వెంటనే యిద్దరూ కూలిపోయిన కోట ద్వారాలనుంచి గుర్రాలను నడిపించారు. వాళ్ళా విధంగా ద్వారాలు దాటి రెండు మూడు గజాలు లోపలికి వెళ్ళారో లేదో, హఠాత్తుగా సైన్యంలో సంక్షోభం పుట్టింది. "రాక్షసులు! రాక్షసులు!" అని గుండె లవిసేలా కేకలు పెడుతూ, కొందరు సైనికులు బయటికి పారిపోయేందుకు పరిగెత్తుకు వస్తున్నారు.

"మోసం, మహారాజా, మోసం! మనం నిలబడి వాళ్ళతో యుద్ధం చెయ్యలేం. ప్రాణాలుంటే మరోసారి, వాళ్ళను మట్టుపెట్టవచ్చు. గుర్రాన్ని వెనక్కు తిప్పండి!" అంటూ కరవీరుడు తన గుర్రాన్ని గిరుక్కున వెనుదిప్పాడు.

"హాఁ ద్రోహం, పిరికిపందలు!" అంటూ నాగవర్మ కూడా గుర్రాన్ని వెనక్కు తిప్పి కోటముందున్న మైదానం కేసి దాన్ని పరిగెత్తించాడు.

"ద్రోహి నాగవర్మ పారిపోతున్నాడు! వాడు అడవి చేరే లోపలే పట్టుకోండి!" అన్న చిత్రసేనుడి కేకలు నాగవర్మకు




వినిపించినై. ఆ వెంటనే రాక్షసుల అట్టహాసాలతో పాటు, కొన్ని రాతి గదలు రివ్వు రివ్వుమంటూ నాగవర్మ, కరవీరులు ఎక్కిన గుర్రాల పక్కగా దూసుకుపో సాగినై.

"రాక్షసులు మనను ఎలాగూ ప్రాణాలతో పట్టుకోలేమని తెలుసుకుని, చంపేందుకు మనమీదికి రాతి గదలు విసురుతున్నారు, మహారాజా! మనం తొందరగా అడవిని చేరటం మంచిది." అన్నాడు కరవీరుడు భయంతో వణికిపోతూ.

"ఎంత ద్రోహం, ఎంత ద్రోహం!" అంటూ నాగవర్మ పిచ్చివాడిలా కేకలు పెడుతూ, గుర్రాన్ని మరింత వేగంగా అడవికేసి పరిగెత్తించాడు. అంతలో ఉగ్రాక్షుడు విసిరిన రాతి గద ఒకటి, పక్కనే పరిగెత్తి వస్తున్న కరవీరుడి గుర్రాన్ని బలంగా తాకింది. గుర్రం పెద్దగా సకిలించి దభీమంటూ ముందుకు పడింది. పైనున్న కరవీరుడు కళ్ళెంపట్టు తప్పి, కీచుమని అరిచి, చేతులు అల్లల్లాడిస్తూ, బంతిలా గాలిలోకి ఎగిరాడు.

కరవీరుడు పెట్టిన కేక వింటూనే నాగవర్మ గుర్రాన్ని ఆపి, వెనక్కు తిరిగి చూశాడు. ఉగ్రాక్షుడి రాతి గద దెబ్బకు వెనకకాళ్ళు రెండూ విరగటంతో లేవలేక, కరవీరుడెక్కిన గుర్రం విలవిల తన్నుకుంటూ, నేలమీద అటూ యిటూ దొర్లుతున్నది. అల్లంత దూరంలో చెట్ల పొదలలో పడిన కరవీరుడు, అంతలోనే విల్లంబులా లేచి నిలబడి, "మహారాజా, మహారాజా!" అని అరుస్తూ నాగవర్మ కేసి పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"మనం యిక్కడ ఏమాత్రం జాగు చేసినా ప్రమాదకరం. మన సైన్యమంతా కోటలోనే నాశనం అయినట్టున్నది. చావగా మిగిలిన కొద్దిమంది మాత్రం మనకేసి పరిగెత్తి వస్తున్నారు." అన్నాడు నాగవర్మ కోటకేసి చూస్తూ.

కరవీరుడు కూడా తల తిప్పి అటుకేసి చూశాడు. కొందరు సైనికులు గగ్గోలుగా



అరుస్తూ అడవికేసి పరిగెత్తుకు వస్తున్నారు. వాళ్ళను వెన్నంటి కొందరు రాకసులూ, చిత్రసేనుడి సైనికులూ రావటం కూడా అతనికి కనిపించింది.

''కరవీరా! మనం శత్రువుల నుంచి తప్పించుకు పోగలమా! నువ్వు గుర్రాన్ని కూడా పోగొట్టుకున్నావు.'' అన్నాడు నాగవర్మ.

''మనం గుర్రాల మీద ఎక్కి పారిపోలేం మహారాజా! శత్రువులు ముఖ్యంగా మనను పట్టుకునేందుకే యింత ఎత్తుగడ వేశారు. కనుక, మనం వాళ్ళ దృష్టిని మరొకవైపుకు మరల్చాలి. ఇదుగో, ఈ వస్తున్న మన భటు లిద్దర్నీ గుర్రం మీద ఎక్కించి, అడవిలో వాళ్ళ యిష్టం వచ్చిన వైపుకు పారిపొమ్మనమనండి. శత్రువులు వాళ్ళను చూసి తప్పక మనం అని పొరబడి వెంటబడతారు. ఆ సందులో మనం మరో వైపుగా పారిపోవచ్చు.'' అన్నాడు కరవీరుడు.

కరవీరుడు చెప్పిన ఉపాయం నాగవర్మకు దివ్యంగా కనబడింది. అతడు వెంటనే గుర్రం దిగి, సమీపానికి వచ్చిన తన భటు లిద్దర్ని గుర్రం మీద ఎక్కమని ఆజ్ఞాపించి, వాళ్ళ తలల మీద కరవీరుడి శిరస్త్రాణం, తన శిరస్త్రాణం పెట్టి, ''ఒరే, మీరు వెనక్కు తిరిగి చూడకుండా పారిపొండి. అరుగో, రాకసులూ, చిత్రసేనుడి సైనికులూ వస్తున్నారు.'' అంటూ గుర్రాన్ని కత్తి ఒరతో గట్టిగా మోదాడు.

గుర్రం దెబ్బ తింటూనే పెద్దగా సకిలించి, అడవి చెట్ల కిందగా పారిపోసాగింది. నాగవర్మ పెద్దగా నవ్వి, కరవీరుడితో, ''కరవీరా! ఇక మనం పారిపోవలసిన దిక్కు ఏది?'' అని అడిగాడు.

కరవీరుడు గుంపులు గుంపులుగా అడవికేసి వస్తున్న చిత్రసేనుడి సైనికులకేసి చూశాడు. సైనికుల్లో కొందరు నాగవర్మ భటు లెక్కి పారిపోతున్న గుర్రాన్ని చూసి, ''అరుగో, నాగవర్మా, వాడి మిత్రుడు కరవీరుడూ గుర్రం మీద పారిపోతున్నారు.



పట్టుకోండి!'' అంటూ గట్టిగా కేకలు పెట్టారు.

ఆ కేకలు వింటూనే కరవీరుడు చిరునవ్వునవ్వి, ''మన ఎత్తు పారింది. మహారాజా! మనం యిటు పడమటి దిక్కుగా పారిపోవచ్చు.'' అన్నాడు.

ఆ వెంటనే నాగవర్మా, కరవీరుడూ పొదలచాటున నక్కుతూ, చిత్రసేనుడి సైనికుల కంటబడకుండా క్రమక్రమంగా కీకారణ్యంలోకి పారిపోయారు.

చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ కోట ద్వారం దగ్గిర నిలబడి తమ సైనికులు పట్టి తెచ్చిన శత్రుభటులను, వాళ్ళ నాయకుడెక్కడ అని ప్రశ్నించసాగారు. శత్రుసైనికు లెవరికీ నాగవర్మా, కరవీరులు వేసిన ఎత్తుగడ సంగతిగాని, క్షేమంగా వాళ్ళు అడవిలోకి పారిపోయిన విషయం గాని తెలీదు. గుర్రాన్ని ఎక్కి పారిపోయే శత్రుభటులను చూసి నాగవర్మా, కరవీరుడూ అని భ్రమపడి వెంటబడిన సైనికులు కొంతసేపటికి తిరిగి వచ్చి, అడవిలో వాళ్ళెక్కడో మాయమయారని చిత్రసేనుడితో చెప్పారు.

''ఇంతకీ ఆ ద్రోహి నాగవర్మ మన చేతిలో పడకుండా పారిపోగలిగాడు!'' అన్నాడు చిత్రసేనుడు ఎంతో నిస్పృహగా.

''మహారాజా, ఆ నాగవర్మనూ, వాడి వెంట వున్న పులిరాయుడు కరవీరుణ్ణీ పట్టుకునే పని నాకు వదలండి. ఇప్పుడే నా బంట్లను అడవి అంతా గాలించేందుకు పంపుతాను.'' అన్నాడు ఉగ్రాక్షుడు.

అతడు అజ్ఞాపించగానే కొందరు రాక్షసులు చేతికి దొరికిన ఆయుధమల్లా పట్టుకుని అడవిలో నలుమూలలకూ పరిగెత్తారు.

ఆ తరవాత కొంతసేపటికి చిత్రసేనుడు తన తండ్రికి సహాయంగా పంపిన సేనానాయకుడూ, ఆ వెనకగా తారకేశ్వరుడూ సైన్యాలతో సహా వచ్చారు. తన కుమారుడు ఎవరి సహాయం లేకుండానే కపిలపురం కోటను పట్టుకున్న సంగతి విని తారకేశ్వర

మహారాజు చాలా సంతోషించాడు. కాని, నాగవర్మ ప్రాణాలతో పారిపోవటం అతడికి బాధ కలిగించింది.

''ఆ ద్రోహి బ్రతికి వుండటం మన కెప్పటికీ ప్రమాదకరమే. వాడికీ, జ్వాలా ద్వీపపు పులిరాయుళ్ళకూ వున్న స్నేహ సంబంధాలవల్ల, ఏదో ఒకనాడు వాళ్ళు భయంకర పక్షులతో మన మీద దాడి చేయటానికి ప్రయత్నించకపోరు,'' అన్నాడాయన.

ఈ భయం అక్కడున్న ప్రతి ఒక్కరికీ వుండనే వున్నది. అందరూ ఉగ్రాక్షుడు పంపిన రాక్షసబంట్లు ఆ ద్రోహు లిద్దరినీ ఏ విధంగానైనా పట్టి తేగలరని పెద్ద ఆశ పెట్టుకున్నారు.




కపిలపురం రాజు వీరసింహుడికి, చిత్రసేనుడు తన తండ్రిని పరిచయం చేశాడు. వీరసింహుడు తనకు చిత్రసేనుడు చేసిన సహాయం సంగతి తారకేశ్వరుడితో వివరంగా చెప్పి, ''ఇక నేను రాజ్యపాలనా భారం వదులుకోదలిచాను. నాకు పుత్రులు లేరు. ఉన్నది ఒక్కగా నొక్క కుమార్తె. మీతో వియ్యమందాలని వున్నది,'' అన్నాడు.

తారకేశ్వరుడు అంతకు పూర్వమే రాకుమార్తె కాంతిమతిని చూశాడు. చిత్రసేనుడు ఆమెను ప్రేమించివున్నట్టు కూడా సైనికుల సంభాషణనుబట్టి గ్రహించాడు. ఒక్క దెబ్బతో తన కుమారుడు ప్రేమించిన రాకుమార్తెను వివాహమాడటమేగాక, తన రాజ్యాన్ని కూడా రెండింతలు చేసుకోగలడు. ఈ కారణాలవల్ల తారకేశ్వరుడు చిత్రసేన కాంతిమతుల వివాహానికి పరమానందంగా వెంటనే అంగీకారం తెలియపరిచాడు.

త్వరలోనే వివాహ ముహూర్తం నిర్ణయింపబడింది. వివాహం రోజున చిత్రసేనుడు సైనికులకూ, సేనానాయకులకూ చక్కటి బహుమానా లిచ్చాడు. అతడు ముఖ్యంగా తనకు మొదటి నుండి ఎన్నో విధాల సహాయపడిన, ఉగ్రాక్షుడికి ఏదైనా

విలువైన బహుమానం యివ్వాలనుకున్నాడు.

"ఉగ్రాక్షా, నువ్వు నాకు చేసిన సహాయం అమూల్యమైనది. నేనూ, కాంతిమతీ కూడా నీకు చాలా కృతజ్ఞులం. ఈ వివాహ సందర్భంలో నీకు ఎలాంటి బహుమానం కావాలో కోరుకో," అన్నాడు చిత్రసేనుడు.

"మహారాజా, మీరు మరోసారి ఆలోచించుకుని వాగ్దానం చెయ్యండి. నేను కోరబోయే బహుమానం మీకు కష్టం కలిగించవచ్చు," అన్నాడు ఉగ్రాక్షుడు.

"అలాంటిదేం వుండదు, కోరుకో!" అన్నాడు చిత్రసేనుడు.

"మహారాజా, నేను మిమ్మల్ని మొట్టమొదటగా కోరినకోర్కె, మీకు పుట్టబోయే పిల్లల్లో పెద్దవాణ్ణి పద్దెనిమిదో ఏడు రాగానే నాపరం చెయ్యమని. 'కాని, ప్రస్తుతం కొన్ని కారణాలవల్ల నా మనస్సు మార్చుకున్నాను. ఇప్పుడు నేను కోరేదేమిటంటే, మీకు పుట్టబోయే ప్రథమ సంతానం మగపిల్లవాడైనా, ఆడపిల్ల అయినాసరే— అయిదో ఏటనే నా పరం చెయ్యాలని." అన్నాడు ఉగ్రాక్షుడు.

ఈ కోరిక వింటూనే చిత్రసేనుడు నిర్విణ్ణుడయాడు. కాని, అంతలోనె అతడికి ఒక ఆలోచన వచ్చింది. తన ప్రథమ సంతానాన్ని ఏదో ఒకనాడు రాక్షసుడికి అప్పచెప్పవలసి రావటం తప్పనప్పుడు—అది పద్దెనిమిదో ఏట అయితేనేం? అయిదో ఏట అయితేనేం?

"ఉగ్రాక్షా, నువ్వు కోరిన విధంగానె జరుగుతుంది." అన్నాడు చిత్రసేనుడు గంభీరంగా

చిత్రసేనుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు ఎక్కడ లేని ఆనందంతో ఉప్పొంగిపోతూ, "మహారాజా, నేను సర్వదా తమ దాసానదాసుణ్ణి!" అంటూ అతడికి ప్రణమిల్లి లేచి, తన సేవకులకేసి తిరిగి, "ఒరే, బంట్లూ, అంతా యిక్కడే వున్నారా?" అని గట్టిగా హుంకరించాడు. —(ఇంకావుంది)








## 12

[నాగవర్మ కపిలపురం కోటలో తన సైన్యాన్నంతా పోగొట్టుకుని, మారువేషంతో, జ్వాలాద్వీపపు పులిరాయుళ్ళ నాయకుడైన కరవీరుడితో కలిసి తప్పించుకుని అడవిలోకి పారిపోయాడు. తరవాత రాకుమారి కాంతిమతికీ, చిత్రసేనుడికీ వివాహం అయింది. వివాహం నాడు ఉగ్రాక్షుడి కొత్త కోరికను నెరవేర్చేందుకు చిత్రసేనుడు అంగీకరించాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు తన రాకస బంట్లకోసం కేక వేయగానే, కోటలో ఎక్కడెక్కడ వున్న రాకసులూ ఒక్కుమ్మడిగా అతడి దగ్గరకు పరిగెత్తుకు వచ్చారు. ఉగ్రాక్షుడు వారందరినీ చిత్రసేనుడికి చూపుతూ, ''మహారాజా, మీరు ఏ క్షణాన ఎలాంటి సహాయం కావాలన్నా, నేనూ వీళ్ళూ రాగలం. మీరు నా కోటకు కాకితో కబురంపితే చాలు.'' అన్నాడు.

చిత్రసేనుడు చిరునవ్వు నవ్వాడు. ''నీ నుంచి గానీ, నీ బంట్ల నుంచి గానీ ఏమాత్రం సహాయం కోరే అవసరం లేకుండా, నా రాజ్యపాలన ప్రశాంతంగా జరిగిపోవాలన్నదే నా కోర్కె. అడవిలో ఎక్కడో మాయమైన ద్రోహి నాగవర్మనూ, అతని అనుచరుడు కరవీరుణ్ణీ, నీ బంట్లు పట్టుకు రాగలిగితే బావుండును. నాకూ, నీకూ కూడా ఏనాటికైనా ప్రమాదం



అంటూ కలిగితే—వాళ్ళిద్దరి నుంచే,'' అన్నాడు చిత్రసేనుడు.

''మహారాజా, వాళ్ళు ప్రస్తుతానికి అయిపూ అజా లేకుండా మాయమయారు. కాని, వాళ్ళు ఎంతోకాలం ఈ అడవుల్లో, కొండల్లో దాగివుండలేరని నా నమ్మకం. ఈనాటి నుంచి నా సేవకుల్లో సగంమందికి వాళ్ళను వెతికి పట్టుకునే పని ఒప్ప చెపుతున్నాను,'' అన్నాడు ఉగ్రాక్షుడు ఆవేశంగా.

చిత్రసేనుడి పక్షాన చేరిన పులిరాయుడు అమరపాలుడికి ఆ ద్రోహులిద్దరూ ప్రాణా లతో దొరుకుతారన్న నమ్మకం పోయింది. అతడు నిరాశగా తల వూపుతూ, ''మహా రాజా, వాళ్ళు ఈసరికే తూర్పు సముద్రంలో వున్న జ్వాలాద్వీపానికి ప్రయాణం కడు తూండి వుంటారని నా అనుమానం,'' అన్నాడు. చిత్రసేనుణ్ణి కూడా అలాంటి అనుమానమే బాధిస్తున్నది. ఉగ్రాక్షుడు అడవిలోని తనకోటకు ప్రయాణమయాడు.

రెండు మూడు నెలలు గడిచినై. ఉన్నట్టుండి హఠాత్తుగా రాజ్యంలో అక్కడా యిక్కడా దారిదోపిళ్ళూ, గృహ దహనాలూ ప్రారంభమయినట్టు చిత్ర సేనుడికి వేగుల ద్వారా వార్తలు అందినై. ఈ దోపిళ్ళు చేసేవాళ్ళు సుశిక్షితులూ, అన్నింటికీ తెగించిన పరమ దుష్టులని కూడా తెలిసింది. వాళ్ళు అడవి దారుల పక్కనా, కొండ కోనల్లోనూ దాగివుండి, హఠాత్తుగా బాటసారుల మీదా, గ్రామాల మీదా పడి నానా బీభత్సం కలిగించి, దొరికినదల్లా దోచుకుని పారిపోతున్నారు. తమను ఎదిరించినవాళ్ళనూ, వాళ్ళ గ్రామాలనూ నిలువునా కాల్చేస్తున్నారు. ఇంతవరకూ ఈ దుర్మార్గుల్లో ఒక్కగా నొక్కడైనా ప్రాణాలతో పట్టుబడలేదు. ఏ ఒకడైనా గాయపడిగాని, లేక గుంపు నుంచి వేరైగాని దొరికినా, వాడు వెంటనే ఏదో విషం మింగి ప్రాణాలు విడుస్తున్నాడు. ఆ కారణంగా, ఆ దోపిడిగాళ్ళను ప్రశ్నించి వాళ్ళ నాయకుడెవడో, వాళ్ళ నివాస స్థానా

ఎక్కడెక్కడ వున్నవో తెలుసుకునేందుకు సాధ్యం కాలేదు.

చిత్రసేనుడు ఒక పని చేశాడు: ఆయన తన మనుషులను రాజ్యంలోని గ్రామాలకూ, అడవుల మధ్య వుండే గూడేలకూ పంపి: ఇప్పటివరకూ బందిపోట్లుగానూ దారిదోపిడిగాళ్ళుగానూ వున్న వ్యక్తులందరూ క్షమించబడతారనీ, వాళ్ళు తమ తమ ఆయుధాలతో కపిలపురానికి వస్తే, ప్రతి ఒక్కరికీ వ్యవసాయ యోగ్యమైన భూములు యివ్వబడతవనీ చాటింపు వేయించాడు.



చిత్రసేనుడి ఈ ఎత్తుగడ పారింది. వారం తిరక్కుండానే, దాదాపు యాభై మంది బందిపోట్లు కత్తులూ, కటార్లతో కపిలపురానికి వచ్చారు. వాళ్ళందరూ రాజభవనం ముందున్న ఆవరణలో పోగవగానే, చిత్రసేనుడు తను కొత్తగా నియమించిన సేనానాయకుడు అమరపాలుణ్ణి వెంటబెట్టుకుని వాళ్ళ దగ్గిరకు వచ్చాడు. బందిపోట్లను చూస్తూనే అమరపాలుడు వాళ్ళల్లో కొందరిని గుర్తించి, చిత్రసేనుడితో, "మహారాజా, వీళ్ళలో కొందరైనా ద్రోహి నాగవర్మ సైనికులున్నారు. వీళ్ళను నమ్మి మడిమాన్యాలు యివ్వటం మనకు ప్రమాదం అవుతుందేమో," అన్నాడు.

"మీ నాయకుడు నాగవర్మ ఎక్కడ? అతడే మిమ్మల్ని పంపాడా?" అని అడిగాడు చిత్రసేనుడు బందిపోట్లను.

"మాకు ఒక నాయకుడంటూ లేడు, మహారాజా. మీరు అనుమానపడ్డట్టు మేము ఒకప్పుడు నాగవర్మ కింద పని చేసిన వాళ్ళమే కాని, ఈ కోటలో మీరు మాటు వేసి మా మీదకు రాకాసుల్ని వదిలినప్పుడు మేము తలా ఒక దారీ అయాం. ఆ నాటి నుంచి యీనాటివరకూ ఆ నాగవర్మ ఏమయాడో, మాకు తెలీదు." అన్నాడు బందిపోట్లకు నాయకుడైన ఒకడు.

"మీ మాటలు నమ్మటం ఎలా?" అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.



''మమ్మల్ని మీరు క్షమించి, దయగా చూశారని తెలియగానే ఆ మిగిలినవాళ్ళూ మీ శరణు జొచ్చేందుకు వస్తారు, మహా రాజా!'' అన్నాడు బందిపోట్ల నాయకుడు.

అమరపాలుడు, చిత్రసేనుడి చెవిలో రహస్యంగా, ''మహారాజా, వీళ్ళ మాటలు నమ్మేందుకు లేదు. ద్రోహి నాగవర్మ వెనక వుండి వీళ్ళచేత యీ నాటకమంతా ఆడిస్తున్నాడో లేదో మనం తెలుసుకునే వరకూ వీళ్ళను కారాగారంలో బంధించి వుంచటం బావుంటుం దనుకుంటాను,'' అన్నాడు.

''అది సాధ్యం కాదు. నేను మాట తప్పినట్టవుతుంది. ఆ తరవాత ప్రజల్లో నా వాగ్దానాలకు విలువేం వుంటుంది?'' అన్నాడు చిత్రసేనుడు.

''అయితే మీరో క్షణం ఆగండి. వీళ్లకో చిన్న బెదురు పెట్టి చూస్తాను,'' అంటూ అమరపాలుడు బందిపోట్లకేసి తిరిగి, ''మీలో కొందరికైనా నాగవర్మ, జ్వాలా ద్వీపపు పులిరాయుళ్ళ నాయకుడు కరవీరుడూ ఎక్కడ వున్నదీ తెలుసునని మహారాజుగారి అభిప్రాయం. మీరు నిజం బయట పెట్టకపోయారో, చిత్రవధ చేయించుతారు,'' అన్నాడు కఠినంగా.

అమరపాలుడు యిలా అనగానే బంది పోట్ల నాయకుడు గుప్పెట ముందుకు

''మీ చాటింపు విని, మీకు లొంగి పోయి, రాజభక్తి గల పౌరులుగా జీవించేందుకు అవకాశం కలుగుతుందని యిక్కడికి వచ్చాం. కేవలం పొట్టకోసమే మేము దోపిడీలకూ, దొంగతనాలకూ పాల్పడ్డాం. మా నేరాలు క్షమించి మమ్మల్ని మీ పౌరులుగా స్వీకరించాలని కోరుతున్నాం,'' అన్నాడు బందిపోట్ల నాయకుడు.

''సరే, మీ మాటలు నమ్మి మీకు సేద్యానికి పొలాలు యిస్తాను, కాని మీరు యాభైమందికన్న ఎక్కువ వున్నట్టులేదు. తతిమ్మా దొంగల మాటేమిటి?'' అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.








చాచాడు. అతడితోపాటు అతడి అనుచరులు కూడా గుప్పెట్లు చాచారు. బందిపోట్లనాయకుడు దృఢమైనకంఠస్వరంతో, "మహారాజా! మేము మేలుకూ, కీడుకూ కూడా సిద్ధపడే యిక్కడికి వచ్చాం. ఇదిగో, మా గుప్పెటలకేసి చూడండి. ఇందులో చిటికెల మీద ప్రాణం తీసే కాలకూట విషం వున్నది. మీ సైనికులు మా దరికి వచ్చే లోపలే, మేం యీ విషం మింగి మరణించగలం. మరోసారి ప్రమాణం చేసి చెపుతున్నాను. ఆ నాగవర్మ గురించిగాని, కరవీరుణ్ణి గురించిగాని మాకేమీ తెలియదు," అన్నాడు.

బందిపోట్ల నాయకుడు అలా అనగానే చిత్రసేనుడికీ, అమరపాలుడికీ కూడా అతడి మాటల్లో నమ్మకం కలిగింది. చిత్రసేనుడు బందిపోట్లకేసి చిరునవ్వు నవ్వుతూ, "సరే, ఈనాటి నుంచి మీరు రాజ్యంలోని తక్కినవారితోపాటు అన్ని హక్కులూ గల పౌరులు. మీకు ఈ రాజధాని నగరం దాపులనే వ్యవసాయ యోగ్యమైన భూములు ఇప్పిస్తాను," అన్నాడు. చిత్రసేనుడు ఇలా అనగానే బందిపోట్ల నుంచి ఒక్కసారిగా జయజయ ధ్వానాలు వినిపించినై. "చిత్రసేన మహారాజుకూ, జై!" అంటూ వాళ్ళు దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు చేశారు.

తమ తోటి బందిపోట్లను చిత్రసేన మహారాజు శిక్షించలేదనీ, వాళ్ళకు భూములు యివ్వటం జరిగిందనీ తెలియగానే, రాజ్యంలోని బందిపోటు ముఠాలన్నీ కపిలపురం వచ్చి రాజుగారికి లొంగిపోయాయి.

చిత్రసేనుడికి యిక తన పరిపాలన ఏ ఒడుదుడుకుల్లేకుండా సాగిపోతుందన్న నమ్మకం కలిగింది. కాని, అతడి కప్పుడప్పుడు ద్రోహి నాగవర్మ ఏమయాడు? ఇంకా బతికే వున్నాడా? వుంటే ఎక్కడ వున్నట్టు? అన్న అనుమానాలు కలుగుతూండేవి. అమరపాలుడు మాత్రం, నాగవర్మ కరవీరుడితో కలిసి జ్వాలాద్వీపం



వెళ్ళి వుంటాడని చెపుతూండేవాడు. అలా జరిగివుంటే, ఏదో ఒకనాడు వాళ్ళు తిరిగి భయంకర పక్షులతో రాజ్యం మీద ప్రత్యక్షమవుతారు.

ఇలాంటి చిన్నచిన్న భయాందోళనలతో వున్న చిత్రసేనుడు, తన భార్య గర్భవతి అయినదని తెలిసినప్పుడు మరింతగా ఆందోళన పడ్డాడు. ఆ పుట్టబోయే శిశువు మగపిల్లవాడైనా, ఆడపిల్ల అయినా, అయిదేళ్ళు పెంచి రాక్షసుడైన ఉగ్రాక్షుడి పరం చెయ్యాలి.

నెలలు గడిచాయి. రాణి కాంతిమతి ఒకనాటి సూర్యోదయం వేళ ఒక మగపిల్లవాణ్ణి కన్నది. రాజ్యంలో ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. ప్రజలు ఉత్సవాలు చేసుకున్నారు. ఆ ఉత్సవాల నడుమ ఉగ్రాక్షుడు రాజప్రాసాదానికి వచ్చి, పొత్తిళ్ళలో వున్న రాజకుమారుణ్ణి అంత ఎడంలో నిలబడి చూసి, చిన్న పిల్లవాడిలా కేరింతలు కొడుతూ గంతులు వేశాడు.

"మహారాజా, ఈనాటి నుంచి అయిదేళ్ళు ముగియగానే, ఈ పిల్లవాడు నావాడవుతాడు," అన్నాడు ఉగ్రాక్షుడు.

ఏళ్లు గడుస్తున్నై. కపిలపుర రాజ్యంలో రాత్రివేళల అక్కడక్కడా ఆకాశంలో ఎగిరే మంటలు కనిపిస్తున్నవనీ, అవి అగ్నిపక్షులేననీ ప్రజలు చెప్పుకోసాగారు. క్రమంగా యీ వార్తలు చిత్రసేనుడికి అందినై. రాజ్యంలో నలుమూలల వున్న వేగులవాళ్ళు, ఆ ఎగిరేవి అగ్నిపక్షులేనని ధృవపరిచారు.

ఇదో కొత్త బెడద, అనుకున్నాడు చిత్రసేనుడు. ఇంతలో రాకుమారుడికి అయిదేళ్ళు నిండినై. ఒకనాటి ఉదయం ఉగ్రాక్షుడు తుఫానులా రాజప్రాసాదం ముందుకు వచ్చి పడ్డాడు.

"మహారాజా, వచ్చాను! ఏదీ రాకుమారుడు?" అని అడిగాడు రాక్షసుడు.

"ఇప్పుడే వస్తున్నాడు, కొత్త దుస్తులూ అవీ....అలంకరిస్తున్నారు, ఆగు!" అన్నాడు చిత్రసేనుడు.

చిత్రసేనుడి ముఖంలో ఏమాత్రం విచారఛాయలు లేకపోవటం చూసి, ఉగ్రాక్షుడు ఆశ్చర్యపడ్డాడు. తన ప్రథమ సంతానాన్ని యింత నిర్వికారంగా అతడు తన పరం చేస్తున్నాడేం? కుర్రవాడు కుంటిగాని, గుడ్డిగాని కాదుగదా?

ఉగ్రాక్షుడు యిలా ఆలోచిస్తున్నంతలో దాసీలు పుష్టిగా, ఆరోగ్యంగా వున్న ఒక కుర్రవాణ్ణి తెచ్చి, ఉగ్రాక్షుడి ముందు నిలబెట్టారు. ఉగ్రాక్షుడు ఆ కుర్రవాణ్ణి చూసి ఉత్సాహంగా చప్పట్లు చరిచి, రెండు చేతులతో పట్టి భుజం మీదికి ఎత్తుకుంటూ, ''మహారాజా, మీరు అన్న మాట మీద నిలబడ్డారు. మీ మేలు మరవను,'' అంటూ కోట ద్వారం దాటి అడవిలో ప్రవేశించాడు.

ఉగ్రాక్షుడు అడవి చేరగానే, అతడి భుజం మీద వున్న కుర్రవాడు, దూరంగా చేయి చూపుతూ, ''అయ్యా, అయ్యా, ఆ చెట్టుకింద వున్న ఎండు కర్రపుల్ల నాక్కావాలే!'' అని మారాం చేశాడు.

ఉగ్రాక్షుడు భుజం మీది నుంచి కుర్రవాణ్ణి దించి, కర్రపుల్ల తెచ్చి అతడి కిస్తూ, ''ఈ కర్రతో ఏం చేస్తావు, బాబూ?'' అని ముద్దుగా అడిగాడు.

''వంటింట్లోకి కుక్కలూ, కోళ్ళూ రాకుండా తరుముతాను,'' అన్నాడు కుర్రవాడు.

ఉగ్రాక్షుడు ఉలిక్కిపడ్డాడు. రాజకుమారుడు వంటింట్లోకి కుక్కలూ, కోళ్ళూ రాకుండా తరమటం ఏమిటి?

''మీ అయ్య ఏం చేస్తూంటాడురా, బాబూ?'' అని అడిగాడతడు.

''వంటింట్లో మాంసం, అన్నం వండుతుంటాడు. ఏదైనా కుక్క, మాంసం ఎత్తుకుపోయేందుకు వచ్చిందో, ఈ కర్రతో నడుం యిరగేస్తాను,'' అన్నాడు కుర్రవాడు.

''ఇంత మోసమా, హుఁ! వంటవాడి కొడుకును, రాజకుమారుడని నాకిస్తారా?'' అంటూ ఉగ్రాక్షుడు కుర్రవాణ్ణి భుజాన వేసుకుని హుంకరిస్తూ, కపిలపురం కోటకు బయలుదేరాడు. —(ఇంకావుంది)






## 13

[చిత్రసేనుడు రాజ్యంలో తల ఎత్తిన బందిపోట్లనూ, దారిదోపిడిగాళ్ళనూ ఎంతో చాకచక్యంతో లొంగతీసుకున్నాడు. ఈలోపల రాణి కాంతిమతి కుమారుణ్ణి కన్నది. వాడికి ఐదేళ్ళు నిండగానే ఉగ్రాక్షుడు వచ్చాడు. చిత్రసేనుడు అతడికి ఒక బాలుణ్ణి యిచ్చాడు. ఆ బాలుడు రాకుమారుడు కాదని ఉగ్రాక్షుడు తెలుసుకున్నాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు కోటద్వారం దగ్గిరకు రావటం చూస్తూనే అమరపాలుడు, చిత్రసేనుడి వద్దకు పోయి, "మహారాజా! ఆ రాక్షసుడు భూమి దద్దరిల్లేలా అడుగులు వేస్తూ, కోటలోకి వస్తున్నాడు." అని చెప్పాడు.

చిత్రసేనుడు నివ్వెరపోయాడు. రాణి కాంతిమతి వెలవెలపోయింది. "అయితే, ఆ కుర్రవాడెవడైందీ ఉగ్రాక్షుడు గ్రహించాడన్నమాట!" అన్నాడు చిత్రసేనుడు.

"వాణ్ణి మనం అంత సులభంగా మోసగించలేం, మహారాజా!" అన్నాడు అమరపాలుడు.

"అలాగే తోస్తున్నది." అంటూ చిత్రసేనుడు కాంతిమతి కేసి ఓ క్షణకాలం చూసి, "మనం విచారించి లాభం లేదు. నేను అతడికి వాగ్దానం చేసినప్పుడు పరిస్థితులు యీ విధంగా పరిణమిస్తవని ఊహించలేకపోయాను." అన్నాడు.



''వాణ్ణి హతమారిస్తేనో, మహారాజా?'' అన్నాడు అమరపాలుడు.

''అది అంత తేలిగ్గా సాధ్యమయేది కాదు. ఒకవేళ సాధ్యం అయినా, రాజ్యం అల్లకల్లోలం కావటం, నేను మాట తప్పాననే అపకీర్తి పొందటం జరిగి తీరుతుంది,'' అన్నాడు చిత్రసేనుడు.

రాణి కాంతిమతి చప్పున ఆసనం మీది నుంచి లేచి, ''మహారాజా! ఆ రాక్షసుడి సంగతి నాకు వదలండి.'' అంటూ తన గది కేసి వెళ్ళిపోయింది.

ఇంతలో ఉగ్రాక్షుడు రాజప్రాసాదం సమీపించి, ''మహారాజా, మహారాజా!'' అంటూ గావుకేకలు పెట్టాడు. ఆ కేకలు వింటూనే చిత్రసేనుడూ, అమరపాలుడూ మేడమెట్లు దిగి కిందికి వచ్చారు. చిత్రసేనుడు ఉగ్రాక్షుడి కేసి చిరునవ్వు నవ్వుతూ, ''ఏం జరిగింది ఉగ్రాక్షా?'' అన్నాడు.

''మోసం మహారాజా! మీరీ విధంగా ఆడితప్పుతారని నేననుకోలేదు.'' అన్నాడు ఉగ్రాక్షుడు భుజం మీది నుంచి కుర్రవాణ్ణి కిందకు దింపుతూ.

''దాసీలవల్ల పొరపాటు జరిగిపోయింది. వాళ్ళు హడావిడిలో నీకు రాజకుమారుడి బదులు మంత్రి కుమారుణ్ణి యిచ్చారు.'' అన్నాడు అమరపాలుడు.

''వీడు మంత్రికుమారుడా? అహ్హహ్హ.'' అంటూ ఉగ్రాక్షుడు పెద్దగా నవ్వి, కుర్రవాణ్ణి రెండు చేతులతో పట్టి పైకెత్తుతూ, ''వీడు వంటవాడి కొడుకు, మంత్రి కుమారుడు కాదు. అసలు నాకు కావలసింది చిత్రసేన మహారాజుగారి మొదటి సంతానం. దానికి బదులు ఈ రాజ్యమంతా నా కిస్తానన్నా తీసుకోను.'' అన్నాడు.

''కొంచెం ఆగు. కుర్రవాడికి మంచి దుస్తులు తొడిగి యిప్పుడే తీసుకువస్తారు.'' అన్నాడు చిత్రసేనుడు.

క్షణాల మీద దాసీలు చక్కని పట్టు దుస్తులతో అలంకరించిన ఒక కుర్రవాణ్ణి తెచ్చి, ఉగ్రాక్షుడి ముందు నిలబెట్టారు.

ఉగ్రాక్షుడు ఆ కుర్రవాడి కేసి, దాసీల కేసీ ఒకటి రెండుసార్లు పరీక్షగా చూసి, దాసీలతో, "అమ్మాయిలూ, మీరు హడావిడిలో రాజకుమారుడికి మరెవరినైనా తీసుకురాలేదుగదా ?" అని అడిగాడు.

"నీకు అంత అనుమానం అయితే అబ్బాయినే అడుగు," అన్నారు దాసీలు.

ఈలోపల చిత్రసేనుడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. ఉగ్రాక్షుడు కుర్రవాణ్ణి సమీపించి, వాణ్ణి చేతుల్లోకి తీసుకుంటూ, "నీ పేరేమిటి బాబూ ?" అని అడిగాడు.

"యువరాజు," అన్నాడు కుర్రవాడు.

దాసీలు పెద్దగా నవ్వుతూ, "అదేం ప్రశ్న ఉగ్రాక్షా ? 'నీ వెవరి కొడుకువు ?' అని కుర్రవాణ్ణి ప్రశ్నిస్తే నిజం బయట పడేదిగదా ?" అన్నారు.

"నన్ను మోసం చేయదలుచుకుంటే, అలాంటి ప్రశ్నకు వీడు ఎలాంటి జవాబివ్వాలో ముందుగానే మీరు నేర్పి వుంటారు. అందుకనే నేను మరోరకం ప్రశ్న అడిగాను. వీడు రాజకుమారుడవునో కాదో తెలుసుకునేందుకు, అడవిలో వీడికొక పరీక్ష వున్నది. ఈసారి కూడా మీరు నన్ను మోసం చేసినట్టు బయటపడిందో, మీ దాసీ లందర్నీ ఎత్తుకుపోయి, నా బంట్లకు యిచ్చి పెళ్ళి చేసేస్తాను," అన్నాడు ఉగ్రాక్షుడు.




ఉగ్రాక్షుడు అన్న మాటలు విని కొందరు దాసీలు నవ్వుకున్నారు, కొందరు భయపడ్డారు. ఉగ్రాక్షుడు కుర్రవాణ్ణి భుజాన ఎక్కించుకుని వేగంగా అడుగులు వేసుకుంటూ అడవిలో ప్రవేశించాడు.

ఉగ్రాక్షుడు అడవిలో కొంతదూరం నడిచిన తరవాత, కుర్రవాణ్ణి రాజకుమారుడవునో కాదో పరీక్ష చెయ్యాలనుకున్నాడు. అతడికి దారిమధ్య వంటవాడి కొడుకు జారవిడిచిన కర్రపుల్ల కనబడింది. ఉగ్రాక్షుడు కుర్రవాణ్ణి భుజం మీది నుంచి దించి, కర్రపుల్లను అతడి చేతికి అందిస్తూ, "ఈ కర్రపుల్ల నీకిస్తే, ఏం చేస్తావురా, బాబూ ?" అని ప్రశ్నించాడు.





పిల్ల నీకిస్తే, ఏంచేస్తావురా, బాబూ?" అని ప్రశ్నించాడు.

"ఇది నాకెందుకు? మా అయ్యకిస్తాను," అన్నాడు కుర్రవాడు. ఉగ్రాక్షుడు ఉలిక్కిపడ్డాడు. మళ్ళీ తనను మోసగించి వుంటారన్న అనుమానం అతడికి కలిగింది.

"మీ అయ్య ఈ కర్రతో ఏంచేస్తాడు?" అని అడిగాడు అతడు.

"మంద విడిచి ఏదన్నా గొర్రె పారిపోవాలని చూస్తే, ఈ కర్రతో దాని కాళ్ళు విరగేస్తాడు," అన్నాడు కుర్రవాడు.

"అరె కుంభకర్ణుడా! నువ్వు రాజుగారి గొర్రెలు కాచేవాడి కొడుకువన్నమాట! ఎంత మోసం, ఎంత మోసం! గొర్రెలు కాచేవాడి కొడుకును, రాజకుమారుడని నాకిస్తారా?" అంటూ ఉగ్రాక్షుడు కళ్ళెర్రచేసి, కుర్రవాణ్ణి భుజాన వేసుకుని, హుంకరిస్తూ కపిలపురం కోటకు బయలుదేరాడు.

ఉగ్రాక్షుడు అడవి దాటి కోటముందున్న మైదానంకేసి చూసేసరికి, అక్కడ కొందరు గుర్రపు రౌతులూ, సైనికులూ నిలబడి వున్నారు. వాళ్ళను చూస్తూనే ఉగ్రాక్షుడు, "వీళ్ళందర్నీ చిత్రసేనుడు నామీద యుద్ధానికి పంపలేదుగదా," అనుకున్నాడు. కాని, అతడు వాళ్ళను సమీపిస్తున్నకొద్దీ అతడికి రాజభటులముందు నిలబడిన అమరపాలుడూ, అతడి పక్కన పట్టువస్త్రాలు ధరించి ధగధగ మెరిసిపోతున్న ఒక పదేళ్ల కుర్రవాడూ కనిపించారు. "వీడు, రాజకుమారుడయి వుంటాడు," అనుకున్నాడు ఉగ్రాక్షుడు తృప్తిగా.

ఉగ్రాక్షుడు అల్లంత దూరంలో వుండగానే అమరపాలుడు పెద్దగా కేకపెట్టి, "ఉగ్రాక్షా! ఇడుగో రాజకుమారుడు. రెండవసారికూడా దాసీలవల్లనే పొరబాటు జరిగిపోయింది. ఏమీ అనుకోకు," అన్నాడు.

"ఈ పొరబాట్లన్నీ దాసీలు చేస్తున్నవా?" అంటూ ఉగ్రాక్షుడు హేళనగా నవ్వి,







ఎవరబ్బాయిని యివ్వబోతున్నావు?" అని అడిగాడు.

"ఈ కుర్రవాడు ఎవరో కాదు, యువరాజు. చిత్రసేన మహారాజు ప్రథమ సంతానం!" అన్నాడు అమరపాలుడు కోపంగా.

ఉగ్రాక్షుడు ఆ కుర్రవాణ్ణి పరీక్షగా చూసి, వీడు తప్పక రాజకుమారుడే అని దృఢపరుచుకుని, "నన్నింత ఆయాస పెట్టి, మీరింత ఆయాసపడేకన్న— మొదటిసారిగానే యువరాజును నాకిస్తే సరిపోయేదిగదా?" అన్నాడు.



"నువ్వు రాక్షసుడివి గనక కన్నకడుపు తీపి ఎలా వుంటుందో నీకు తెలియదు. రాణి మూర్ఛపోయింది. మహారాజు దుఃఖంతో తన గదిలో పడుకుని వున్నాడు. ఆయన ముందూ వెనకలు ఆలోచించకుండా నీకు చేసిన వాగ్దానం, ఈనాడు ఎంత విచారకారణం అయిందో నీకు తెలియదు. సరే, నువ్వు వచ్చిన పని అయిందిగదా?" అన్నాడు అమరపాలుడు.

"అవునవును." అంటూ ఉగ్రాక్షుడు బిక్కమొహం వేసి, రాజకుమారుణ్ణి భుజం మీదికి ఎత్తుకుంటూ, "ఏదో ఒకనాడు వచ్చి మహారాజుగారి దర్శనం చేసుకుంటాను." అంటూ అడవికేసి బయలుదేరాడు.

"ఇక మీదట రాజకుమారుడికి ఎటువంటి కష్టం కలగకుండా చూస్తూ, పెంచి పెద్దవాణ్ణి చేసే భారం నీది, జాగ్రత్త!" అంటూ అమరపాలుడు వెనక నుంచి కేక వేశాడు.

ఉగ్రాక్షుడు ఆ కేక వింటూనే నడుస్తున్నవాడల్లా ఆగి, వెనుదిరిగి, "ఈనాటి నుంచి వీడు చిత్రసేన మహారాజు కుమారుడు కాదు, నా కుమారుడు— ఉగ్రదత్తుడు! తెలిసిందా?" అంటూ హుంకరించాడు.

ఉప్పొంగుతున్న ఉత్సాహంతో ఉగ్రాక్షుడు అరణ్యానికి అడ్డంపడి తన కోటకేసి నడుస్తూ, భుజం మీద వున్న రాజ



రాకుమారుడితో, ''బాబూ, ఇవాళటి నుంచి నువ్వు నా కుమారుడివి. నీ పేరు ఉగ్రదత్తుడు. ఈ అడవి అంతా నీదే. నీకు సేవ చెయ్యటానికీ, నీ ఆజ్ఞల్ని పాలించేందుకూ వందలకొలది బంట్లు మన కోటలో వున్నారు.'' అన్నాడు.

ఉగ్రాక్షుడు తన కోటను సమీపించాడు. కోటముందు తమ తమ కుటుంబాలతో రాక్షసబంట్లు సొలుపులుగా నిలబడి వున్నారు. వాళ్ళు ఉగ్రాక్షుణ్ణీ, రాకుమారుణ్ణీ చూస్తూనే జయజయ ధ్వానాలు చేశారు.

ఉగ్రాక్షుడు తన సేవకులకు రాకుమారుణ్ణి చూపుతూ, ''వీడు మీ కాబోయే నాయకుడు. పేరు ఉగ్రదత్తుడు!'' అన్నాడు. వెంటనే 'ఉగ్రదత్తుడికి జై!' అన్న కేకలు వినిపించినై. ఉగ్రాక్షుడు కోటలో ప్రవేశించి, అక్కడ చక్కగా అలంకరించిన ఒక గదిలో ఉగ్రదత్తుణ్ణి భుజం మీది నుంచి దింపుతూ, "ఉగ్రదత్తా, ఈ గది నీది. నీతో కలిసి ఆడుకునేందుకు నీ వయసువాళ్ళే అయిన యిద్దరు బాలుర్ని తెప్పిస్తాను.'' అన్నాడు.

ఉగ్రాక్షుడు తన బంట్లలో ముఖ్యులైన వారిని నలుగురిని పిలిచి, ''మీరు యిప్పుడే బయలుదేరి వెళ్ళి, ఉగ్రదత్తుడి వయసు వాళ్ళయిన యిద్దరు మగపిల్లల్ని పట్టుకు రండి. ఇది కొంత రహస్యంగా జరగాలి. మనం పల్లెల మీద పడి పిల్లల్ని అపహరిస్తున్నట్టు చిత్రసేన మహారాజుకు తెలియకూడదు.'' అన్నాడు.

''అయితే, ఈ పని రాత్రివేళ జరగటమే మంచిది,'' అన్నాడొక బంటు.

''అలాగే చెయ్యండి. కాని, చీకట్లో తెలియక ఏ గుడ్డివాళ్ళనో, కుంటివాళ్ళనో పట్టుకువస్తే మాత్రం మీ చర్మాలు వొలుస్తాను. ఇదుగో, మీరు పిల్లల్ని దొంగిలించిన ఇంట్లో ఈ బంగారు కాసుల సంచులు వదిలి రండి.'' అంటూ ఉగ్రాక్షుడు తన బంట్లకు బంగారం వున్న రెండు సంచులు ఇచ్చాడు.





కొద్ది రోజులు గడిచినై. ఒకనాటి ఉదయం ఉగ్రాక్షుడు ఉగ్రదత్తుణ్ణి కోట ముందున్న ఆవరణలో ఆడిస్తూ వుండగా నలుగురు రాకసబంట్లు పాటలు పాడుతూ, ఈలలు వేస్తూ అక్కడికి పరిగెత్తుకు వచ్చారు. వాళ్ళ చేతుల్లో ఉగ్రదత్తుడి వయసువాళ్ళే అయిన యిద్దరు కుర్ర వాళ్ళున్నారు.

వాళ్ళను చూస్తూనే ఉగ్రదత్తుడు ఉత్సాహంగా గంతులు వేయసాగాడు. కాని, ఆ కుర్రవాళ్ళిద్దరూ భయంతో బిక్కు బిక్కుమంటున్నారు. ఉగ్రాక్షుడు తన బంట్లతో, "ఎవరికీ తెలియకుండా రహస్యంగానే ఈ ఇద్దర్నీ పట్టుకొచ్చారా?" అని అడిగాడు.

"పరాయి కంటికి తెలీదు, మహా నాయకా, ఇద్దర్నీ ఊరిబయట చెరువుగట్టునున్న ఇళ్ళల్లో నుంచి పట్టుకొచ్చాం. ఆ సమయంలో పెద్దవాళ్ళెవరూ లేరు. మీరిచ్చిన బంగారు కాసుల సంచులు ఇళ్ళల్లో వదిలాం." అన్నారు రాకసబంట్లు.

ఇంతలో కొత్తగా పట్టుకొచ్చిన కుర్రవాళ్ళిద్దరూ ఒక్కసారిగా గొంతులెత్తి ఏడవసాగారు. వాళ్ళిద్దరినీ చూసి ఉగ్రదత్తుడు కూడా కెవ్వుమని ఏడుపు ప్రారంభించాడు.

ఉగ్రాక్షుడు ముగ్గుర్నీ సముదాయించేందుకు ప్రయత్నిస్తూ తన బంట్లతో, "వీళ్ళను తోటలోకి తీసుకుపోయి ఆడించండి. అక్కడ వున్న పులిపిల్లల్నీ, ఎలుగుకూనల్నీ చూస్తే ఏడుపు మానొచ్చు. వీళ్ళు ముగ్గురూ పెరిగి పెద్దవాళ్ళయ్యేవరకూ, వీళ్ళను గురించిన సమాచారం అడవిలో వున్న గ్రామవాసులెవరికీ తెలియకూడదు." అన్నాడు.

వెంటనే రాకసబంట్లు కోట వెనక వున్న తోటలోకి ముగ్గురు బాలుర్నీ తీసుకుపోయారు. అక్కడ పులి, ఎలుగుబంటి మొదలైన క్రూరమృగాల పిల్లలు చెట్లకింద ఆడుకుంటున్నవి. వాటిని చూస్తూనే ఉగ్రదత్తుడూ, తతిమ్మా యిద్దరు కుర్రవాళ్లూ ఏడుపు మానారు. —(ఇంకావుంది)






# 14

[చిత్రసేనుడు తను వాగ్దానం చేసిన ప్రకారం ఉగ్రాక్షుడికి తన ప్రథమ సంతానాన్ని యివ్వకుండా, ఇతర్ల పిల్లల్ని యిచ్చాడు. ఉగ్రాక్షుడు ఈ మోసం గ్రహించాడు. చివరకు చిత్రసేనుడు తన పిల్లవాణ్ణి ఉగ్రాక్షుడి పరం చేశాడు. ఉగ్రాక్షుడు ఆ పిల్లవాడికి ఉగ్రదత్తుడని పేరుపెట్టి, మరిద్దరు కుర్రవాళ్ళతో, అతణ్ణి తన కోటలో పెంచసాగాడు. తరవాత—]

ఐదేళ్ళ వయసు వరకూ, రాజభోగాలతో సుకుమారంగా పెరిగిన చిత్రసేనుడి కుమారుడు, రాక్షసుడైన ఉగ్రాక్షుడి కోటలో ఉగ్రదత్తుడనే పేరుతో పెరగసాగాడు. అతడికి తోడుగా వుంటూ ఆటపాటల్లో పాల్గొనేందుకు దొంగిలించుకురాబడిన పల్లెబాలురకు, ఉగ్రాక్షుడు రుద్రుడు అసుద్రుడు అని పేర్లు పెట్టాడు. ఈ ముగ్గురూ రాక్షసుల నడుమ తతిమ్మా రాక్షస బాలురతోపాటు పెరిగి పెద్దవారవుతున్నారు.

రోజులూ, వారాలూ, నెలలూ, సంవత్సరాలూ గడిచిపోతున్నై. చూస్తూండగానే పదిహేను సంవత్సరాలు గిర్రున తిరిగినై. ఉగ్రాక్షుడు తన నాయకత్వంకింద వున్న రాక్షసులను హింసాప్రవృత్తి మాన్పి నాగరికులను చేసేందుకు, వాళ్ళచేత అడవి నరికించి వ్యవసాయపు పనులు చేయించసాగాడు. కాని, వాళ్ళకు భూములు దున్నేందుకూ, పండిన పంటలను ఇళ్ళకు చేర్చేందుకూ మామూలు ఎడ్లూ, దున్నపోతులూ పనికి







రాలేదు. మహాకాయులూ, బలశాలులూ అయినవాళ్ళ చేతుల్లో, మనుషులు ఉపయోగించే ఈ పశువులు ఎందుకూ అక్కరకు రాకుండా పోయినై. ఆ కారణంచేత వాళ్ళు ఏనుగులనూ, ఒంటెలనూ, ఖడ్గమృగాలనూ నాగళ్ళకూ, బండ్లకూ కట్టి వ్యవసాయపు పనులు చేయసాగారు. ఇది అడవిలో వున్న గ్రామాల్లో నివసించే ప్రజలకు ఎంతో ఆశ్చర్యాన్నీ, అబ్బురపాటునూ కలిగించింది. రాక్షసులు నరమాంస భక్షణా, గ్రామాలమీద పడి, పశువులను దొంగిలించుకుపోవటం మాని, ఈవిధంగా వ్యవసాయదారు లైనందుకు వాళ్లెంతగానో సంతోషించారు. ఈ అన్ని కారణాలవల్లా చిత్రసేనుడు పాలిస్తున్న కపిలపురరాజ్యం సర్వసంపదలతో తుల తూగ సాగింది.

అప్పుడు ఉగ్రదత్తుడూ, అతడి చెలికాళ్లయిన రుద్రారుద్రులూ ఇరవై ఏళ్లు నిండిన నవయువ్వనులు. వాళ్లు కత్తిసామూ, గుర్రపుస్వారీ, ఈటె విసరటం, ధనుర్బాణాలు ప్రయోగించటంలో గొప్ప నిపుణులైయ్యారు. వాళ్లు ఉగ్రాక్షుడి ద్వారా ఒకప్పుడు కపిలపుర రాజ్యంలో పెద్ద సంక్షోభం కలిగించిన, జ్వాలాద్వీపపు పులిరాయుళ్లను గురించి విన్నారు.

"ఈనాటికీ ఆ పులిరాయుళ్లు భయంకర పక్షులమీద ఎక్కి, అప్పుడప్పుడూ రాత్రి వేళల మన రాజ్యంలో కనిపిస్తూవుంటారు. గత పదిహేను సంవత్సరాలుగా వాళ్లు రాజ్యంలో చేసిన దుండగం ఏమీలేదు. వాళ్ల నాయకుడుగా యిక్కడికి వచ్చిన కరవీరుడూ, ద్రోహి నాగవర్మా మనకు చిక్కకుండా పారిపోయారు," అని చెప్పాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రాక్షుడి ఈ మాటలూ, హెచ్చరికా ఉగ్రదత్తుడి మనసులో బాగా హత్తుకుపోయినై. ద్రోహి నాగవర్మా, అతడి అనుచరుడు కరవీరుడూ జ్వాలాద్వీపంలో









వున్నారో లేదో అన్న సంగతి యిదమిత్థంగా తెలుసుకుంటే తప్ప, రాజ్యానికి క్షేమం లేదని అతడు నిర్ణయించుకున్నాడు. ఈ నాటికీ రాజ్యంలో జ్వాలాద్వీపవాసులు అప్పు డప్పుడూ కనిపిస్తూ వున్నారంటే—దాని అర్థం ఆ క్రూరులు ఈ కపిలపుర రాజ్యాన్ని గురించి పూర్తిగా మరిచిపోలేదన్నమాట.

ఉగ్రదత్తుడు తన స్నేహితులైన రుద్రా రుద్రులతో సంప్రదించి ఒక పథకం వేశాడు. అదేమిటంటే, రాజ్యంలో రాత్రివేళల చెదురుగా అక్కడా యిక్కడా కనబడే జ్వాలాద్వీపవాసుల్లో ఒకణ్ణి ప్రాణాలతో పట్టు కోవటం. అలా ఒకడు దొరికినన్నాడు వాడి ద్వారా ప్రస్తుత జ్వాలాద్వీపపు స్థితిగతులు తెలుసుకోవచ్చు. ద్రోహి నాగవర్మ, కర వీరుడూ సజీవులో కాదో గ్రహించవచ్చు.

ప్రాణాలతో ఒక జ్వాలాద్వీపపు పులి రాయుణ్ణి పట్టుకోవాలంటే, అరణ్యంలో వున్న ప్రజలూ, రాక్షసులూ సహకరించాలి. ఏదైనా పెద్ద బహుమానం ప్రకటిస్తే వాళ్లు అన్నిటికీ తెగించి, రేబవలు కాపలా వేసి, ఒక్క పులిరాయుణ్ణయినా తప్పక పట్టుకు తీసుతారు.

ఉగ్రదత్తుడు ఈవిషయం తన పెంపుడు తండ్రి అయిన ఉగ్రాక్షుడితో మాట్లాడాడు. ఉగ్రాక్షుడు వెంటనే అంగీకరించాడు. "పులి రాయుణ్ణి ప్రాణాలతో పట్టి తెచ్చినవాళ్ళకు ఒక లక్ష బంగారు కాసులు యిస్తామని చాటింపు వేయించు. పోయిందేమిటి? మన కోటలోని నేల మాళిగలలో బంగారం మూలుగుతున్నది," అన్నాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రదత్తుడు అడవిలోని జనవాసాల్లో రాక్షసులు నివసించే కొండ చరియల్లో చాటింపు వేయించాడు. అది మొదలు రోజూ జ్వాలాద్వీపపు పులిరాయుళ్ళను గురించిన సమాచారం ఉగ్రాక్షుడి కోటకు తెలియ వస్తూండేది. పులిరాయుళ్లు తమ భయంకర పక్షులమీద ఎక్కి రాత్రివేళ చాలాచాలా









ప్రదేశాల్లో కనిపిస్తున్నారు. కాని, ఎక్కడా వాళ్లు కిందికి దిగటంలేదు.

ఈరకమైన వార్తలు ఉగ్రదత్తుణ్ణి నిరుత్సాహ పరిచినై. పులిరాయుళ్లు రాజ్యంలో ఎలాంటి కల్లోలం కలిగించాలనే ప్రయత్నంలో, ఈవిధంగా రాత్రివేళల వేగు వస్తున్నారో అతడికి అర్థంకాలేదు. ఒకవేళ ఆ క్రూరులు ప్రజల కంటబడకుండా. ఏ మారుమూలనున్న అడవి ప్రాంతాల్లోనైనా కిందికి దిగుతున్నారా?

ఈ అనుమానం తీరాలంటే తనే స్వయంగా రాత్రివేళల్లో అడవిలోకి పోయి, ఏదో ఒక ఎత్తయిన ప్రదేశాన్నుంచి కాపలా కాయాలి. ఉగ్రదత్తుడు యీ నిర్ణయానికి రాగానే, రుద్రుడూ అరుద్రుడూ కూడా అతడి వెంట వచ్చేందుకు ఉత్సాహం కనబరిచారు. ఒకనాటి సూర్యోదయం వేళ ముగ్గురూ కోట వదిలి గుర్రాలమీద అరణ్యంలోకి బయలుదేరారు. వాళ్లు జనులు నివసించే గ్రామాలను వదిలి, నిర్జనంగా వుండే అరణ్య ప్రాంతాల వెంట నడిరేయివరకూ ప్రయాణం చేశారు.

అసరికి ముగ్గురూ అలసిపోయారు. గుర్రాలు బాగా డస్సిపోయి వున్నాయి. తెల్లవారేవరకూ అక్కడ వున్న ఒక దేవదారు వృక్షం కింద విశ్రాంతి తీసుకోవాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు. ముగ్గురూ గుర్రాలు దిగి, వాటిని విడివిడిగా చెట్లకు కట్టివేసి, తాము పడుకోదలుచుకున్న చెట్టుకిందికి వచ్చేసరికి, చెట్టు పైభాగమంతా వెలుగుతో మెరిసిపోవటం వాళ్ళ కంటబడింది.

అందరికన్న ముందు తలఎత్తి చూసిన ఉగ్రదత్తుడు, ఎక్కడలేని ఆశ్చర్యంతో, "భయంకర పక్షి! దానిమీద వున్న పులిరాయుడి చేతిలో వెలుగు నిస్తున్న వస్తువేదో వున్నది," అన్నాడు.

రుద్రారుద్రులుకూడా తలలు ఎత్తి చూశారు. ఆ సరికి భయంకర పక్షి పడమటి







రుద్రారుద్రులు కూడా తలలు ఎత్తి చూశారు. ఆసరికి భయంకరపక్షి పడమటి దిశగా చాలా దూరం వెళ్ళిపోయింది. వాళ్ళు కూడా పక్షి పోతున్న వైపు నుంచి వెలుగు రావటం గమనించారు.

''నేను ఈ దేవదారు చెట్టు చివారు కొమ్మకు ఎక్కి, మనం ప్రస్తుతం ఎలాంటి పరిసరాల్లో వున్నామో చూస్తాను.'' అన్నాడు రుద్రుడు.

ఇందుకు ఉగ్రదత్తుడూ, అరుద్రుడూ సరేనన్నట్టు తలలు వూపారు.

రుద్రుడు దేవదారు చెట్టు పైకి గబగబా పాకిపోయి, కొద్దిసేపటికల్లా వగరుస్తూ కిందికి దిగి వచ్చాడు.

ఉగ్రదత్తుడు ప్రశ్నించే లోపలే రుద్రుడు పడమటి దిక్కుకేసి చెయి వూపుతూ, ''ఇక్కడికి దాపులనే ఎవరిదో పెద్ద కోట వున్నది. కోటలో ఎక్కువగా వెలుగు లేదు. బురుజుల మీద ఎవరూ కాపలా వున్న సూచనలు కూడా కనబడటం లేదు.'' అన్నారు.

రుద్రుడి మాటల్లోని అదుర్దా గమనించిన ఉగ్రదత్తుడు, ''అయితే, నీ అభిప్రాయం, పులిరాయుళ్ళు ఆ కోటలో ఏమైనా దిగి వుంటారనా?'' అని అడిగాడు.

''ఆ సంగతి తేల్చి చెప్పటం కష్టం. ఆ కోటలో వుంటున్న వాళ్ళెవరైనా—



వాళ్ళు ఏమాత్రం జాగ్రత లేకుండా వుంటున్నారన్నదే నా వుద్దేశం. ఇంతకు ముందు మనం చూసిన పులిరాయుడు, ఆ కోటలోగాని దాని పరిసరాల్లోగాని దిగి వుంటే, చూసి హెచ్చరిక చేసే నాయ డెవడూ వున్నట్టు లేదు.'' అన్నాడు రుద్రుడు.

రుద్రుడికి కలిగిన సంశయం లాంటిదే ఉగ్రదత్తుడికి కూడా కలిగింది. తన కోట రక్షణను గురించి యింత నిర్లక్ష్యంగా వుంటున్న, ఈ కపిలపురం సామంతు డెవడా అని అతడు కొంచెంసేపు ఆలోచించాడు. తెల్లవారితేగాని, ఈ ప్రశ్నకు జవాబు దొరకదు. సూర్యోదయంతోపాటే లేచి,



తాను మొట్టమొదటగా చేయవలసిన పని ఈ సామంతరాజుకు, పులిరాయుళ్ల నుంచి రాబోయే ప్రమాదాన్ని గురించి చెప్పి, హెచ్చరించటం.

తరవాత కొద్ది సేపటికల్లా ప్రయాణ బడలికతో నీరసించి వున్న ఉగ్రదత్తుడూ, అతడి స్నేహితులూ చెట్టు కింద ఒళ్ళు మరిచి నిద్రపోయారు. సూర్యోదయం కాగానే అడవిలో జంతువులూ, పక్షులూ చేసే కలకలం వింటూనే వాళ్ళ గుర్రాలు పెద్దగా సకిలించి, గిట్టలతో భూమిని మోద సాగినై. ఆ చప్పుడుకు ఉగ్రదత్తుడూ, రుద్రారుద్రులూ ఉలిక్కిపడి లేచి కూర్చున్నారు.

ఇప్పుడు అరణ్యమంతా తెల్లని వెలుగుతో నిండిపోయివుంది. ఆకాశాన్నంటుతూన్న పెద్ద పెద్ద మానులూ, వాటి నుంచి వేలాడుతున్న పొడుగాటి ఊడలూ, వాటిని ఆధారం చేసుకుని ఒక చెట్టు మీది నుంచి మరొక చెట్టు మీదికి ఉరుకుతూన్న కోతులూ, రంగురంగుల పక్షులూ — అంతా ఎంతో మనోహరంగా వున్నది.

"ఈ ప్రాంతం మనం వుండే అరణ్య ప్రాంతంకన్న ఎంతో అందంగా వున్నది," అన్నాడు ఉగ్రదత్తుడు.

"అందుకనే, ఈ సామంతరాజెవరో యిక్కడ కోట కట్టుకుని వుంటాడు. పులిరాయుళ్ళకు కూడా ఈ మారుమూలనున్న అరణ్యప్రాంతం మరెవరి కంటా పడకుండా దాక్కోవటం కష్టం కాదు," అన్నాడు రుద్రుడు.

పులిరాయుళ్ళ పేరు వింటూనే ఉగ్రదత్తుడు లేచి నిలబడ్డాడు. అతడితోపాటు స్నేహితులిద్దరూ కూడా లేచి నిలబడి, "కోటకేనా ప్రయాణం? గుర్రాన్ని తెమ్మంటావా?" అని అడిగారు.

"గుర్రా లెందుకు! కోట సుమారుగా ఎంత దూరంలో వుంటుంది?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

"పావుకోసెడు దూరం కూడా వుండదని నా నమ్మకం. అయినా, నేను చీకట్లో

చెట్టు మీది నుంచి చూశాను. నేను ఊహించిన దానికన్న ఎక్కువ దూరం వుండినా వుండవచ్చు." అన్నాడు రుద్రుడు.

"ఎంత దూరం అయితే మనకేం? పదరా లెక్కచేయండి." అన్నాడు అరుద్రుడు.

ముగ్గురూ గుర్రాలు కట్టివేసి వున్న చెట్టు దగ్గిరకు వెళ్ళి, వాటి తాళ్ళు విప్పుతూన్నంతలో, అల్లంత దూరాన్నుంచి పెద్దగా ఆర్తనాదం వినబడింది.

అది వింటూనే స్నేహితులు ముగ్గురూ నిశ్చేష్టులయ్యారు. ఆ ఆర్తనాదం చేసినది ఒక స్త్రీ కంఠం.

"ఎవరో స్త్రీ ప్రమాదంలో చిక్కుకున్నట్టున్నది!" అన్నాడు రుద్రుడు.

"ఊం, త్వరగా రండి, పరిగెత్తండి!" అంటూ ఉగ్రదత్తుడు కత్తి దూసి ఆర్తనాదం వచ్చిన దిక్కుకేసి వేగంగా పరిగెత్త సాగాడు.

స్నేహితులు ముగ్గురూ కొంత దూరం పరిగెత్తేసరికి, చెట్ల వెనకగా కొన్ని మానవాకారాలు కనిపించినై. మరి కొంత దూరం ముందుకు వెళ్ళేసరికి, పట్టువస్త్రాలు ధరించి, సర్వాభరణాలతో వున్న ఒక యౌవనవతిని, నలుగురు పులిరాయుళ్ళు పట్టుకునేందుకు చేసే ప్రయత్నం వాళ్ళ కంటబడింది. ఆమె, ఆమె వెంట వున్న దాసీలూ పులిరాయుళ్ళకు చిక్కకుండా పారిపోయేందుకు ప్రయత్నిస్తూ, "రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెడుతున్నారు.

"భయం లేదు, వస్తున్నాం!" అంటూ ఉగ్రదత్తుడూ, రుద్రారుద్రులూ కేక పెట్టారు. ఆ మరుక్షణం చెట్ల కొమ్మల మీది నుంచి బిలబిలమంటూ కొందరు పులిరాయుళ్ళు వాళ్ళ మధ్యకు దూకారు. ఉగ్రదత్తుడూ, అతడి స్నేహితులూ, ఈ అనుకోని దాడికి నిశ్చేష్టులై తెప్పరిల్లే లోపలే, పులిరాయుళ్ళు వాళ్ళను నిరాయుధుల్ని చేసి, తాళ్ళతో కాళ్ళూ చేతులూ బిగించి, భయంకర పక్షుల కేసి లాక్కుపోయారు. —(ఇంకావుంది)









## 15

[పదిహేను సంవత్సరాల కాలం గడిచిపోయింది. ఇప్పుడు ఉగ్రదత్తుడూ, అతడి స్నేహితులైన రుద్రాచార్యుడులూ ఇరవై ఏళ్ళ యువకులు. వాళ్ళు ఒకనాడు అడవిలో తిరుగుతూండగా, ఒక స్త్రీ ఆర్తనాదం వినిపించింది. వాళ్ళు ఆమె రక్షణకోసం పరిగెత్తి వెళ్ళేసరికి, పులి రాయుళ్లు వాళ్ళను పట్టుకుని బంధించి భయంకర గుహలకేసి లాక్కుపోయారు. తరవాత—]

హఠాత్తుగా కనురెప్పపాటు కాలంలో జరిగిపోయిన ఈ దుస్సంఘటన ఉగ్రదత్తుణ్ణి నిశ్చేష్టుణ్ణి చేసింది. తనూ, తన స్నేహితులూ ముందు వెనుకలు ఆలోచించకుండా సరాసరి శత్రువులు పన్నిన ఉచ్చుల్లో తల దూర్చి, వాళ్ళ చేజిక్కారు. 'రక్షించండి' అంటూ ఆర్తనాదం చేసిన, ఆ యువతి కూడా ఈ దుర్మార్గుల పాలబడి వుంటుందా? లేక వీళ్ళ బారి నుంచి తప్పించుకుని కోట కేసి పారిపోయి వుంటుందా?

ఆ యువతి సురక్షితంగా యిక్కణ్ణించి తప్పించుకు పోగలగటం అసంభవం అని ఉగ్రదత్తుడికి వెంటనే తోచింది. ఆవిడ పెట్టిన కేకలూ, పులిరాయుళ్ళు చేసే అట్టహాసాలూ విని, ఎవరైనా కోటలో నుంచి బయటకు వస్తే తప్ప, తమకు ఈ దుర్మార్గుల నుంచి రక్షణ లేదు.




''రుద్రా!'' అంటూ ఉగ్రదత్తుడు కేక పెట్టాడు. అతడికి తన స్నేహితు లెక్కడున్నారో తెలియటం లేదు. ఇద్దరు పులిరాయుళ్ళు అతణ్ణి కొయ్యదుంగ మాదిరిగా భుజాన వేసుకుని పక్షి మీదికి ఎక్కించేందుకు ప్రయత్నిస్తున్నారు.

''ఉగ్రదత్తా! నా కాళ్ళూ చేతులూ కట్టి నన్ను భయంకర పక్షి మీదికి ఎక్కించారు. అరుద్రుడు కూడా, ఈ దుర్మార్గులకు దొరికిపోయాడు. నువ్వూ చిక్కిపోయావా?'' అంటూ రుద్రుడు కేక పెట్టాడు.

''నోళ్ళు ముయ్యండి!'' అంటూ ఒక పులిరాయుడు పెద్దగా అరిచి, ''మనకు ముచ్చటగా దొరికిన ఈ ముగ్గురూ మహా పసందైన మూర్ఖుల్లా వున్నారు. ఇక ఆ సామంతరాజు సుదర్శనుడి కూతురు చిత్రసేన తెలివితేటలెలాంటివో తెలుసుకోవాలి,'' అంటూ హేళనగా నవ్వాడు.

ఆ పులిరాయుడి మాటలవల్ల ఉగ్రదత్తుడికి ఆ యువతి ఎవరో తెలిసిపోయింది. వాడు విజయగర్వంతో ఒళ్ళు మరిచి, తనకు అడక్కుండానే ఆర్తనాదం చేసిన యువతి సమాచారం అంతా చెప్పేశాడు. బహుశా ఈ పులిరాయుడూ మూర్ఖుడే అయి వుంటాడు, అనుకున్నాడు ఉగ్రదత్తుడు.

ఇంతలో కోటవైపునుంచి పెద్ద కలకలం వినబడింది. గుర్రాల సకిలింపులూ, రౌతులు పెట్టే కేకలూ వింటూనే, ఉగ్రదత్తుడు తమకు సహాయం వస్తున్నదనుకున్నాడు. రాజకుమార్తె చంద్రసేన కేకలు కోటలోవాళ్ళకు వినబడి వుంటవి. తనను బంధించిన తాళ్ళు తెగగొట్టుకోగలిగితే ఎంత బావుండును!

ఉగ్రదత్తుడు, కాళ్ళూ, చేతులూ ఆడిస్తూ పెనగులాడటంప్రారంభించేసరికి, ఒక పులిరాయుడు భీకరంగా అరుస్తూ, అతడి గుండెల మీద ఈటె ఆనించి, ''కదిలావో, ఈటె గుండెలోకి దిగుతుంది, జాగ్రత్త!'' అన్నాడు.




ఆ వెంటనే భయంకరపక్షి రివ్వున గాలిలోకి లేచింది. ఉగ్రదత్తుడు ఆ ఊపుకు పక్షి మీద అటూ యిటూ వూగిస లాడుతూ, "సమయం మించిపోయింది. ఈ క్రూరులు మమ్మల్ని జ్వాలాద్వీపం తీసుకుపోతున్నారు," అనుకున్నాడు.

చూస్తూండగానే భయంకర పక్షులు ఆకాశంలోకి చాలా ఎత్తు ఎగిరి మేఘాల మీదుగా తూర్పుదిశకేసి పోసాగినై. పక్షుల వేగానికి గాలి రివ్వురివ్వుమంటూ ఉగ్రదత్తుణ్ణి తాకసాగింది. అతడు పక్షి వెన్ను మీద అటూయిటూ ఒరుగుతున్నాడు. జారి కిందికి పడిపోకుండా ఒక పులిరాయుడు అతడి నడుం గట్టిగా పట్టుకున్నాడు.

ఇలా కొద్దికాలం జరిగింది. పక్షులు క్రమంగా కిందికి దిగుతున్నట్టు ఉగ్రదత్తుడికి తోచింది. గాలి హఠాత్తుగా వేడెక్కిపోయింది. శరీరాన్ని ఏవో మంటలు తాకుతున్నట్టుగా అతడు భ్రమపడ్డాడు. అంతలో, "శత్రువులు! భల్లూకరాయుళ్లు! చంద్రసేనా, ఇతర బంధితులు వున్న పక్షుల్ని జాగర్తగా కిందికి చేర్చండి. తతిమ్మావాళ్ళు భల్లూకరాయుళ్ళను ఎదుర్కోండి!" అన్న కేక వినబడింది.

"ఓహో! జ్వాలాద్వీపంలో కూడా రెండు శత్రు పక్షాలున్నవన్న మాట!" అనుకున్నాడు ఉగ్రదత్తుడు. ఈ సంగతి తెలియగానే అతడికి ఎక్కడలేని ఉత్సాహం కలిగింది. కాని, వాళ్ళూ వాళ్ళూ భయంకర పక్షుల మీద ఆకాశంలో చేసే యుద్ధంలో, నేనూ, నా మిత్రులూ కిందపడి ముక్కలు ముక్కలై మరణించం గదా? అన్న భయం కూడా అతడికి కలిగింది.

హఠాత్తుగా ఉగ్రదత్తుడున్న భయంకర పక్షి మెడసాచి భూమి మీదికి వేగంగా దిగసాగింది. ఉగ్రదత్తుడు తల ఎత్తి పైకి చూశాడు. ఎలుగ్గొడ్డు చర్మాలు ధరించి, పెద్ద పెద్ద ఈటెలు పట్టుకుని వున్న కొందరు, తాము ఎక్కివున్న భయంకర పక్షులను పులిరాయుళ్ల మీదికి ఉసికొల్పు




తున్నారు. చూస్తూండగానే ఆకాశంలో పులిరాయుళ్ళకూ భల్లూకరాయుళ్ళకూ భయంకర యుద్ధం ప్రారంభమయింది. ఈటె దెబ్బలు తిని, బాధతో మూలుగుతూ కొందరు రౌతులు పక్షుల మీది నుంచి కిందికి పడసాగారు. రౌతులను కోల్పోయిన పక్షులు, రెక్కలు టపటపలాడిస్తూ, కేకలు పెడుతూ అన్ని దిక్కులకూ పారిపోతున్నవి.

ఇంతలో ఉగ్రదత్తుడున్న పక్షి ఒక కొండ పైభాగాన దిగింది. ఆ పక్షి మీద వున్న ఇద్దరు పులిరాయుళ్లూ కిందికి దిగి, ఉగ్రదత్తుణ్ణి పక్షి మీది నుంచి ఎత్తి, చాప చుట్టను పారవేసినట్టు కిందికి విసిరివేశారు. అదృష్టవశాత్తూ అతడు ఎత్తుగా పెరిగిన పచ్చగడ్డి, దుబ్బుచెట్లూ వున్న చోట పడటంతో, శరీరానికి పెద్ద గాయాలేమీ తగలలేదు. కాని, అతడికి ప్రాణం కడబట్టినంత పనయింది.

ఒక పులిరాయుడు అతణ్ణి సమీపించి కాలితో అటూయిటూ కదిలించి చూస్తూ, "వీడు చచ్చినట్టున్నది!" అన్నాడు. అందుకు రెండవ పులిరాయుడు పెద్దగా నవ్వి, "వీడు బతికివున్నా, చచ్చినా మనకు ఒకటే. రాజకుమార్తె సురక్షితంగా మన నాయకుడి భవనం చేరింది. వీడి సంగతి తరవాత చూద్దాం. ముందు కంధుడి అనుచరుల పని తేల్చాలి, రా," అంటూ భయంకర పక్షి కేసి పరిగెత్తాడు.

పులిరాయుళ్ళ సంభాషణ ఆలకిస్తూ, ఉగ్రదత్తుడు కదలా మెదలక పూరుకున్నాడు. తను బతికి వున్నట్టు వాళ్ళకు అనుమానం కలిగితే, ఒకవేళ వాళ్ళు తనను చంపవచ్చు. కంధుడనేవాడు ఈ పులిరాయుళ్ళకు శత్రువులైన భల్లూకరాయుళ్ళకు నాయకుడు. సామంతరాజు సుదర్శనుడి కుమార్తె చంద్రసేనను పులిరాయుళ్ళు క్షేమంగా తమ నాయకుడి, ఇంటికి చేర్చారు.

తన కాళ్లూ చేతుల్ని కట్టివున్న తాళ్లను తెగగొట్టుకునేందుకు ఉగ్రదత్తుడు గట్టి



ప్రయత్నం చేశాడు. కాని, అతడి పెనగులాటవల్ల తాళ్ళు మరింతగా బిగుసుకుపోయి, ఎక్కడ లేని బాధ కలిగించినై.

''ఇక నేను చేయగలిగిందేమీ లేదు. ఎవరైనా వచ్చి నన్ను రక్షించవలసిందే. బహుశా రుద్రారుద్రులు కూడా నేనున్న నిస్సహాయ స్థితిలోనే వుండి వుంటారు,'' అనుకున్నాడు ఉగ్రదత్తుడు నిస్పృహగా.

ఆకాశంలో మరో పావుగంట కాలం ఇరుపక్షాల మధ్య భయంకర యుద్ధం సాగింది. చివరకు కొన్ని పక్షులు పడమటి దిక్కుగా పారిపోతూండటం, వాటిని తరుముతూ మరికొన్ని వెళ్ళటం ఉగ్రదత్తుడు చూశాడు.

సూర్యుడు క్రమంగా ఆకాశం మధ్యకు వచ్చాడు. ఎండ తీవ్రమయింది. ఉగ్రదత్తుడి నాలుక దాహంతో పిడచకట్టుకుపోసాగింది.

''ఆకలితో, దాహంతో బాధపడి నేనిక్కడ మరణించక తప్పదు.'' అనుకున్నాడు ఉగ్రదత్తుడు. తనను అక్కడ వదిలిపోయిన శత్రువులు వచ్చినా, తన ప్రాణానికి కొంత రక్షణ కలగవచ్చునన్న భావం అతడికి కలిగింది. వాళ్ళు తన సంగతే మరిచిపోయారా? లేక భల్లూకరాయుళ్ళతో జరిగిన యుద్ధంలో మరణించారా?

ఉగ్రదత్తుడు యిలా మథనపడుతూన్నంతలో, పక్కనే వున్న చెట్లలో ఏదో అలికిడి అయినట్టు అతడికి అనుమానం కలిగింది. ఉన్నచోటు నుంచి, ఆ ధ్వని వచ్చిన వైపుకు పొర్లి, చెట్లలోకి పరీక్షగా చూశాడు. అక్కడ కనిపించిన దృశ్యం అతడికి భీతి కలిగించింది. నిలువెల్లా వణికిపోయాడు.

రెండు తోడేళ్ళు చెట్లచాటున నిలబడి అతడి కేసి చూస్తూ డొక్కలు ఎగరవేస్తున్నవి. నాలుకలు చాస్తున్నవి. అతడిలో యింకా జీవం వున్నదా, లేక మరణించాడా అన్న సంశయంలో అవి కొట్టుమిట్టాడుతున్నట్టు ఉగ్రదత్తుడికి తోచింది. తను

నిస్సహాయ స్థితిలో వున్నట్టు అవి గ్రహిస్తే, తన మీదకు తప్పక లంఘించి తీరుతవి.

ఉగ్రదత్తుడు ఎక్కడ లేని సత్తువా తెచ్చుకుని, మోచేతుల బలంతో నేల మీది నుంచి కొంచెం లేచి, పెద్ద గొంతుతో కేక పెట్టాడు. ఆ కేక వింటూనే తోడేళ్ళు చెట్లల్లోకి పారిపోయినై. ప్రస్తుతానికి అపద గడిచింది, అనుకుని ఉగ్రదత్తుడు పెద్దగా నిట్టూర్చాడు.

సూర్యుడు క్రమంగా పడమటి దిక్కుకు దిగి కొండ శిఖరాల వెనుకకు పోయాడు. ఉగ్రదత్తుడున్న ప్రదేశం కొంచెం కొంచెమే చల్లబడసాగింది. అతడి కిప్పుడు దాహంతో పాటు ఆకలి కూడా ప్రారంభమయింది. ఏదో మత్తులాటిది తన శరీరాన్ని కమ్ముకుంటున్నట్టు అతడు భావించాడు. మైకంలో వుండగా తోడేళ్ళు తప్పక నన్ను కబళించగలవు అనుకున్నాడు ఉగ్రదత్తుడు. కాని, మెలకువగా వుండాలన్న అతడి ప్రయత్నం వృథా అయింది. అతడు మగతనిద్రలోకి జారుకున్నాడు.

ముఖాన్నీ, నడుమునూ ఏవో బలమైన గోళ్ళు తాకినట్టయి ఉగ్రదత్తుడు ఉలిక్కిపడి లేచాడు. ఆ మరుక్షణం దూరంగా కేకలు వినిపించినై. ఉగ్రదత్తుడు కూడా అప్రయత్నంగా కీచుమని అరిచాడు.




మసక వెలుతురులో అతడికి తన మీది నుంచి కుప్పించి ఎగిరి అల్లంత దూరంలో వున్న చెట్లలోకి పారిపోతున్న నల్లని ఆకారం ఒకటి కనిపించింది. అది ఎలుగుబంటి!

ఉగ్రదత్తుడు నిశ్చేష్టుడయాడు. ఎవరో దూరం నుంచి వేసిన కేకలు విని, భయపడి ఎలుగు తనకు హాని చేయకుండా పారిపోయింది. ఆ కేకలు పెట్టినవాళ్ళు ఎవరై వుంటారు?

"ఇదుగో, రండి, రండి. ఇక్కడ పొదల మధ్య పడివున్నాడు. ఎలుగుబంటి భయపడి పారిపోయింది." అంటూ ఒకరు ఉగ్రదత్తుడి దగ్గిరకు పరిగెత్తుకు వచ్చారు.

అతడి చేతిలో పెద్ద ఈటె ఒకటి వున్నది. వాడు ఎలుగుబంటి చర్మాలు ధరించి వున్నాడు.

ఉగ్రదత్తుడు మూలుగుతూ తల ఎత్తి, ''ఈ కట్లు విప్పండి. దాహం తీర్చుకునేందుకు నీరు ఏమైనా వుంటే యివ్వండి,'' అని అడిగాడు బొంగురుపోయిన గొంతుతో.

భల్లూకరాయుడు మారు మాటాడకుండా ఉగ్రదత్తుడి కట్లు విప్పసాగాడు. ఇంతలో మరిద్దరు భల్లూకరాయుళ్లు అక్కడికి వచ్చారు. వాళ్ళల్లో ఒకడి దగ్గిర భుజానికి వేలాడుతున్న సొరకాయబుర్ర వున్నది. ఉగ్రదత్తుడు దాని కేసి వేలు చూపుతూ, దాహం అని సొంజ్ఞ చేశాడు. భల్లూకరాయుడు సొరకాయ బుర్రకు వున్న బెండును వూడదీసి, బుర్రను ఉగ్రదత్తుడి నోటికి అందించాడు. ఉగ్రదత్తుడు ఆత్రంగా గటగట నీరు తాగి, యిక చాలునన్నట్టు తల ఆడించాడు.

దాహం తీర్చుకోవటంతోనే ఉగ్రదత్తుడికి ప్రాణం తిరిగి వచ్చినట్టయింది. ఇంతలో అతడి కాళ్ళకూ, చేతులకూ వున్న కట్లు కూడా విప్పబడినై. ఉగ్రదత్తుడు కాళ్ళూ, చేతులను అటూ యిటూ సాగదీసుకున్నాడు. వాటిల్లో రక్తప్రసారం తిరిగి ప్రారంభమై, అవి స్వాధీనానికి వచ్చినై.

''లేచి నడవగలవా?'' అని ఒక భల్లూకరాయుడు అతణ్ణి అడిగాడు.

''మీరు శత్రువులా, మిత్రులా?'' అని అడిగాడు ఉగ్రదత్తుడు.

''ఆ సంగతి నువ్వు మా నాయకుడికిచ్చే జవాబులను బట్టి ఆయనే నిర్ణయిస్తాడు.'' అన్నాడు భల్లూకరాయుడు.

''సరే, పదండి!'' అంటూ ఉగ్రదత్తుడు లేచి నిలబడ్డాడు. భల్లూకరాయుళ్ళు ముగ్గురూ అతణ్ణి వెంటబెట్టుకుని, చెట్లల్లో కొంతదూరం నడిచి, ఎగుడు దిగుడుగా వున్న కొండరాళ్ళ మధ్య గల ఒక బల్లపరుపు రాతిని ఎత్తి, బిలం లోపలకు దిగి, తిరిగి రాతిని ఎప్పటిలా జాగ్రత్తగా మూసేశారు. —(ఇంకావుంది)





# జ్వాలాద్వీపం

## 16

[ఉగ్రదత్తుణ్ణీ, అతడి స్నేహితులైన రుద్రాదుల్ని తీసుకుని పులిరాయుళ్ళు, భయంకర పక్షుల మీద జ్వాలాద్వీపానికి బయలుదేరారు. వాళ్ళను ఆకాశంలో భల్లూకరాయుళ్ళు భీకరంగా ఎదుర్కొన్నారు. ఉగ్రదత్తుడున్న భయంకర పక్షి ఒక కొండ మీద దిగింది. అక్కడ కొందరు భల్లూకరాయుళ్ళు అతణ్ణి వెంటబెట్టుకుని, ఒక రహస్య బిలంగుండా బయలుదేరారు. తరవాత—]

భల్లూకరాయుళ్ళు బిల ద్వారాన్ని మూయగానే, లోపల అంతా గాఢాంధకారమయింది. ఉగ్రదత్తుడు అడుగు వేయబోయి కాలు జారటంతో ముందుకు పడబోయాడు. కాని, అంతలోనే ఒక భల్లూకరాయుడు అతడి భుజం పట్టుకుని ఆపుతూ, "తొందరపడకు, మనం యిరవై మెట్లు దిగిగాని, బిలం అడుగు భాగాన్ని చేరలేం. ఇదుగో, మనకు దారి చూపే వెలుగు!" అంటూ కట్టుకున్న ఎలుగు చర్మాల్లో నుంచి ధగధగ ప్రకాశిస్తున్న ఒక మణిని బయటికి తీశాడు. ఆ వెంటనే, అతడి అనుచరు లిద్దరూ కూడా తమవద్ద వున్న మణులను బయటికి తీసి, మెట్లు దిగసాగారు.

భల్లూకరాయుళ్ళ చేతుల్లో మెరిసిపోతున్న మణులను చూస్తూనే ఉగ్రదత్తుడు ఎంతో ఆశ్చర్యపడ్డాడు. చీకటిలో









దారి చూసుకునేందుకు కాగడాలూ, కొవ్వొత్తులూ లేనందున, ఈ వెల లేని మణులను వీళ్ళు కాగడాలుగా వాడుకుంటున్నారన్నమాట.

"ఈ ద్వీపంలో చమురు దొరకదా? వెలుగు కావాలంటే, ఈ మణులు తప్ప మరో సాధనం లేదా?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

"చమురా? ఏమిటది? ఓహో, దాన్ని గురించి యిక్కడకు బానిసలుగా వచ్చిన మీ దేశంవాళ్ళు చెప్పగా విన్నాం," అన్నాడొక భల్లూకరాయుడు.

"ఇది చాలా చిత్రమైన ద్వీపం," అనుకున్నాడు ఉగ్రదత్తుడు. అంతలోనే అతడికి పులిరాయుళ్ళ చేజిక్కిన తన స్నేహితులు రుద్రారుద్రులూ, సామంతరాజు సుదర్శనుడి కుమార్తె చంద్రసేనా గుర్తుకువచ్చారు.

ఉగ్రదత్తుడు వాళ్ళను గురించి ఆలోచిస్తూనే, ఐరవై మెట్లు దిగి, బిలం అడుగు భాగాన్ని చేరాడు. బిలం ఏమంత విశాలమైనది కాదు. దాని వెడల్పు ఒక గజం కన్న ఎక్కువ వుండదు. ఎత్తు కొన్నిచోట్ల అయిదడుగులూ, మరికొన్ని చోట్ల పదడుగుల వరకూ వుంటుంది.

"ఈ బిలం ఎక్కడికి పోతుంది? ఇంతకూ మీరు నన్ను పులిరాయుళ్ళ నుంచి కాపాడింది, మరొక భల్లూకరాయుడికి బానిసగా అమ్మేందుకు కాదు గదా?" అన్నాడు ఉగ్రదత్తుడు.

భల్లూకరాయుళ్ళలో ఒకడు నవ్వాడు, మరొకడు కోపంగా గద్దించాడు. మూడవ వాడు, ఉగ్రదత్తుడికేసి చూస్తూ, "నిన్ను బానిసగాచేసేందుకే తీసుకుపోతున్నవాళ్ళమయితే, నీకీ బిలమార్గం తెలియకుండా కళ్ళకు గంతలు కట్టి వుండేవాళ్ళం. మనుషుల్ని బానిసలుగా వుపయోగించుకునేవాళ్ళం మేం కాదు, పులిరాయుళ్ళు. అయినా మీ దేశం వాళ్ళనందర్నీ నమ్మేందుకు లేదు. మీవాళ్ళే కొందరు బానిసల్ని పట్టుకొచ్చేందుకు, పులిరాయుళ్ళ నాయకు

రైన ఏకపాదుడికి సహాయం చేస్తున్నారు. నాగవర్మ అనేవాడు నీకు తెలుసా?'' అని అడిగాడు.

''తెలుసు. వాడు....'' ఉగ్రదత్తుడు మాట ముగించేలోపలే, మరొక భల్లూక రాయుడు మొదటివాణ్ణి గట్టిగా కసురుతూ, ''నువ్వు చాలా అధికప్రసంగి వవుతున్నావు. మన నాయకుడు చెప్పి పంపిన దేమిటి? మరిచిపోయావా?'' అన్నాడు తీవ్రంగా.



మొదట మాట్లాడిన భల్లూకరాయుడు కుక్కినపేనులా అయిపోయాడు. మణులను అరచేతిలో పెట్టుకుని ముందు ఇద్దరు భల్లూకరాయుళ్ళూ, మధ్య ఉగ్రదత్తుడూ, అతడికి వెనకగా మరొక భల్లూక రాయుడూ మౌనంగా బిలం వెంట నడవ సాగారు. రెండు మూడు నిమిషాల కాలం అలా నడిచేసరికి, ఎదురుగా బిలం మూసుకుపోయినట్టు, అడ్డంగా నిలువెత్తు రాయి ఒకటి కనిపించింది. ముందు నడుస్తున్న భల్లూకరాయుడు, అక్కడ ఆగి, రాతిలో కొంచెం పల్లంగా వున్నచోట చూపుడు వేలితో నొక్కాడు. రాయి కొంచెం కదిలినట్టయింది. ఆ వెంటనే దాని వెనక నుంచి, 'శరభం!' అన్న పిలుపు విన వచ్చింది. దానికి జవాబుగా ముందున్న భల్లూకరాయుడు, 'భల్లూకం!' అన్నాడు పెద్దగా. రాయి తలుపులా కిర్రుమంటూ కొద్దిగా తెరుచుకున్నది. ఎలుగుబంటి చర్మాలు ధరించి, పెద్ద కత్తి నొకదాన్ని పట్టుకొనివున్న భటుడొకడు రాతి తలుపు పక్కనుంచి తొంగి చూశాడు.

'శరభం', 'భల్లూకం' అన్న మాటలు ఆ రాత్రికి భల్లూకరాయుళ్ళు నిర్ణయించుకున్న సంకేతాలని ఉగ్రదత్తుడు గ్రహించాడు. వీళ్ళు కూడా ఇరవైనాలుగ్గంటలూ శత్రుభయంతో సతమతమైపోతున్నారని అతడు ఊహించాడు.

''ఒక్కడేనా దొరికింది! తతిమ్మావాళ్ళే మయూరు?'' అన్నాడు కావలి భటుడు కోపంగా.



"వాళ్ళ సంగతి మాకేమీ తెలియదు. అయినా, గబ్బిలాయిలా బిలాన్ని అంటి పెట్టుకుని వుండే నీకు ఈ వైనాలన్నీ ఎందుకు ?" అంటూ ముందున్న భల్లూక రాయుడు, రాతి తలుపును సాంతం తెరిచి ముందుకు వెళ్ళాడు.

అతడి వెనకగా మిగిలినవాళ్ళు కూడా బయలుదేరారు.

ఉగ్రదత్తుడు, భల్లూకరాయుళ్ల వెంట బిలంలో చాలా దూరం నడిచాడు. అయినా, దానికి అంతం వున్నట్టు కనబడ లేదు. బిలంలో అనేకచోట్ల పైనుంచి వెలుగు పడుతున్నట్టూ, కొన్ని కొన్ని ప్రాంతాల్లో ఎవరో, బిలం గోడల వెనుక మాటలాడుతున్నట్టు కూడా అతడికి అనుమానం కలిగింది. ఈ భల్లూకరాయుళ్ళ నాయకుడు కంధుడు పులిరాయుళ్ళ ధాటికి తట్టుకోలేక, ఇలాంటి రహస్య ప్రదేశాల్లో కాలం గడుపుతున్నాడని ఉగ్రదత్తుడు అనుకున్నారు.

హఠాత్తుగా ముందు నడుస్తున్న భల్లూక రాయుడు ఆగి, తన అరచేతిలో వున్న మణిని గట్టిగా గుప్పెటలో బిగించి, దాన్ని నేలబారుగా నాలుగైదుసార్లు వూపాడు. ఆ వెంటనే భూమి బద్దలవుతున్నట్టు పెద్ద ధ్వని అయింది. చూస్తూండగానే భల్లూక రాయుడి పాదాల దగ్గిర భూమి విచ్చి నట్టయి, అందులో నుంచి ఉన్నట్టుండి కళ్ళను మిరుమిట్లు కొలిపేలా వెలుగు పైకి వచ్చింది.

"ఇక్కడ అరవైఒక్క మెట్లున్నవి! జాగ్రత్త, కాలు జారిందో!..." అంటూ ఒక భల్లూకరాయుడు ఉగ్రదత్తుణ్ణి హెచ్చరించి, మెట్లు దిగసాగాడు. ఉగ్రదత్తుడి ఆశ్చర్యానికి అంతులేదు.

బిలం మధ్యలో ఒక పెద్ద అగాధం, అందులో నుంచి పట్టపగలులా వెలుగు!

ఉగ్రదత్తుడూ, అతడి వెంట వున్న వాళ్ళూ మెట్లు దిగి, సమతలంగా వున్న ప్రదేశాన్ని చేరారు. ఆ ప్రదేశానికి చుట్టూ వున్న గోడలలో తాపడం చేసిన మణుల



నుంచి దేదీప్యమానంగా కాంతి వస్తున్నది. ఎదురుగా నిలువెత్తున ద్వారం ఒకటి వున్నది. దాని తలుపులు బంధించబడి వున్నవి. ఉగ్రదత్తుడి వెంట వచ్చిన భల్లూకరాయుళ్ళలో ఒకడు, ఆ తలుపుల దగ్గరకు వెళ్ళి, వాటి మీద గుప్పెటతో, మూడుసార్లు గట్టిగా కొట్టాడు. వెంటనే ద్వారాలు తెరుచుకున్నవి. ఎదురుగా వున్న ఒక ఉన్నతాసనం మీద శిరస్త్రాణంలో ఎలుగుబంటి చెవులు ధరించి వున్న, ఒక దృఢకాయుడు కూచుని వున్నాడు.

భల్లూకరాయుడు అతడి దగ్గరకు వెళ్ళి, మందస్వరంలో ఏదో చెప్పాడు. ఆసనం మీద కూచున్న వ్యక్తి, ఉగ్రదత్తుడి కేసి దృష్టి సారించి, తల పంకిస్తూ భల్లూకరాయుడితో ఏమో అన్నాడు. వెంటనే భల్లూకరాయుడు ఉగ్రదత్తుడున్న చోటుకు వచ్చి, "ఆయన, మా నాయకుడు కంధుడు. నిన్ను దగ్గరకు తీసుకు రావలసిందిగా చెప్పారు." అన్నాడు.

ఉగ్రదత్తుడు నిర్భయంగా, కంధుడి ఎదుటకు వెళ్ళి నిలబడ్డాడు. కంధుడు అతణ్ణి నిశితంగా చూస్తూ, "నీతోబాటు మీ దేశాన్నుంచి పులిరాయుళ్ళచే అపహరించుకు రాబడిన వాళ్ళెందరు?" అన్నాడు.

"నలుగురం. ఒకామె స్త్రీ." అన్నాడు ఉగ్రదత్తుడు.

"వాళ్ళెక్కడున్నారో, నీకైనా తెలుసా?" అని అడిగాడు కంధుడు.

"తెలియదు," అంటూ ఉగ్రదత్తుడు ఆశ్చర్యపోయాడు. కంధుడు యిలాంటి ప్రశ్నలు తనను ఎందుకడుగుతున్నాడో, వీటి వెనక వున్న రహస్యం ఏమిటో అతడికి అవగాహన కాలేదు.

ఉగ్రదత్తుడు తనను గురించే ఆలోచిస్తున్నాడని గ్రహించినవాడిలా కంధుడు చిరునవ్వునవ్వి, "నేను, మీకు మిత్రుణ్ణి. మీ దేశాన్నుంచి మనుషుల్ని అపహరించుకురావటంలో నా కెలాంటి ప్రమేయం




లేదు. పులిరాయుళ్ళు మీ కెంత శత్రువులో, నాకూ అంతే శత్రువులు. కొండ గుహల్లో, బిలాల్లో నేనూ, నా అనుచరులూ ఎంత రహస్యంగా కాలం గడపవలసి వస్తున్నదో నువ్వే చూశావుగదా? మీ దేశానికి, ఈ జ్వాలాద్వీపానికి మహమ్మారిలా దాపురించిన ఏకపాదుణ్ణీ, అతడి భటులనూ సర్వనాశనం చేయటానికే, నేనూ, మీ దేశస్థుడైన మరొక వ్యక్తీ ఒక పథకం ఆలోచించాం. బహుశా ఆ వ్యక్తిని నువ్వు గుర్తించగలవేమో చూద్దాం.'' అంటూ తన అనుచరులలో ఒకడికి సౌంజ్ఞ చేశాడు.

కంధుడి అనుచరుడు తమ నాయకుడి ఆసనానికి వెనకగా వున్న ఒక తలుపు తెరిచాడు. ఆ వెంటనే రుద్రుడు నవ్వుతూ ఉగ్రదత్తుణ్ణి సమీపించి, ''నిన్ను ప్రాణాలతో చూడగల ననుకోలేదు, ఉగ్రదత్తా!'' అన్నాడు ఆప్యాయంగా.

''రుద్రుడు!'' అంటూ ఉగ్రదత్తుడు పరమానంద భరితుడై, ''ఆరుద్రుడెక్కడ? చంద్రసేన ఏమయింది?'' అని ఆత్రుతగా ప్రశ్నించాడు.

''ఆ యిద్దరూ పులిరాయుళ్ళ అధీనంలోనే వున్నారు. నేను మాత్రం ఈ కంధుడి అనుచరులవల్ల రక్షించబడ్డాను,'' అన్నాడు రుద్రుడు నిస్పృహగా.

కంధుడు లేచి నిలబడి ఉగ్రదత్తుడితో, ''నీ గురించి రుద్రుడి ద్వారా సర్వం తెలుసుకున్నాను. ఈనాటికి ఏకపాదుణ్ణీ, అతడి మూకనూ నాశనం చేసే అవకాశం కలిగింది. నేనూ నీ స్నేహితుడైన రుద్రుడూ వేసిన పథకం మరేం లేదు. నీ పెంపుడు తండ్రి అయిన ఉగ్రాక్షుణ్ణీ, అతడి సేవకులనూ ఈ ద్వీపం చేర్చి, వాళ్ళ సహాయంతో ఏకపాదుడి కోటను ముట్టడించటం,'' అన్నాడు.

''మీ స్వాధీనంలో వున్న భయంకర పక్షులు మహా కాయులైన రాక్షసులను మోయగలవా?'' అని అడిగాడు ఉగ్రదత్తుడు అనుమానంగా.

"అంత పెద్ద మహాకాయుల్ని మోసే శక్తి వాటికి లేదు. ఏ బంధు గణమంతా పడవల్లో బయలుదేరి ఇక్కడికి రావల సిందే," అన్నాడు కంధుడు.

"నేను బందీగా వచ్చేప్పుడు, ఈ ద్వీపాన్ని, దీని చుట్టూ సముద్రం అంచుల వరకూ వున్న అగ్ని పర్వతాలనూ చూశాను. అగ్ని పర్వతాల నుంచి వెలువడిన లావా ద్రవం సముద్రతీరాన్నంతా మంటల మయం చేస్తున్నట్టు నాకు కనబడింది. అలాంటి స్థితిలో పడవలు తీరాన్నెలా చేరగలవు?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

ఈ ప్రశ్న వింటూనే కంధుడు నవ్వి, తన అనుచరులకేసి సగర్వంగా చూస్తూ, "సముద్రతీరంలో మంటలపాలు కాకుండా, పడవలను ఒడ్డుచేర్చే కొన్ని ప్రదేశాలు నా అనుచరులకు తెలుసు. అసలు ప్రమాదం ఏకపాదుడి కోటను ముట్టడించటంలో వున్నది. ఆ తరవాత వాడు దొరికినా వాణ్ణి చంపటంలో మరింత పెద్ద ప్రమాదం వున్నది!" అన్నాడు.

కంధుడి మాటలు ఉగ్రదత్తుడికి సంభ్రమాశ్చర్యాలు కలిగించినై. అది గ్రహించిన కంధుడు అతణ్ణి తన వెంట పెట్టుకుని, ఒక రహస్య మార్గం గుండా బిలంలో నుంచి కొండ పైభాగానికి తీసుకుపోయి, "అదుగో, ఆ మంటల మధ్య వున్నట్టు కనబడేది ఏకపాదుడి కోట. ఇక్కణ్ణించి చూసినప్పుడు అది మంటల మధ్య వున్నట్టు కనబడినా, నిజానికి దాని చుట్టూ అగ్ని పర్వతాలు లేవు. దాన్ని చేరేందుకు సురక్షితమైన ఒక మార్గం వున్నది. కాని, కోట మనం ఆక్రమించుకున్నా ఏకపాదుణ్ణి చంపటమే పెద్ద సమస్య!" అన్నాడు.

"మన చేతిలో వాడు చిక్కటమంటూ జరిగితే, వాణ్ణి చంపటం ఎంతసేపు!" అన్నాడు ఉగ్రదత్తుడు.

"వాడికి తిరుగులేని ఒక అద్భుత శక్తి వున్నది. అదేమిటంటే: వాడెవరి నెత్తురు చూసినా, లేక వాడి నెత్తురు ఎవరు చూసినా—తప్పక మరణిస్తారు!" అన్నాడు కంధుడు.

—(ఇంకా వుంది)









## 17

[భల్లూకరాయుళ్ళు ఉగ్రదత్తుణ్ణి తమ నాయకుడైన కంధుడి దగ్గిరకు తీసుకుపోయారు. కంధుడు ఉగ్రదత్తుడితో ఏకపాదుణ్ణి చంపేందుకు రాకినుల సహాయం కావాలని చెపుతూనే, ఏకపాదుణ్ణి చంపటం అంత సులభంగా సాధ్యమయే పని కాదనీ, వాడెవరి నెత్తురు చూసినా, లేక వాడి నెత్తురు ఎవరు చూసినా—మరుక్షణమే తప్పక మరణిస్తారనీ అన్నాడు. తరవాత—]

పులిరాయుళ్ళ నాయకుడైన ఏకపాదుడికి గల అపూర్వశక్తిని గురించి వినగానే ఉగ్రదత్తుడు నిలువెల్లా కంపించి పోయాడు. ఏకపాదుణ్ణి హతమార్చకుండా తనుగాని, తన స్నేహితులుగాని ఈ జ్వాలాద్వీపాన్ని వదలటం సాధ్యం కాదు. అంతేకాక సామంతరాజైన సుదర్శనుడి కుమార్తె చంద్రసేన కూడా ఆ దుర్మార్గుడి అధీనంలోనే వున్నది.

''ఆ దుర్మార్గుణ్ణి చంపటం అనేది చాలా గడ్డుసమస్య. ఒకసారి వాణ్ణి, నా భటులు ఒంటరిగా దొరకపుచ్చుకున్నారు. కాని, వాళ్ళు ఈటెలు ఎత్తి వాణ్ణి గుండెల్లో పొడవబొయ్యేలోపలే, వాడు తన కత్తితో ముఖం మీద గాటు వేసుకున్నాడు. ఆ నెత్తురు చూస్తూనే, నా భటులందరూ అక్కడే మరణించారు.'' అన్నాడు కంధుడు.



"అయితే, మనం వాడి ఎదట పడటం లోనే ప్రమాదం వున్నదన్నమాట! అయితే యిక వాణ్ణి చంపటం ఎలా?" అన్నాడు ఉగ్రదత్తుడు నిస్పృహగా.

రుద్రుడు, ఏకపాదుడి కోట కేసి సాలోచనగా చూస్తూ, "ఒకసారి మనం ఆ కోటను చుట్టుముట్ట గలిగితే, తరవాత వాణ్ణి చంపటం ఎలాగో ఆలోచించవచ్చు. ఆ సమయానికి ఏదో ఒక ఉపాయం తోచక పోదు. ఉగ్రాక్షుడు పెద్ద జిత్తులమారి!" అన్నాడు.

"బహుశా నా పెంపుడు తండ్రి చచ్చినా ఫరవా లేదనుకుంటున్నట్టున్నది, ఈ రుద్రుడు!" అనుకున్నాడు ఉగ్రదత్తుడు తన మనస్సులో. కాని, కంధుడు చెప్పినట్టు తను తన పెంపుడు తండ్రి సహాయం కోరక తప్పదు. బలవంతులూ, ప్రాణభయం లేనివాళ్ళూ అయిన తన రాక్షస బంట్లు వచ్చి పాల్గొననిదే భయంకర పక్షుల్నీ, పులిరాయుళ్ళనూ ఓడించటం సాధ్యం కాదు.

ఉగ్రదత్తుడు యిలా ఆలోచిస్తూ వుండగా కంధుడు అతణ్ణి సమీపించి, "ఉగ్రదత్తా, నీ నిర్ణయం ఏమిటి? నీ పెంపుడు తండ్రి నుంచి సహాయం కోరుతూ వార్త పంపటమా, లేదా?" అని అడిగాడు.

"అక్కడికి ఎవరు వెళ్ళేటట్టు? నేనే వెళ్ళిరానా?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

కంధుడు జవాబు యిచ్చే లోపలే, రుద్రుడు ముందుకు వచ్చి, "కపిలపురం వెళ్ళి, యిక్కడి సంగతి సందర్భాలు చెప్పి సహాయం నేను తీసుకువస్తాను. నన్ను పోనివ్వండి," అన్నాడు.

ఇందుకు కంధుడూ, ఉగ్రదత్తుడూ కూడా ఒప్పుకున్నారు. తరవాత కంధుడు తన అనుచరుల్లో ఒకణ్ణి పిలిచి, రుద్రుణ్ణి భయంకర పక్షి మీద ఎక్కించుకుని కపిలపుర రాజ్యంలోని అడవుల్లో దించాలని చెప్పాడు. దానికి వాడు అయిష్టంగా ముఖం పెట్టి, "అయ్యా, మీకు తెలుసు గదా?" ఈ ఉగ్రదత్తుణ్ణీ యితర్లనూ



పులిరాయుళ్ళు అపహరించి ఈ ద్వీపానికి తెచ్చినప్పటి నుంచీ, రాక్షసులూ, ప్రజలూ కూడా రేయింబవళ్ళు భయంకర పక్షుల కోసం కాపలా కాస్తున్నారు. మేము ఆ ప్రాంతాల దిగామో, వచ్చినపని చెప్పే ముందే మమ్మల్ని వాళ్ళు చంపేస్తారు!'' అన్నారు.

ఉగ్రదత్తుడు ఓ క్షణ కాలం ఆలోచించి, ''అయితే, రుద్రుడు ఒక పని చేస్తే పోతుంది. అడవిలో దిగేముందు తనెవరో అక్కడి కాపలావాళ్ళు తెలుసుకునేందుకు వీలుగా, తన దుస్తుల్లో ఏదో ఒకదాన్ని పైనుంచి కిందకు పడవెయ్యటం బావుంటుంది. నేను నా పెంపుడు తండ్రికి రాసే లేఖ నొకదాన్ని కూడా, ఆ దుస్తుల్తోపాటు పడవేస్తే, సంగతి సందర్భాలు వాళ్ళు తెలుసుకుంటారు,'' అన్నాడు.

ఈ ఉపాయం అందరికీ నచ్చింది. ఉదయం కాగానే ప్రయాణం అయేందుకు చేయవలసిన ఏర్పాట్లు చేసుకోవలసిందిగా, తన అనుచరుడికీ, రుద్రుడికీ చెప్పి, కంధుడు ఉగ్రదత్తుణ్ణి వెంటబెట్టుకు వెళ్ళి, అతడి కోసం ఏర్పాటు చేసిన శయనాగారాన్ని చూపించాడు.

• • •

తన కోటముందున్న ఆవరణలోని ఒక పెద్ద రాతి మీద తల రెండు చేతుల మధ్యా పెట్టుకుని విచారంగా కూచుని వున్న ఉగ్రాక్షుడి వద్దకు, అతడి బంట్లు యిద్దరు పరిగెత్తుకుంటూ వచ్చి, ''మహా నాయకా, ఏదో ప్రమాదం, అంతా అయోమయం. వాడికి మతిపోయన్నా వుండాలి!'' అంటూ వగరుస్తూ నిలబడ్డారు.

''ఏమిటి ప్రమాదం? ఏమిటి అయోమయం? ఏమిటీ వాగుడు? మీకేనా మతిపోయింది!'' అంటూ ఉగ్రాక్షుడు కళ్ళెర్ర చేసి తన బంట్లకేసి చూశాడు.

తమ నాయకుడి ముఖంకేసి చూస్తూనే, ఇద్దరు రాక్షస బంట్లూ తబ్బిబ్బు పడిపోయి, తడబడుతూ, ''ఎవరో ఒక జ్వాలా ద్వీపం వాడు పట్టపగలే మన అడవి మీద



ఎగురుతూ, కిందికి దిగాలని ప్రయత్నం చేస్తున్నాడు. మన కాపలావాళ్ళు వాడి మీదికి బాణాలూ, గదలూ విసిరారు. వాడు మూటలా కట్టిన ఏదో వస్తువును కింద పడవేసి, ఇంకా అక్కడే ఎగురు తున్నాడు,'' అన్నారు.

''ఆ వస్తువేది? వెంట తెచ్చారా?'' అన్నాడు ఉగ్రాక్షుడు కోపంగా.

''అది ఎక్కడో చెట్లలో పడింది. మన వాళ్ళు దానికోసం గాలిస్తున్నారు,'' అన్నారు రాక్షస బంట్లు.

''అయితే, ఈ లోపల మీకు మతులు పోయి పలవరిస్తూ, నా దగ్గిరకు పరిగెత్తు కొచ్చారన్న మాట! అక్కడికి పదండి!'' అంటూ హుంకరించి ఉగ్రాక్షుడు తన భటులవెంట బయలుదేరాడు.

ఉగ్రాక్షుడు అడవిలో కొంతదూరం వెళ్ళేసరికి ఒక ఎత్తయిన రాతిగుట్ట పక్కనే వున్న చెట్టుకింద కొందరు రాక్షసులూ, ప్రజలూ గుంపుగా కూడి రణగొణధ్వని చేస్తున్నారు. ఒక భయంకర పక్షి పైన చెట్ల మీద వలయాకారంగా ఎగురుతున్నది. ఉగ్రాక్షుడు తమ కేసి రావటం చూస్తూనే గుంపులో నుంచి ఒక రాక్షసుడూ, ఇద్దరు ప్రజలూ పరిగెత్తు కుంటూ అతడికి ఎదురువచ్చారు. రాక్షసుడి చేతిలో ఒక చిన్న రంగువస్త్రం, గుండ్రంగా కర్రకు చుట్టివున్న ఒక పత్రం వున్నాయి.

''మహానాయకా, ఆ భయంకర పక్షి మీద ముగ్గురు మనుషులున్నారు. అయితే వాళ్ళు పులిరాయుళ్ళు మాత్రం కాదు. వాళ్ళల్లో యిద్దరు ఎలుగ్గొడ్డు చర్మాలు ధరించి వున్నారు. ఒకవేళ అవి మనను మోసగించేందుకు ఆ దుర్మార్గులు వేసిన మారువేషాలేమో! వాళ్ళు వీటిని మూటలా కట్టి, కింద పడవేశారు,'' అంటూ వస్త్రాన్నీ, కర్రకు చుట్టివున్న పత్రాన్నీ ఉగ్రాక్షుడి కిచ్చాడు.

ఉగ్రాక్షుడు వాటిని అందుకుని పత్రాన్ని తెరిచి చూస్తూ, ''ఈ మానవ భాష చదవ

మనా నాకిస్తున్నావ్? బుద్ధిలేదా? ఒరే, నరమానవా, ఈ గిలుకుడేంటో చదువు!'' అంటూ పక్కన వున్న మనిషికిచ్చాడు. వాడు అంతా చదివి ఆశ్చర్యపోతూ, ''మహారాక్షసా! ఇది నీ పెంపుడు కొడుకు ఉగ్రదత్తుడు జ్వాలాద్వీపాన్నుంచి రాశాడు. ఆ భయంకర పక్షి మీద వున్న ముగ్గురిలో ఒకడు రుద్రుడట. తతిమ్మా యిద్దరూ భల్లూకరాయుళ్ళు, మనకు మిత్రులు,'' అన్నాడు.



''అహ్హా, నా ఉగ్రదత్తుడు బతికే వున్నాడా? నాకు మొదటి నుంచి వాడు ఏదో ఒకనాడు తిరిగి, నా అరణ్యరాజ్యం వస్తాడని నమ్మకం వున్నది. అరె! వాడే రాక, ఈ రుద్రుణ్ణి ఎందుకు పంపినట్టు? సరే, ఆ భయంకరపక్షి మీద వున్నవాళ్లకు కిందికి దిగమని సౌంజ్ఞలు చేయండి,'' అన్నాడు ఉగ్రాక్షుడు సంశయిస్తున్న వాడిలా.

కొందరు రాక్షసులూ, ప్రజలూ కలిసి చెట్ల మీది నుంచీ, గుట్టల మీది నుంచీ భయంకర పక్షి కేసి చేతులూ, పొడుగాటి చెట్ల కొమ్మలూ వూపుతూ దిగవలసిందిగా సౌంజ్ఞలు చేశారు. భయంకరపక్షి ఏటవాలుగా ఎగురుతూ వచ్చి ఉగ్రాక్షుడికి అల్లంత దూరంలో దిగింది. ఆ వెంటనే పక్షి మీది నుంచి రుద్రుడు చెంగున కిందికి దూకి, కేకలు పెడుతూ ఉగ్రాక్షుడి దగ్గిరకు పరిగెత్తుకు వచ్చాడు.

రుద్రుణ్ణి చూస్తూనే ఉగ్రాక్షుడికి ఎంతో ఆనందం కలిగింది. అతడు రుద్రుణ్ణి రెండు చేతులతో పైకెత్తి, ఆప్యాయంగా అటూ యిటూ వూపి కిందికి దించుతూ, ''ఉగ్రదత్తుడు క్షేమంగా వున్నాడా? వాడు నీతోపాటు ఎందుకు రాలేదు? అరుద్రుడేమయ్యాడు?'' అని అడిగాడు, ఆవేశంగా.

''ఉగ్రదత్తుడు క్షేమంగానే వున్నాడు. అరుద్రుడూ, సామంతరాజు సుదర్శనుడి కూతురు చంద్రసేనా పులిరాయుళ్ళవద్ద బందీలుగా వున్నారు. ఆ పులిరాయుళ్ళ



నాయకుడు ఏకపాదుడనే వాణ్ణి చంపితే తప్ప. వాళ్ళూ, ఉగ్రదత్తుడూ క్షేమంగా యిక్కడికి రాలేరు. అందుకు నిన్ను సహాయం రావలసిందిగా ఉగ్రదత్తుడు కోరాడు,'' అన్నాడు రుద్రుడు.

''నా కొడుకు నన్ను సహాయం రావలసిందని కోరటమా? ఏమిటీ మాటలు! వాడు నా నుంచి పారిపోవాలని చూసినా, పధ్నాలుగు లోకాలూ గాలించి పట్టుకుని కాళ్ళూ చేతులూ కట్టి, కోటలో పడవేస్తాను. నా తరవాత ఈ అరణ్యరాజ్యానికి నాయకు లెవరు?'' అంటూ పట్టరాని ఆగ్రహంతో అడవి మార్మోగేలా ఉగ్రాక్షుడు హుంకరించాడు.

ఉగ్రాక్షుడు కొంత శాంతించిన తరవాత రుద్రుడు, జ్వాలాద్వీపంలో వున్న రెండు శత్రుపక్షాల సంగతీ, భల్లూకరాయుళ్ళ నాయకుడైన కంధుడు తనకు చేసిన సహాయం సంగతీ చెప్పాడు.

''పడవల్లో బయలుదేరి రావాలి. మీరు జ్వాలాద్వీపం చేరేందుకు రెండు పగళ్ళూ, రెండు రాత్రులూ పడుతుంది. దారి చూపేందుకు ఒక భల్లూకరాయుడు నా వెంట వచ్చాడు,'' అంటూ అతణ్ణి ఉగ్రాక్షుడికి పరిచయం చేశాడు. తరవాత రుద్రుడు దారి చూపవచ్చిన భల్లూకరాయుణ్ణి ఉగ్రాక్షుడి దగ్గిర వదిలి, తాను మరుక్షణమే తిరిగి జ్వాలాద్వీపం వెళ్ళిపోయాడు.

ఉగ్రాక్షుడు తన బంట్లలో మెరికలవంటి వారిని అయిదు వందలమందిని ఏరి, వాళ్ళతో జ్వాలాద్వీపం వెళ్ళేందుకు ప్రయాణం కట్టాడు. వాళ్ళు మహారణ్యాల్లో పడి, కొండలూ, నదులూ దాటుతూ, వారం రోజుల తరవాత సముద్రతీరం చేరారు.

రాక్షసుల్లో చాలామంది సముద్రాన్ని యిదే మొదటిసారిగా చూడటం. కంటి కానివంతవరకూ వున్న ఆ మహాప్రవాహాన్ని చూస్తూనే వాళ్ళు చెప్పలేనంతగా నివ్వెరపోయారు. ''ఇంత మహాసముద్రం మధ్య



నేల ఎలా వుంటుంది? ఇందులో ఏదో మోసం వున్నది. ఎలాగయినా మనకు నీటి గండం తప్పదు," అని వాళ్ళు గుసగుసలు ప్రారంభించారు.

ఈ సంగతి తన చెవిని పడగానే ఉగ్రాక్షుడు రౌద్రరూపం దాల్చి, "అడవి చెట్లు నరికి, వాటి బొదులతో ఒక్కొక్కటి యాభైమందిని మోయగలిగేట్టుగా పది పడవలు కట్టండి. వాటిని జాగ్రత్తగా కట్టుకున్నారా, మీరు సముద్రం దాటి జ్వాలాద్వీపం చేరుతారు. లేదా మీరు భయపడుతున్నట్టు మీకు నీటిగండం తప్పదు!" అన్నాడు.

ఉగ్రాక్షుడి హెచ్చరిక రాక్షసుల్లో ఒక చెంప భయాన్నీ, మరో చెంప ఆత్మవిశ్వాసాన్నీ, తెగువనూ కలిగించింది. వాళ్ళు మహావృక్షాలను వేళ్ళకంటా ఊడబెరికి, ఊడలతో ఒక మానుకూ ఇంకొక మానుకూ బంధాలు బిగించి పెద్దపెద్ద తెప్పపడవలు తయారు చేశారు.

అన్నీ సిద్ధమై ఒకనాటి సూర్యోదయం వేళ ఉగ్రాక్షుడు సముద్రం మీద బయలుదేర పోతూండగా, చిత్రసేనుడి దగ్గిర నుంచి ఒక దూత అక్కడికి వచ్చాడు. అతడి ద్వారా, జ్వాలాద్వీప పరిస్థితులు చిత్రసేనుడికి తెలుసునన్న విషయం ఉగ్రాక్షుడు తెలుసుకున్నాడు. తన దూత ద్వారా చిత్రసేనుడు, ఉగ్రాక్షుడికి కొంత సైనిక సహాయం చేస్తానని కబురు పంపాడు.

"తన కుమారుణ్ణి పులిరాయుళ్ళు ఎత్తుకుపోయారని తెలిసి, మహారాజూ, మహారాణీ దుఃఖసాగరంలో మునిగిపోయారు. ఈ వార్తతోపాటు సామంతుడి కుమార్తె చంద్రసేన కూడా అపహరించబడిందని తెలిసి మరింత బాధపడ్డారు. ఆ సామంతరాజు సుదర్శనుడు లోగడ ద్రోహి నాగవర్మతో జరిగిన యుద్ధాల్లో మహారాజుకు ఎంతగానో సహాయపడ్డాడు. ఆయన మహారాణికి బంధువు కూడా. రాకుమారి చంద్రసేనతో యువరాజుకు

వివాహం జరపటం బావుంటుందని కూడా వారు భావిస్తున్నారు.'' అని చెప్పాడు దూత.

దూత మాటలు వింటూనే ఉగ్రాక్షుడు కోపంతో నిలువెల్లా కంపించిపోయాడు. రాతి గదను దూతపైకి ఎత్తబోయినవాడల్లా తమాయించుకుని, ''వాడు యువరాజు కాదు. ఉగ్రదత్తుడు, నా కుమారుడు! నా కుమారుడి కోసం దుఃఖించే హక్కు మీ రాజుకూ, రాణికీ లేదన్నానని చెప్పు. ఈ సామంతుడెవడు? సుదర్శనుడెవడు? వాడి పేరు కూడా ఎన్నడూ వినలేదే! వాడి కుమార్తె చంద్రసేన ఉగ్రదత్తుడికి తగునో తగదో తేల్చవలసినవాణ్ణి, నేను! తెలిసిందా? ఇక వెళ్ళు!'' అంటూ హుంకరించాడు.

ఉగ్రాక్షుడితో యింకేమి చెప్పినా తన ప్రాణానికే ముప్పు రావొచ్చని భావించిన దూత తిరిగి చూడకుండా అక్కడి నుంచి పారిపోయాడు. తరవాత ఉగ్రాక్షుడి ఆజ్ఞ కాగానే రాక్షసులు పడవలను సముద్రం లోపలికి కొంతదూరం లాగి, పశువుల చర్మాలతో కుట్టిన తెరచాపలను గాలి వాలుకు ఎత్తారు. అన్నిటికన్నా ముందున్న పడవలో దారి చూపేందుకు వచ్చిన భల్లూకరాయుడు ఎక్కాడు.

రాక్షసులెక్కిన పడవలు ఏ ప్రమాదం లేకుండానే ఆ పగలూ, రాత్రీ సముద్రంలో ఎక్కడా ఆగకుండా తూర్పు దిక్కుగా ప్రయాణించినై. కాని, మర్నాటి సూర్యోదయం వేళకు వాళ్ళకు దూరంగా సముద్రంలో ఆకాశం ఎత్తు భయంకరమైన మంటలు కనిపించినై. ''జ్వాలాద్వీపం! జ్వాలాద్వీపం!'' అంటూ కొంత భయంగా, కొంత ఉత్సాహంగా రాక్షసులు గట్టిగా కేకలు పెట్టారు. ఆ తరవాత కొద్దిసేపటికల్లా, ద్వీపం వైపు నుంచి తమకేసి వస్తున్న నల్లని నలుసంత చిన్న ఆకారం ఒకటి వాళ్ళకు కనిపించింది. అది చూస్తూండగానే క్రమక్రమంగా పెరిగి పెద్దదై— భయంకరపక్షిగా పడవల మీద ప్రత్యక్షమైంది. —(ముగింపు వచ్చే సంచికలో)





# జ్వాలాద్వీపం

## 18

[జ్వాలాద్వీపం నుంచి ఉగ్రదత్తుడు తన పెంపుడు తండ్రి అయిన ఉగ్రాక్షుడికి సహాయం రావలసిందిగా వార్త పంపాడు. వెంటనే ఉగ్రాక్షుడు తన రాక్షస బంట్లతో పడవల మీద జ్వాలా ద్వీపానికి బయలుదేరాడు. పడవలు ఒక పగలూ, రాత్రీ ప్రయాణం చేసి సముద్ర మధ్యంలో వుండగా, ఒక భయంకరపక్షి వాళ్ళ మీద దాడి చేసేందుకు వేగంగా వచ్చింది. తరవాత—]

భయంకర పక్షిని చూస్తూనే రాక్షసులు హడలెత్తిపోయారు. ఉగ్రాక్షుడు ఉరుము లాంటి పెద్ద గొంతుతో, ''కాగడాలను చమురులో తడిపి, వెలిగించండి!'' అని కేక పెట్టాడు. వెంటనే రాక్షసులు కాగడాలు వెలిగించారు. భయంకర పక్షి మీద వున్న రౌతులు ఆకాశంలో అంత ఎత్తున ఎగురుతూనే, పడవుల మీద వున్న రాక్షసుల మీదికి ఈటెలూ, పెద్ద పెద్ద రాళ్లూ విసర సాగారు. ఈ విధంగా ఓ పావుగంట కాలం పోరాటం జరిగిన తరవాత భయంకరపక్షి మీద వున్న పులిరాయుళ్ళు, పడవల మీద దిగబోతున్నవాళ్ళలా పక్షిని సూటిగా కిందికి దూకించి, అంతలోనే పైకి ఎగిరిపోతూ కొంతసేపు అట్టహాసం చేసి, చివరకు జ్వాలాద్వీపం దిక్కుగా వెళ్ళిపోయారు.

ఏ కారణం వల్లనో ఆ పగలూ, రాత్రీ కూడా పులిరాయుళ్ళు మళ్ళీ రాక్షసుల



మీద దాడికి రాలేదు. మూడవరోజు సూర్యోదయం అయేసరికి పడవలు జ్వాలాద్వీపాన్ని సమీపించినై.

''పడవల్ని మరికొంతదూరం పడమటి దిక్కుగా పోనివ్వండి. అక్కడ మండుతున్న రెండు అగ్నిపర్వతాల మధ్యగా ఒక లోయ వున్నది. ఆ ప్రాంతాన మనం తీరం చేరి, ఆ లోయకుండా ద్వీపం మధ్యకు వెళ్ళవచ్చు.'' అన్నాడు రాక్షసులకు దారి చూపవచ్చిన భల్లూకరాయుడు.

భల్లూకరాయుడు చెప్పినట్టే పడవలు తీరాన్ని అంటిపెట్టుకుని మరి కొంచెం ముందుకు వెళ్ళేసరికి, రెండు అగ్నిపర్వతాల మధ్యగా పొడవైన లోయ ఒకటి కనిపించింది. కాని, ఉగ్రాక్షుడూ, భల్లూకరాయుడూ ఆశించినట్టు లోయ నిర్మానుష్యంగా లేదు. లోయ ముఖద్వారాన్ని ఆక్రమించుకుని వున్న పులిరాయుళ్ళతో, భల్లూకరాయుళ్ళు హోరాహోరి పోరాడుతున్నారు. కొన్ని భయంకర పక్షులు లోయకు చివర వున్న భల్లూకరాయుళ్ళ మీద దాడి చేస్తున్నవి.

రాక్షసులందరూ పడవలు దిగి తీరం చేరేసరికి, పులిరాయుళ్ళు లోయలో పోరాడుతూ భల్లూకరాయుళ్ళ మధ్యగా దారి చేసుకుని ద్వీపం లోపలికి పారిపోసాగారు. భల్లూకరాయుళ్ళు అందినవాళ్ళను అందినట్టు చంపుతూ, రాక్షసులున్న చోటుకు చేరారు. అందరికన్న ముందున్న భల్లూకరాయుడొకణ్ణి చూస్తూనే, ఉగ్రాక్షుడు అదిరిపడి, ''ఉగ్రదత్తా! ఏమిటీ వేషం?'' అంటూ అతడి చేతులు పట్టుకుని పైకెత్తి భుజం మీద కూర్చోపెట్టుకున్నాడు.

తమ ప్రబల శత్రువైన ఏకపాదుడితో పోరాడేందుకు రాక్షసులు సహాయం రావటం భల్లూకరాయుళ్ళకందరికీ ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. ఉగ్రదత్తుడు నాలుగు మాటల్లో శత్రుపక్ష బలాన్ని గురించి, తన పెంపుడు తండ్రితో చెప్పి, భల్లూకరాయుళ్ళ నాయకుడైన కంధుణ్ణి



పరిచయం చేస్తూ, "ఈయనే వీళ్ళ నాయకుడు. నన్ను పులిరాయుళ్ళ నుంచి కాపాడాడు." అన్నాడు.

కంధుడు ఉగ్రాక్షుడికి ప్రణామం చేసి, "ఉగ్రాక్షా! నీ రాకవల్ల మాకు కొండ గుహల్లో, బిలాల్లో చీకటిబతుకు తప్పింది. ఏకపాదుడి వంటి మహాక్రూరుడు యిక పుట్టబోడు. కేవలం బానిసలు చేసే కాయకష్టం మీద బతుకుతూ, ప్రపంచం మీద అధికారం చెలాయించాలని చూసే, ఏకపాదుణ్ణీ అతడి మిత్రులైన కరవీరుడూ, నాగవర్మలను నాశనం చేయగలిగితే, మీ దేశానికీ, ఈ జ్వాలాద్వీపానికీ కూడా ఎంతో క్షేమం కలుగుతుంది," అన్నాడు.

"దానికి ఆలస్యం ఎందుకు? వాడి కోటను ముట్టడిద్దాం. మీరు దారి చూపితే చాలు," అన్నాడు ఉగ్రాక్షుడు, తన పెంపుడు కొడుకును భుజం మీది నుంచి దించుతూ.

"అది అంత తొందరపడి చేసే పని కాదు. నిదానంగా ఆలోచిద్దాం. ఇప్పుడు వాడి చేతిలో చంద్రసేన అనే రాకుమార్తె వున్నది. ఆమెకు హాని కలక్కుండా చూడాలి. అంతేకాక, అరుద్రుడనే మీ వాడొకడు, ఎప్పుడూ వాణ్ణి అంటిపెట్టుకు తిరుగుతూ, మీ గుట్టుమట్లన్నీ వాడికి చెపుతున్నట్టు, అక్కడినించి పారిపోయి వచ్చిన మీ దేశం వాళ్ళు చెపుతున్నారు," అన్నాడు కంధుడు.

అరుద్రుడు ద్రోహిగా మారాడని వింటూనే ఉగ్రాక్షుడు కళ్ళెర్రచేసి, "రుద్రుడెక్కడ?" అని హుంకరించాడు.

రుద్రుడు భయపడుతూ అతడి ముందుకు వచ్చి నిలబడ్డాడు.

"ఏమిరా, అరుద్రుడు యింత ద్రోహి ఎలా అయాడు? వాడూ నీవూ ప్రాణ స్నేహితులు గదా?" అని అడిగాడు ఉగ్రాక్షుడు.

"వాడికి నేనొక్కణ్ణే ఏమిటి, ఉగ్రదత్తుడు కూడా ప్రాణస్నేహితుడే! బహుశా, చంద్రసేనను పెళ్ళాడాలనే ఆశతో, వాడు




మనకు ద్రోహం తలపెట్టి, పులిరాయుళ్ళ నాయకుడి పక్షం అయి వుంటాడు,'' అన్నాడు రుద్రుడు బెదురుగా.

''చంద్రసేన నా కొడుకును పెళ్ళాడ వలసిందే! దానికి తిరుగు లేదు. ఆ ఆరుద్రుణ్ణి నరికి ఉప్పుపాతర్లో వేస్తాను,'' అంటూ ఉగ్రాక్షుడు రంకెలు పెట్టసాగాడు.

''శాంతించు, ఉగ్రాక్షా! ఇంతవరకూ నీకు చెప్పకుండా దాచిన రహస్యం ఒకటి వున్నది. ఏకపాదుణ్ణి చంపటం తేలిక కాదు. వాడికో శక్తి వున్నది. వాడెవరి నెత్తురు చూసినా, లేక వాడి నెత్తురు ఎవరు చూసినా—తప్పక మరణిస్తారు!'' అన్నాడు కంధుడు నిస్పృహగా.

కంధుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు తికమకపడ్డాడు. అతడికి వెంటనే వాటి భావం అర్థం కాలేదు. కాని, ఆ అర్థం స్ఫురించగానే అతడు నివ్వెరపోయాడు. ''కంధా, యిలాంటిది నేనెక్కడా విన లేదు. అయితే, ఆ ఏకపాదుణ్ణి నెత్తురు చిందించకుండా చంపటం ఎలా?'' అన్నాడు.

''మనలో కొందరు చావటానికి సిద్ధ పడాలి. కొండశిఖరాన వున్న వాడి కోటలో జొరపడటం పెద్ద సమస్య కాదు. మనకూ కొన్ని భయంకరపక్షు లున్నవి గనక, శత్రువులు మనను వాటితో అడ్డగించలేరు. నీ బంట్లలో ఒక్కొక్కడు నూరుమంది పులిరాయుళ్ళను అవలీలగా చుట్ట చుట్టి దూరంగా పారవెయ్యగలడు. కాని, మనం కోటను వశపరుచుకుని, ఏకపాదుణ్ణి పట్టుకునేందుకు ప్రయత్నించటంలోనే ప్రమాదం వున్నది. వాడు కత్తితో శరీరం మీద కొన్ని గాట్లు పెట్టుకుని ఎదురయ్యా డంటే—మనలో ఒక్కరు కూడా ప్రాణా లతో అక్కడి నుంచి తిరిగి రాలేం,'' అన్నాడు కంధుడు.

''వాడు చాలా బలవంతుడు కూడానా?'' అని అడిగాడు ఉగ్రాక్షుడు.

''బలవంతుడా, ఛీ, ఛీ! వట్టి అర్భకపు వెధవ. పైగా ఒంటికాలువాడు! చేతికి

దొరికితే పదేళ్ళ కుర్రవాడు వాణ్ణి, కోట గోడల మీది నుంచి కిందికి దొర్లించ వచ్చు.'' అన్నాడు కంధుడు.

''అయితే, నా బంట్లలో కొందరు చావ టానికి సిద్ధపడతారు. మనం వాడి కోట లోకి వెళ్ళిన తరవాత, వాడు ఎక్కడ వున్నాడో చూస్తూ, ఒకడు ముందుకు నడుస్తూంటాడు. మనం అందరం తలలు ఎత్తకుండా నేలవంక చూస్తూ, వాడి వెనక నడుస్తాం. ముందున్నవాడు, ఆ దుర్మార్గుణ్ణి చూస్తూనే ఎక్కడ వున్నదీ కేక పెట్టి, చచ్చినా ఫరవాలేదు. మనం కళ్ళు మూసుకునే వాణ్ణి చుట్టు ముట్టి, కళ్ళు మూసుకునే వాడి ప్రాణాలు తీద్దాం,'' అన్నాడు ఉగ్రాక్షుడు.

''ఆ తరవాత, మనం కళ్ళు తెరవగానే రక్తం కనబడుతుంది గదా?'' అని ప్రశ్నించాడు కంధుడు తల అడ్డంగా తిప్పుతూ.

''ఇది చాలా గడ్డు సమస్య! ఇక్కడ వుండి ఆలోచించలేం. వాణ్ణి చంపిన తరవాత అదంతా చూద్దాం. వాడి కోటకు దారి తీయండి,'' అంటూ ఉగ్రాక్షుడు చకచకా ముందు నడిచాడు.

భల్లూకరాయుళ్ళు దారి చూపగా అందరూ లోయలో కొంత దూరం నడిచి, అక్కడ ఎడమపక్కగా కొండపాదంలో



వున్న ఎగుడు దిగుడు రాళ్ళ మీదుగా ఎక్కి, శిఖరాన వున్న కోటకేసి పోసాగారు. ఆకాశంలో ఎక్కడా భయంకర పక్షుల జాడగాని, కొండ మీద పులిరాయుళ్ళ అచూకీ గానీ లేదు. అంతా నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వున్నది.

''ఏకపాదుడేదో ఎత్తు వేశాడు! శరీర మంతా నెత్తురు చేసుకుని, హఠాత్తుగా వాడు కోట గోడ మీద కనిపించి, మనమ చంపాలని పథకం వేసి వుండొచ్చు.'' అన్నాడు కంధుడు.

''ముందు నడిచేవాడు తప్ప, తతిమ్మా వాళ్ళెవరూ కోట గోడలకేసి చూడకండి!'' అని ఉగ్రదత్తుడు కేక వేశాడు.



ఆ విధంగా అందరూ కోట గోడలను సమీపించేసరికి, వాటి మీద ఏదో కలకలం వినబడ సాగింది. అయినా ఎవరూ తలలు ఎత్తలేదు. కొద్దిసేపటికల్లా గోడల మీది నుంచి ఏకపాదుడి గొంతు కంచులా మార్మోగింది: "ఇదుగో, అందరూ చూడండి! సుదర్శనుడి కుమార్తె చంద్రసేనను యింత ఎత్తు నుంచి అమాంతం కిందికి పడవేస్తున్నాను."

ఏకపాదుడి బెదిరింపు వింటూనే ఉగ్రాక్షుడితోపాటు అందరూ నివ్వెరపోయారు. కాని, ఎవరూ తలలు ఎత్తలేదు. ఇంతలో కోట గోడల మీది నుంచి, "ద్రోహం! మోసం!" అన్న అరుపూ, ఆ వెంటనే, "ఉగ్రదత్తా! చంద్రసేన జారవిడిచిన తాళ్ళ ఆధారంతో పైకి రండి! ఏకపాదుణ్ణి తోలు సంచీలో పెట్టి మూతి బిగించాను, భయం లేదు. కాని, ద్రోహి నాగవర్మ, కరవీరుడూ, ఈ ప్రాంతాన ఎక్కడో పొంచి వున్నారని నా భయం!" అంటూ అరుద్రుడు కేక పెట్టాడు. ఆ వెంటనే కత్తులు ఒకదాన్నొకటి తాకిన శబ్దమైంది. చంద్రసేన ఒక చేత్తో కత్తి పైకెత్తి, గోడ మీది నుంచి, "అరుద్రుడు కరవీరుడితో పోరాడుతున్నాడు. ఇదుగో, ద్రోహి నాగవర్మ!" అంటూ కోట లోపలి ఆవరణలోకి దూకింది.

ఉగ్రదత్తుడూ, ఉగ్రాక్షుడూ తమ వాళ్ళను హెచ్చరిస్తూ కేకలు పెట్టి, కోట గోడ నుంచి కిందికి చంద్రసేన జార్చిన తాళ్ళు పట్టుకుని గబగబా పైకి పాకారు. వాళ్ళు కోట ఆవరణలోకి దిగేసరికి, కరవీరుడితో అరుద్రుడూ, ద్రోహి నాగవర్మతో చంద్రసేనా కత్తియుద్ధం చేస్తున్నారు. ఉగ్రాక్షుడు ఆ దృశ్యం చూస్తూనే పొంగిపోయి, "ఇదుగో, వస్తున్నాను, చంద్రసేనా! క్షత్రియ కన్య వనిపించుకున్నావు. నీ కాబోయే అత్తగారు లోగడ ఈ విధంగానే కత్తి దూసి మేనా దిగి, పులిరాయుళ్ళతో యుద్ధం చేయటం నా కళ్లారా చూశాను!" అంటూ నాగవర్మ కేసి రాతి



గద ఎత్తబోయేంతలో, వాడు చంద్రసేన విసిరిన కత్తి గుండెల్లో తగలగా, ''అబ్బా!'' అంటూ వెనక్కు పడిపోయాడు. రాకనుల్ని చూసి పారిపోబోయిన కర వీరుడి వెన్నులో అరుద్రుడు విసిరిన కత్తి దిగింది. వాడు ''అమ్మా!'' అంటూ ముందుకు పడిపోయాడు.

కంధుడు మహోత్సాహంతో ఏకపాదు డున్న తోలు సంచిని పైకెత్తి, ''ఏకపాదా! లోపల ఉక్కగా వున్నదా? ఇదుగో, ఇప్పుడే నిన్ను ఆ మండే అగ్ని పర్వత ముఖంలో జారవిడుస్తాను! నీకూ, లోకాని క్కూడా హాయిగా వుంటుంది.'' అంటూ దాపులనే వున్న అగ్నిపర్వతం కేసి పరిగెత్తాడు.

''నేను, మీపట్ల ద్రోహిగా నటించబట్టే, ఏకపాదుడు నన్ను నమ్మాడు. చంద్ర సేనకు ప్రాణాపాయం కలగనున్నదని బెదిరించి, మీరు కోట గోడలకేసి చూడ గానే, తన శరీరం మీద గాట్లు పెట్టుకుని మిమ్మల్నందర్నీ చంపాలని వాడు చూశాడు. ఇలాంటి అవకాశం కోసమే ఎదురుచూస్తున్న నేను, వెనక నుంచి మీద పడి, వాణ్ణి తోలు సంచీలో పెట్టి మూతిబిగించాను.'' అన్నాడు అరుద్రుడు. అతడి తెలివితేటల్ని అందరూ మెచ్చు కున్నారు.

• • •

ఉగ్రాక్షుడూ, ఉగ్రదత్తుడూ, చంద్ర సేనా తమ పరివారంతో కలిసి తమ దేశం చేరగానే, చిత్రసేనుడూ, సామంతరాజు సుదర్శనుడూ పొందిన ఆనందం అంతా యింతా కాదు. ఒక శుభ ముహూర్తాన ఉగ్రదత్తుడికీ, చంద్రసేనకూ వైభవంగా వివాహం జరిగింది. ఆ వివాహనికి కంధుడు వెలలేని కానుకలు తీసుకుని, కపిలపురానికి వచ్చాడు. ఉగ్రదత్తుడు తన మామగారయిన సుదర్శనుడి సామంత రాజ్యానికీ, తన పెంపుడు తండ్రి అయిన ఉగ్రాక్షుడి అరణ్య సీమకూ రాజై చాలాకాలం సుఖంగా రాజ్య పాలన చేశాడు. —(అయిపోయింది)

